అక్టోబరు విప్లవ దినోత్సవ ప్రత్యేక సంచిక

**1992 నవంబరు**

# కార్మిక లోకం

CITU



# సోవియట్ ఘటనలపై తెలుగు ఘజల్

— డా॥ సి. నారాయణరెడ్డి

కాలదన్నితే చేసిన త్యాగం ధూళిలో అణిగిపోదు
చరిత్రనే నిర్మించిన మూర్తిని చెరిపేస్తే చెరిగిపోదు
ఏ ఉన్మాదం తల కెక్కిందో ఏమిటి ఈ హంగమా
వేళ్ళు నాటుకున్న సామ్యవాదం విదిలిస్తే ఒరిగిపోదు
డబ్బు మబ్బులో రుచులు మరిగితే ఉబ్బుతుందిరా ఒళ్ళు
చెమటను నమ్ముకు దూసుకుపోయే శ్రమశక్తి వీగిపోదు
ఇ తలోనే భూస్వామ్య భూతమా ! ఎందుకెగిరి పడతావు
చేటు కాలమిది; మట్టిగొంతు ఏ నాటికి విరిగిపోదు
కొవ్వు పొరల్లో సోమరితనాన్ని కుదించుకుంటున్నారా
అవరోధాలు బిగిస్తే ప్రగతికి ఆయుస్సు తరిగిపోదు
తల్లి రొమ్మునే వేలంవేసే తనయులు పుడుతున్నారు
ఏ ద్రోహులు ఏమన్నా కదిలే ఈ శ్వాస ఆగిపోదు
సూదికంటితో ఎన్ని మార్పులను చూశావోయి 'సి నా రె'
పై నున్న మంచు నీరుగారినా పర్వతం కరిగిపోదు

అక్టోబరు విప్లవ దినోత్సవ ప్రత్యేక సంచిక

# కార్మిక లోకం

సి.ఐ.టి.యు. ఆంధ్రప్రదేశ్ కమిటి మాసపత్రిక

సంపుటి : 18 నవంబరు 1992 వెల రు. 5.00 సంచిక : 11

# నయా వలస విధానాన్ని ప్రతిఘటించండి
# అక్టోబరు విప్లవ దినోత్సవ పిలుపు

## సంపాదకీయం

ప్రపంచాన్ని కుదిపి వేసినవి ఏడు రోజులు !

ప్రపంచ పీడిత ప్రజల ఆశాజ్యోతి వెలిగింది !!

కార్మికవర్గ నాయకత్వాన ప్రప్రథమ సోషలిస్టు ప్రభుత్వం ఏర్పడింది!!!

నూతన సమాజం ఆవిర్భవించింది.

దోపిడీ, పీడనల అంతానికి అంకురార్పణ జరిగినది.

అదే అక్టోబరు విప్లవం ; అదే నవంబరు 7 బోల్షివిక్ ప్రభుత్వ స్థాపన.

ప్రపంచమంతా జేజేలు పలికింది.

రవీంద్రనాద్ టాగూర్, జార్జి బెర్నార్డ్‌షా, ప్రేమ్‌చంద్ లవంటి మహాకవులు, రచయితలు రోమారోలా, బెట్రాన్, రసెల్ ల వంటి ఋషిసత్తములు, నెబ్స్, కెబ్స్, హెచ్.జి. వెల్స్ వంటి సోషలిస్టు ప్రముఖులు. జవహర్ లాల్ నెహ్రూ వంటి రాజకీయ దురంధరులు ఈ విప్లవ ఫలితమైన సోషలిస్టు సమాజాన్ని ఆశీర్వదించారు, అభినందించారు, అండదండలందించారు.

ఇంతింతై వటుడింతయై . . . బ్రహ్మాండమంతమైనట్లు . .

అక్టోబరు విప్లవం తూర్పుయూరప్ దేశాల్లో, ప్రపంచంలో కెల్లా పెద్ద దేశమైన చైనాలో, ప్రపంచంలో కెల్లా బలవత్తరమైన అమెరికన్ సామ్రాజ్యవాదాన్ని వెదురు బొంగులతోను నాటు తుపాకులతోనూ ఎదిరించి పోరాడి సోషలిస్టు దేశాల సాయంతో ఓడించిన వియత్నాంలో, అమెరికన్ సైన్యాలను పసిఫిక్ మహాసముద్రంలో పడునట్లు తరిమికొట్టిన కొరియాలో అక్టోబరు విప్లవం వెలిగించిన జ్యోతి ప్రజ్వరిల్లి, పెట్టుబడిదారీ, ఫ్యూడల్ వ్యవస్థలను కూలగొట్టి సోషలిస్టు సమాజ నిర్మాణానికి పూనుకొని సోషలిస్టు ప్రపంచాన్ని, సోషలిజాన్ని ప్రపంచ వ్యాప్తంగావించడాన్ని సాధించింది.

అయితే పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రపంచ వ్యాప్తంగా కూలిపోలేదు. అమెరికాలో, బ్రిటన్ లో, ఫ్రాన్సులో, ఇటలీలో, పశ్చిమ జర్మనీలో, జపాన్ లో నిలదొక్కుకుంది, మాటుకాచింది, కాగా వ్యవస్థా నిర్మాణంలో జరిగిన కొన్ని లోపాలను అవకాశంగా తీసుకున్నది. అదను చూసి కాటువేసింది. తూర్పు యూరప్‌లో, సోవియట్ యూనియన్ లో సోషలిస్టు ప్రభుత్వాలు కుప్పకూలాయి.

మనిషి రక్తం రుచిమరిగిన పులి మనిషి వేట ప్రారంభిస్తుంది.

అమెరికా నాయకత్వాన సామ్రాజ్యవాదం చైనా, క్యూబా, వియత్నాం, ఉత్తర కొరియాలపై దృష్టి సారించాయి. మూడవ ప్రపంచ దేశాలపై వేట మొదలుపెట్టాయి.

ఈ దాడికి గురి అయ్యే దేశాలలో మన దేశం మొదటి వరుసలో వున్నది. ఈ దాడిలో బలి అయ్యేది మన దేశ స్వాతంత్ర్యం, సార్వభౌమత్వం, స్వావలంబనం.

పి.వి. ప్రభుత్వ పుణ్యమా అని 40 సం॥లుగా మనం నిర్మించుకున్న ప్రభుత్వ రంగం శిథిలమౌతున్నది.

మన ఆర్థిక వ్యవస్థ అమెరికా, జపాన్, జర్మనీ గుత్తపెట్టుబడుల గుప్పిళ్ళలో చిక్కుకుంటున్నది.

మన పరిశ్రమలు వేలకు వేలుగా మూతబడుతున్నాయి. మన కార్మికులు లక్షలాదిగా నిరుద్యోగులౌతున్నారు.

మన విజ్ఞాన పరిశోధనా రంగం మూలపడే ప్రమాదాన్ని ఎదుర్కొంటున్నది.

ఇదంతా మనకు అప్పులివ్వటం పేరుతో, మనలను 21 శతాబ్దంలోకి ఉద్ధరించటం పేరుతో అమెరికన్, తదితర సామ్రాజ్యవాదులు చేస్తున్నదాడి,

చాపక్రింద నీరులాగ మన ఆర్థిక వ్యవస్థలో ప్రవేశించి దాని గొంతు నులిమివేసే ప్రయత్నం. ఇదే నూతన వలస విధానం.

దీనికి వ్యతిరేకంగా పోరాడటం భారతీయులందరి కర్తవ్యం; మన స్వాతంత్ర్యాన్ని, సార్వభౌమత్వాన్ని కాపాడుకొనటం మన దేశభక్తి పూరిత ప్రయత్నం !

ఇందుకై కార్మికవర్గం నాయకత్వం వహించాలి.

అక్టోబరు విప్లవం జయించి, రష్యాలో కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడిన తర్వాత దానిని నాశనం చేయటానికై 14 సామ్రాజ్యదేశాలు, పెట్టుబడిదారీ దేశాలు ఆ శిశు హత్యకు ప్రయత్నించినవి. కాని రష్యా ప్రజల దేశభక్తి, అప్రతిహత సాహసము ఆ సామ్రాజ్యవాదుల దాడిని తిప్పికొట్టినవి.

ఇప్పటి నూతన వలస విధానం మన మెరగనిదికాదు; మోస పూరితమైన వ్యూహం; కపటంతో గొంతు నులమటం.

దీనిని మనం భగ్నం చేయాలి; ఇందుకై నవంబరు 7న మనం దీక్షాబద్ధులం కావాలి.

# అభివృద్ధి పథంలో 'లాంగ్‌మార్చ్' చేస్తున్న జనచైనా

అల్లూరు సత్యనారాయణ
సి.ఐ.టి.యు. రాష్ట్ర ఉపాధ్యక్షులు

చైనా, భారత దేశాల మైత్రి అభివృద్ధి పరచుకోవడం కోసం చైనా ప్రజల, కార్మికుల స్థితిగతులను అభివృద్ధిని భారత కార్మికవర్గానికి, ప్రజలకు తెలియపరచడం కొరకు అఖిల చైనా కార్మిక సమాఖ్య (ఎ.సి.ఎఫ్.టి.యు.) భారత దేశంలోని సి.ఐ.టి.యు. ప్రతినిధివర్గాన్ని చైనాకు ఆహ్వానించింది. ఈ ఆహ్వానం మేరకు మన దేశం నుండి సి.ఐ.టి.యు. కేంద్ర కమిటీ సభ్యులైన శ్రీ కె.కె. దివాకరన్ (కేరళ) నాయకత్వాన నలుగురుతో కూడిన ప్రతినిధివర్గం ఎంపిక చేయబడింది. ఈ ప్రతినిధి బృందంలో నాతోబాటు బెంగాల్‌కు చెందిన సుమన్ కుందు, గోవాకు చెందిన రోయీ ఫెర్నాండెజ్‌లు కూడా వున్నారు.

మేము నలుగురం సెప్టెంబరు 2వ తేదీ రాత్రి న్యూఢిల్లీలో బయలుదేరి 3వ తేదీ రాత్రికి బ్యాంకాక్ మీదుగా బీజింగ్ చేరుకున్నాము. బీజింగ్ విమానాశ్రయంలో ఎ.సి.ఎఫ్.టి.యు.కు చెందిన విదేశీ వ్యవహారాలు చూసే డిపార్టుమెంటులో ముఖ్యులైన కామ్రేడ్ గౌషున్ (డిప్యూటి సెక్షన్ చీఫ్, ఇంటర్నేషనల్ వైజాన్ డిపార్టుమెంటు ఆఫ్ ఎ.సి.ఎఫ్.టి.యు), కామ్రేడ్ టావో మరికొంత మంది మమ్మల్ని సాదరంగా ఆహ్వానించారు. కామ్రేడ్ టావో మా మొత్తం పర్యటనకు దుబాసీగాను, సహాయకుడిగాను వున్నారు.

3వ తేదీ నుండి 14వ తేదీ వరకు మేము చైనాలో పర్యటించి 15కు ఢిల్లీ చేరుకున్నాము. ఈ మొత్తం పర్యటనలో చైనా రాజధాని బీజింగ్ నగరం, ప్రపంచ వింతల్లో ఒకటైన చైనా గోడ, దాలియాన్ రేవు నగరం, చారిత్రాత్మకమైన షాంఘై, మావో జన్మస్థలమైన షావ్‌షాన్, గ్రామీణ ప్రాంతాల్లో షింగ్ జియావో టౌన్‌షిప్, గాంగ్‌జాంగ్ (కాంటన్) నగరం వంటి ప్రదేశాలను చూశాము.

## నగరాల పరిస్థితి

మేము చూసిన నగరాలు చాలా విశాలంగా పచ్చని చెట్లతో నిండి ఆహ్లాదకరంగా వున్నాయి. ఎక్కడ చూసినా పరిశుభ్రత కొట్టవచ్చినట్లు కనపడింది. ప్రజలు క్రమశిక్షణతో మెలుగుతున్నారు. కాగితాలు, చెత్త ప్రత్యేకమైన తొట్లలో వేస్తున్నారు. ఆఖరికి రోడ్ల ప్రక్కనున్న చెట్ల ఆకులు రాలుతుంటే నిరంతరం వాటిని శుభ్రం చేస్తున్నారు. గ్రామాల్లో కూడా ఈ శుభ్రతే కానవచ్చింది. విశాలమైన వీధులకు ఇరుప్రక్కల దట్టమైన చెట్లు వున్నాయి. అన్ని ప్రధానమైన దారుల్లోనూ రెండు బస్సులు వెళ్ళటానికి వాటి పక్కనే సైకిళ్ళు వెళ్ళడానికి విశాలమైన రోడ్డు, మనుషులు నడవడానికి విశాలమైన పుట్‌పాత్, మరోప్రక్క వచ్చే వాటికి కూడా ఇదే విధంగా ప్రత్యేకమైన రోడ్లు వేశారు. వెళ్ళే వచ్చే దారులకు మధ్యలోను, రోడ్డు కిరువైపుల చెట్లు వున్నాయి. మన దేశంలో బాగా పేరు వచ్చిన న్యూఢిల్లీ రోడ్లకంటే చాలా బాగా వున్నాయి. నాలుగురోడ్ల కూడలిలో ఎక్కువచోట్ల ఫ్లై ఓవర్‌లు నిర్మించబడి వున్నాయి. ఎక్కువ అంతస్థులు కలిగిన పెద్ద భవనాలు రోడ్డుకిరుప్రక్కల తీర్చిదిద్దబడినట్లుగా నిర్మించబడి వున్నాయి. చైనా సాంప్రదాయ వాస్తు పద్ధతులలో కట్టబడిన పురాతన భవనాలు కూడా అందంగా వున్నాయి. ప్రజల ప్రయాణాలు స్థానికంగా ఎక్కువగా సైకిళ్ళమీదే చేస్తున్నారు. వందల వేల మంది ప్రవాహంగా సైకిళ్ళపై రోడ్ల మీద కనిపిస్తుంటారు. ఇందులో స్త్రీలు కూడా ఎక్కువ సంఖ్యలో వున్నారు. ధూళి, ఈగలు, దోమలు కలుషిత వాతావరణం మాకు ఎక్కడా కానరాలేదు. అలాగే అడుక్కునే వారు, పేదరికం వల్ల క్రుంగిపోయేవారు మాకు ఎక్కడా కనిపించలేదు. ప్రజల బట్టలు, వేషధారణల్లో కూడా పెద్ద వ్యత్యాసం కనిపించలేదు.

## బీజింగ్ నగరం

చైనా దేశపు రాజధాని నగరమైన బీజింగ్‌ను మేము మొదట చూశాం. దీనినే పూర్వకాలంలో 'పెకింగ్' అని పిలిచేవారు. ఈ నగరానికి నడిబొడ్డున ఉన్న తియాన్‌మెన్ స్క్వేర్‌ను సందర్శించాము. ఇక్కడే పూర్వం మహారాజుల భవనాలు, పార్లమెంటు భవనం, ప్రభుత్వ కార్యాలయాలు ఉన్నాయి. ఈ విశాల ప్రాంతంలోనే కామ్రేడ్ మావో భౌతిక కాయాన్నుంచిన ముసోలియం భవనం ఉంది. అక్కడ అద్దాల పెట్టెలో ప్రశాంతంగా నిద్రపోతున్నట్లు కామ్రేడ్ మావో భౌతికకాయముంది. పెద్ద దేశమైన చైనా ప్రజా విప్లవానికి నాయకత్వం వహించిన గొప్ప నాయకుని చూశామనే అనుభూతి మాకు కలిగింది. మేము మధ్యాహ్నం 11 గంటలకు ఈ ముసోలియం లోనికి వెడితే అక్కడ ఆ సమయం వరకు 11 వేల మంది చూశారని కంప్యూటర్ ద్వారా లెక్క చూపిస్తున్న బోర్డుని చూసి ఆశ్చర్యపోయాం. తర్వాత నగరానికి 50 కిలోమీటర్ల దూరంలో వున్న ప్రపంచ వింతల్లో ఒకటైన చైనా గోడను చూడడానికి వెళ్ళాము. ఈ గోడను 2700 సంవత్సరాలకు పూర్వమే అనేక భాగాలను స్థానిక రాజులు నిర్మించారు. తర్వాత మింగ్ రాజవంశానికి చెందిన క్విన్-షి-హాంగ్ హయాంలో గోడ కట్టడం పూర్తయింది. (221 బి.సి.) మొత్తం గోడ యొక్క పొడవు 6000 కిలోమీటర్లు అంటే మన దేశం యొక్క నిలువు కొలత కంటే ఎక్కువ పొడవు. గోడ యొక్క వెడల్పు 6 మీటర్లు. నిర్ణీత ప్రాంతాల్లో కోట బురుజులు ఉన్నాయి. ఉత్తర ప్రాంతం నుండి వచ్చిన శత్రు సైన్యం దాడులను ఎదుర్కొనడం కొరకు ఆనాడు ఈ గోడను నిర్మించారు. ఈ గోడ ద్వారా శత్రు సైన్యాల యొక్క కదలికల వార్తలను, తుపాకులు పేల్చడం ద్వారా, పొగ వేయడం ద్వారా కొద్ది

సమయంలోనే బీజింగ్ నగరానికి చేర్చే ప్రత్యేక ప్రసార వ్యవస్థ ఆనాడు వుండేది. గోడ ఎక్కి చూస్తే కొండల్లో, లోయల్లో మలుపులు తిరిగిన పాములాగా విచిత్రమైన అనుభూతిని కలుగచేస్తుంది. చంద్రమండలం పై నుంచి టెలీస్కోప్ ద్వారా చూస్తే కనిపించే ఏకైక మానవ నిర్మిత కట్టడం చైనా గోడేనంటుంటారు.

## దాలియన్ నగరం

చైనాలోని ప్రధానమైన రవాణా కేంద్రాలలో దాలియన్ ఒకటి. దాలియన్ కీలకస్థానంలో వున్న ఓడరేవు పట్టణం. ఈ పట్టణానికి అత్యంత ప్రాధాన్యత నిచ్చి అభివృద్ధి చేస్తున్నారు. హార్బర్‌ను చూడడానికి వెళ్ళాము. ఆధునికమైన యంత్రాలతో పనిచేస్తున్న ఈ హార్బర్ ప్రభుత్వం కార్మికుల ఉమ్మడి యాజమాన్యంతో నిర్వహిస్తున్నారు. పట్టణంలో ఉన్న పెద్ద డిపార్ట్‌మెంటల్ స్టోర్స్ దర్శించాము. నాలుగు అంతస్థులు కలిగిన ఈ భవనంలో వేలాది మంది విశాలమైన హాళ్ళలో సరుకులు కొనుక్కుంటున్నారు. ఢిల్లీ కన్నాట్‌ప్లేసులో గల పాలికా బజారు కంటే 50 రెట్లు పెద్దదిగా ఉంది. ప్రజలకు కావలసిన అన్ని సరుకులు అందుబాటులో వున్నాయి. అన్ని అంతస్తులు, షాపులు ప్రజలతో నిండివున్నాయి. దాలియన్ లోనే ఒకప్రక్కగల హైటెక్ ఎకనామిక్ జోన్‌కు తీసుకువెళ్ళారు. ఈ ప్రాంతంలో పూర్తిగా ఇతర దేశపు సంస్థలతో సంయుక్తంగా నిర్మించబడిన ఉన్నత సాంకేతిక పరిజ్ఞానంతో నడపబడుతున్న ప్రాంతం చూశాము. ఇంకా అనేక ప్రాజెక్టులు నిర్మాణంలో వున్నాయి. ఈ ప్రాంతంలో ఎక్కడ చూసినా జపాన్, కొరియా, పశ్చిమ దేశాల వాతావరణం స్పష్టంగా కనిపించింది. ఈ పరిశ్రమలలో ఉత్పత్తికూడా గణనీయంగా అభివృద్ధి చెందుతున్నట్లు అక్కడి వారు చెప్పారు.

## షాంఘై నగరం

ప్రపంచంలోనే అత్యధిక జనాభా కలిగిన టోక్యోతో పోటీపడుతున్న చారిత్రాత్మక నగరం షాంఘై. చైనాలో కార్మిక విద్యార్థి కమ్యూనిస్టు ఉద్యమాలకు కేంద్రమే ఈ నగరం. మే 4 విద్యార్థి, కార్మిక ఉద్యమాలకు, 1921లో చైనా కమ్యూనిస్టు పార్టీ ప్రథమ మహాసభలు కూడా ఈ నగరంలోనే జరిగాయి. చైనా కమ్యూనిస్టు పార్టీ ప్రథమ మహాసభలు జరిగిన భవనాన్ని చూడటం జరిగింది. ప్రథమ మహాసభ విశేషాలతో కూడిన ఫొటో ఎగ్జిబిషన్ అక్కడ ఆ భవనంలో ఉంచారు. జూలై 23, 1921లో చైనాలోగల 53 మంది పార్టీ సభ్యులకు ప్రాతినిధ్యం వహిస్తూ 12 మంది ప్రతినిధులతో 10 రోజులపాటు ఈ ప్రథమ మహాసభ జరిగింది. మధ్యలో శత్రువులు పసిగట్టిన కారణంగా మహాసభను షాంఘై నగరానికి దూరంగాగల దక్షిణ సరస్సులోని ఒక పడవలో కొనసాగించారు. ఆ పడవ యొక్క ఫొటో కూడా ఈ భవనంలోగల ఎగ్జిబిషన్‌లో ఉంచారు. విమానాశ్రయానికి దగ్గరలో అనేక అంతస్థులు కలిగిన ఆధునిక భవనాలు పారిశ్రామిక కార్మికులకు క్వార్టర్ లుగా ఇచ్చారు. షాంఘై దర్శించిన పిదప దగ్గరలోనే గల హునాన్ రాష్ట్ర రాజధాని షాంషై అక్కడి నుండి మావో స్వగ్రామమైన షావ్ షాన్‌కు వెళ్ళాము. మావో స్వంత ఇల్లు, విప్లవానంతరం మావో రెండు పర్యాయాలు వచ్చిన సందర్భంలో ఉపయోగించిన భవనాలు సందర్శించాము. అక్కడ వున్న మావో జీవిత విశేషాలతో కూడిన మ్యూజియంలో అనేక విషయాలు తెలిశాయి. చారిత్రక సంఘటనలతో కూడిన ఫొటోలు, వారు వాడిన వివిధ వస్తువులను చూశాము. మావో తండ్రి పేదరైతు. ఆయన తమ్ములిద్దరు చాంకెషేక్ అభివృద్ధి నిరోధక ప్రభుత్వం చేతుల్లో చంపివేయబడ్డారు. లాంగ్‌మార్చ్ తరువాత శత్రువులు భార్యను కూడా చంపివేశారు. చైనా విప్లవ విజయం అనంతరం అమెరికా ఉత్తర కొరియాపై దాడిచేసినప్పుడు కొరియన్ విప్లవాన్ని రక్షించడం కొరకు సహాయంగా వెళ్ళిన చైనా సైన్యంలో సేనా నాయకుడు మావో కుమారుడు కూడా ప్రాణాలర్పించాడు. ఈ విషయాలలో గతంలో కొన్ని మాకు తెలిసి వున్నా ఈ ఎగ్జిబిషన్ చూసిన తరువాత అనిర్వచనీయమైన అనుభూతి గుండెలను భారంగా ఆవరించింది. కామ్రేడ్ మావో త్యాగపూరితమైన వీరోచిత చరిత్ర మా హృదయాలలో నిండిపోయింది. కామ్రేడ్ మావో ఇల్లు, పచ్చటి పొలాలు, కొండలు, చిన్న సెలయేరు ఆ గ్రామీణ వాతావరణం మా మనసుల్లో చెరగని ముద్ర వేసింది.

## గాంగ్‌జాంగ్ (కాంటన్) నగరం

గాంగ్‌జాంగ్‌ను గతంలో కాంటన్ అని పిలిచేవారు. చైనాలోని పెద్ద నగరాలలో ఇదొకటి. ఇది కూడా మిగిలిన నగరాలవలే విశాలమైన వీధులతో, పెద్ద భవనాలతో తీర్చిదిద్దిన రీతిలో వుంది. మావో సారధ్యంలో ఇక్కడ 1926లో కొమింగ్‌టాంగ్‌తో కలిపి నిర్వహించబడిన రైతాంగ పాఠశాలను చూశాము. ఇక్కడ 327 మంది రైతులకు, యువకులకు శిక్షణ ఇచ్చారు. ఈ శిక్షణలో పాల్గొన్న విద్యార్థులు తరువాత విప్లవ కాలంలో పాల్గొని నాయకత్వం వహించారు. గాంగ్‌జాంగ్‌కు దగ్గరలోగల గ్రామీణప్రాంతాలలో వున్న షిన్-జియావో టౌన్‌షిప్‌ను చూశాము. ఇది 20 గ్రామాల కూడలిలో ఉంది. వ్యవసాయ ఉత్పత్తులకు సంబంధించిన ఫ్యాక్టరీలు; పరిశ్రమలు అభివృద్ధి చేయబడుతున్నాయి. ఇక్కడ ఒక ఎలక్ట్రికల్ మోటారులు తయారుచేసే ఫ్యాక్టరీని కూడా చూశాము. తిరిగి గాంగ్‌జాంగ్ చేరుకొని 14వ తేదీన తిరుగు ప్రయాణమయ్యాము.

## కార్మికవర్గ పరిస్థితి

ఎ.సి.ఎఫ్.టి.యు. ఆహ్వానంపై వెళ్ళిన మాకు కార్మికవర్గ పరిస్థితులను బాగా అధ్యయనం చేయడానికి వీలు కలిగింది. చైనాలో వున్న 13 కోట్ల మంది కార్మికులలో 10 కోట్ల మంది ఎ.సి.ఎఫ్.టి.యు. సభ్యులే. మా మొత్తం పర్యటనలో రైలు ఇంజన్ తయారీ కర్మాగారం, ఓడ రేవు, ఆహార పదార్థాలను కానింగ్ చేసే పరిశ్రమ, వానకోటులు తయారుచేసే కర్మాగారం, బొమ్మలు తయారుచేసే కర్మాగారం, పింగాణీ పరిశ్రమ, సిగరెట్ల ఫ్యాక్టరీ, ఎలక్ట్రికల్ మోటార్లు తయారుచేసే ఫ్యాక్టరీ, ఎంబ్రాయిడరీ, కూల్‌డ్రింక్స్ ఫ్యాక్టరీలు చూశాము. అన్నిచోట్ల పరిశీలిస్తే కార్మికుల వేతనాలు 300 యువాన్‌ల నుండి 400 యువాన్‌ల మధ్యలో వున్నాయి. (1 యువాన్ ఆరు రూపాయలకు సమానం) అంటే సుమారు నెలకు 15 వందల రూపాయల ఆదాయం భార్యాభర్తలు కూడా పనిచేస్తారు కాబట్టి కుటుంబానికి మూడు వేల వరకు కనీస ఆదాయం వస్తుంది. వీటితోపాటు కార్మికుడికి ఫ్యాక్టరీయే ఇంటి వసతి కల్పిస్తుంది. ఇంటికి అద్దె చెల్లించనవసరంలేదు. వైద్యం కూడా ఉచితం. పిల్లలకు హైస్కూలు వరకు నిర్బంధ ఉచిత విద్యను సమకూర్చారు. రిటైర్ అయిన కార్మికులకు 75 శాతం నుండి 100 శాతం

వరకు పెన్షన్ ఇస్తారు. ఫ్యాక్టరీ అభివృద్ధికి, ఎక్కువ కాలం పనిచేసిన కార్మికులకు వంద శాతం వరకు పెన్షన్ ఇస్తారు. ఫ్యాక్టరీ అభివృద్ధికి, ఎక్కువ కాలం పనిచేసిన కార్మికులకు 8 గంటల పని అమలులో వుంది. ఫ్యాక్టరీ యాజమాన్యం మూడు పద్ధతుల్లో కొనసాగుతుంది. 1. పరిశ్రమలు ప్రభుత్వ మరియు కార్మికుల ఉమ్మడి యాజమాన్యంలో వుంటాయి. కార్మికులకు సమాన నిర్వహణా భాగస్వామ్యం ఉంటుంది. ఆ ఫ్యాక్టరీలో కార్మికులచే ఎన్నిక చేయబడిన కార్మికుడు జనరల్ మేనేజర్‌గా కూడా వుండటం ఒక ఫ్యాక్టరీలో చూశాము. అక్కడక్కడా కొన్ని ఫ్యాక్టరీలు పూర్తిగా కార్మిక యాజమాన్యంతో నడుస్తున్నాయి. అలాగే ఇటీవల ప్రారంభించబడిన విదేశీ పెట్టుబడులతో యున్న జాయింట్ పరిశ్రమలలో విదేశీ ప్రతినిధులతో బాటు ప్రభుత్వం, మరియు కార్మికవర్గం ప్రతినిధులు కూడా కీలకమైన భాగస్వామ్యంలో వున్నారు. ఉత్పత్తి లక్ష్యాన్ని నిర్ణయించేటప్పుడు కార్మికుల జనరల్ బాడీలలో చర్చించి ఆయా సలహాల ఆధారంగా నిర్ణయిస్తున్నారు. కార్మిక చట్టాలు విదేశీ సంయుక్త రంగ పరిశ్రమలతో సహా అందరూ అమలు జరిపి తీరాలి. ఏ పరిస్థితులలోనైనా కార్మికుడిని తొలగించాల్సి వచ్చినప్పుడు యూనియన్ అంగీకారం తప్పనిసరిగా వుండాలి. ఇటీవల అవకాశం కల్పించబడిన వ్యక్తిగత పెట్టుబడిదారుల పరిశ్రమలలో కూడా పై విధంగా కార్మికుల హక్కులు – చట్టాలు అమలు జరపబడుచున్నాయి. కార్మికుల హక్కులతోబాటు ఉత్పత్తి అభివృద్ధిలో వ్యక్తిగత బాధ్యతలను కలిగి యున్నారు. నిరుద్యోగం పూర్తిగా పరిష్కరించబడింది.

## కార్మికులకు సౌకర్యాలు

షాంఘై నగరంలో వర్కర్స్ కల్చరల్ ప్యాలెస్ చూశాము. ఇవి కార్మికులు ఖాళీ సమయంలో గడపటం కోసం నిర్మించిన గొప్ప భవనాలు. లోపలగల హాలులో టేబుల్ టెన్నిస్ వగైరా ఆటలు, ఎలక్ట్రానిక్ గేమ్స్ వంటివి ఆడుకుంటున్నారు.

కార్మిక కుటుంబాలవారు, స్నేహితులు తినుబండారాలు తెచ్చుకొని తింటూ కబుర్లు చెప్పుకొంటున్నారు. కొన్నిచోట్ల పాటలు పాడుతున్నారు. కొందరు డాన్స్‌లు చేస్తున్నారు. ఈ నృత్యాలేవీ వెకిలిగా లేవు. మేము భారత దేశం నుంచి వచ్చామని అక్కడ దుబాసీ చెప్పగా వారు వెంటనే రాజ్‌కపూర్ తీసిన ఆవారా చిత్రంలో ఆవారాహూ అనే పాటను చైనా భాషలోనికి మార్చి పాడి మాకు విన్పించారు. కేవలం సంతోషంతో గడపటం కోసం మాత్రమే కాకుండా ఈ కేంద్రాలలో కార్మికులకు రాజకీయ తరగతులు కూడా నిర్వహిస్తున్నారు. ప్రపంచ పరిస్థితులు, కార్మికుల స్థితిగతులు, దేశంలో సోషలిజం రక్షణ కోసం నిలబడాల్సిన అవసరం, మార్క్సిజం, సైద్ధాంతిక విషయాలు చెబుతూ వుంటారు. అలాగే పనిలో బాధ్యతాయుతంగాను, నైపుణ్యాన్ని అభివృద్ధి చేసుకోవడం ఎలాగో కూడా ఈ తరగతులలో బోధించడం జరుగుతుంది. ఇటువంటి హాళ్ళను సిటీ ట్రేడ్ యూనియన్ కమిటీ నిర్వహిస్తుంది.

## రైతులు, మహిళలు, బాలలు

షెన్‌జియావో గ్రామీణ టౌన్‌షిప్‌ను పరిశీలించినప్పుడు రైతాంగం గురించి మాకు అనేక విషయాలు తెలియవచ్చాయి. ప్రతీ మనిషికి ఒక ఎకరం చొప్పున భూపంపకం జరిగింది. వీటి ద్వారా సంవత్సరానికి 12 వేల రూపాయలకు పైగా ఆదాయం వస్తుంది. ఇవి కాకుండా అందరి ఇళ్ళ పెరడులలో కోళ్ళు, బాతులు, పందులు పెంచడం, కూరగాయలు పండించటంతో పాటు తమ అవసరాలకు పోను మార్కెట్‌లో అమ్మి అదనంగా ఆదాయం గడిస్తున్నారు. చేపల చెరువులు కలిగిన రైతులు హెచ్చు ఆదాయం గడిస్తున్నారు. రైతుల యొక్క ఆదాయాలను పట్టణ కార్మికుల ఆదాయాలతో సరిచేయటం కొరకు గ్రామీణ ఉత్పత్తులకు 50 శాతం కొనుగోలు ధరను ప్రభుత్వం పెంచడం జరిగింది. వీటితోబాటు పట్టణాలకు, గ్రామాలకు మధ్య వైరుధ్యం తగ్గించడం కొరకు పది, పదిహేను గ్రామాల కూడలిలో గ్రామీణ టౌన్‌షిప్ నిర్మాణం సాగుతోంది. స్త్రీలు బస్సు కండక్టర్లుగాను, డ్రైవర్లుగాను, డాక్టర్లు, నర్సులు, ఉపాధ్యాయులుగాను, అన్ని రంగాల్లోను పురుషులతో సమాన స్థాయిలో పనిచేస్తున్నారు. సమాన పనికి సమాన వేతనం అమలులో వుంది. అన్ని ఉత్పత్తి రంగాల్లో విప్లవ ఆరంభంలో 21 శాతంగా వున్న మహిళలు 45 శాతానికి అభివృద్ధి అయ్యారు. కార్మికుల బిడ్డల పెంపకం నాలుగు, ఐదు నెలల తర్వాత క్రెచ్‌లు, కిండర్‌గార్డెన్‌ల ద్వారా ఫ్యాక్టరీయే బాధ్యత తీసుకుంటుంది. పిల్లలకు చైనాలో గొప్ప సౌకర్యాలు ఏర్పాటు చేశారు. మన దేశంలో ధనవంతులకు, జమీందారుల బిడ్డలకు కూడా అందని గొప్ప సౌకర్యాలు చైనాలోని బాలలు పొందుతున్నారు. ఆరు నెలల వయస్సు నుండి 5 సంవత్సరాల వయస్సు గల పిల్లలు వుండే కిండర్ గార్డెన్‌ను చూశాము. ఇవి పిల్లల పాలిట స్వర్గాలు లాగా ఉన్నాయి. సాయంత్రం వరకు ఇక్కడ గడిపిన పిల్లలను సాయంత్రం ఫ్యాక్టరీ నుంచి వచ్చిన తల్లిదండ్రులు ఇంటికి తీసుకువెళతారు.

## సోషలిస్టు పంథాలో . . . .

నేడు మన దేశంలో వివిధ పత్రికల నిరంతర ప్రచారం వలన చాలా మంది ప్రజలలో చైనా యెడల అనేక అనుమానాలు రేకెత్తించబడుతున్నాయి. తియాన్‌మెన్ స్క్వేర్‌లో విద్యార్థుల ఆందోళన, చైనాకు విదేశీ పెట్టుబడుల ప్రవాహం, నూతన ఆర్థిక విధానాలు అలాగే ప్రపంచంలో సోవియట్, తూర్పు యూరప్ పతనం. ఈ పరిస్థితుల్లో చైనాలో సోషలిజం, కార్మిక

*తరువాయి భాగం 7వ పేజీలో*



తియాన్‌మెన్ స్క్వేర్‌లో సి.ఐ.టి.యు. ప్రతినిధివర్గం

# తలుపులు తెరిచాం ! ఏడాది గడిచింది !

రండి! రండి!! ద్వారాలు తెరవండి. గోతాలు తీసుకురండి. కుప్పలు తెప్పలుగా పడివున్న విదేశీ మారకం బస్తాలతో తెచ్చుకోవచ్చు – ఇదీ ఏడాది నుండి శ్రీమాన్ పి.వి. నరసింహారావ్ ప్రభుత్వం కొట్టిన వూదర.

విదేశీ మారకం దేశదేశాల్లో మూలుగుతున్నట్లు, మనదేశంలోకి అది ప్రవహించి, ఆ గంగా తీర్థంతో మన జన్మ తరించేందుకు కంట్రోళ్లు, ఫెరా చట్టాలు, ఎం.ఆర్.టి.పి. శాసనాలు అడ్డుగా వున్నాయి, కనుక వాటిని రద్దు చేయండి. రండి! రండి!! ద్వారాలు తెరవండి! గోతాలు తీసుకరండి – అని కేకలేశారు.

కాలవ పూడిక తీసేందుకు ప్రపంచబ్యాంక్. అప్పు

ఇటుకల యిల్లు కట్టుకునేందుకు ప్రపంచ బ్యాంక్‌కు అర్జీ

చేపలు పెంచేందుకు, అవి తినే ప్రాన్ కొనుక్కునేందుకు ప్రపంచబ్యాంకే దిక్కు.

ఇదీ ఏడాదిన్నరగా విన్నమాట. పాడిన పాట. ప్రపంచ బ్యాంక్ ప్రతి అధికార రాజకీయ వేత్తకు, ఆర్థికశాస్త్ర వేత్తకు రామనామస్మరణ అయింది. విని విని ప్రజల చెవులు చిల్లులు పడ్డాయి.

"ఏడాది దాటింది. కొత్త ఆర్థిక విధానం మనలను ముక్తి మార్గం వైపు మళ్ళించింది. మేము అధికారంలోకి వచ్చేసరికి వారంరోజుల ఖర్చుకు గూడా విదేశీ మారకం లేదు ఖజానాలో.

ఇప్పుడో . . . . ఎక్కడ బట్టినా కుప్పలు తెప్పలుగా విదేశీ మారకం.

అయ్యా ! మన ఎగుమతులు తగ్గాయి.

దిగుమతులు పెరిగాయి.

వ్యాపారలోటు మరింత పెరిగింది.

మరిఖజానాలో విదేశీ మారకం గుప్పెళ్ళతో వెదజల్లేంత ఎట్లా పెరిగింది?

అప్పు

ప్రపంచబ్యాంక్ అప్పు
ఐ.యం.ఎఫ్. అప్పు
ఆశియన్ బ్యాంక్ అప్పు.
అప్పుచేసి పప్పు కూడు.

ఇదివరకూ అప్పు చేశాం. మారుతీ కార్లు, టెలివిజన్ సెట్లు, ఫ్రిజ్‌లు, అందమైన బెడ్ రూములు, బాత్‌రూములు కట్టుకున్నాం.

తీరా అప్పులు తీర్చాల్సి వచ్చేసరికి ఇంటి బంగారం లండన్ బ్యాంక్‌ల్లో కుదవబెట్టి, దేశం పరువు నడివీధుల్లో పరిచాం.

మరోసారి అప్పుచేస్తే . . . . తీర్చేదెలా?

ఏడాది క్రితం ఈమాట అంటే దేశానికి ద్రోహం చేస్తున్నారు. పాతకాలపు ఆలోచనల బూజు వదలని వారు పుస్తకాల్లో సిద్ధాంతాల్లో దేశాన్ని చదివేవారు. ప్రపంచ జ్ఞానం లేనివారు, చుట్టూతా మార్పులను చూడలేని కళ్ళున్న కబోదులు అంటూ దొరికిన తిట్లల్లా ప్రయోగించారు.

అప్పు తాత్కాలికం. ద్వారాలు తెరిచాం గదా! ఇక వరద గోదావరిలా పొంగి పొరలుతుంది విదేశీ పెట్టుబడి. శాస్త్ర సాంకేతిక నైపుణ్యం, అత్యాధునిక పరిశ్రమలు వాటితో విదేశీ మార్కెట్లు. కుప్పలు తెప్పలుగా విదేశీ ద్రవ్యం. అప్పులదేముంది అరనిముషంలో తీర్చేస్తాం. అంటూ ప్రగల్భాలు కొట్టారు.

నా చిన్నప్పుడు మా అమ్మమ్మ ఒక కథ చెప్పేది.

కుండలు చేశాట్ట ఒకడు. ఇవి అమ్మితే మిగిలే లాభం ఆ లాభంతో మరో వ్యాపారం. ఆ వ్యాపారంతో సకల సంపదలు. అవి చూచి సంపన్నుల కూతురు భార్య ఔతుంది. ఆమె మీద కోపమొస్తే కాలితో కొడతాను. అని పగటి కలలు కంటూ, కాళ్ల విదిలించాడు. ఈ కలలకు మూలమైన కుండలు కాస్తా ముక్కలైనాయి.

సరిగ్గా ఆ కథ గుర్తు కొచ్చింది భారత ప్రభుత్వాన్ని, దాని ఈనాటి స్థితిని చూస్తుంటే.

విదేశీ గుత్త సంస్థలకు, ప్రపంచబ్యాంక్‌కు తలుపులు మూయడమే మన ఇబ్బందులకు కారణమన్నారు. పబ్లిక్ సెక్టారే "విలన్" అన్నట్లు ప్రచారం చేశారు. ఆ "విలన్" ను తొలగించి, తలుపులు తెరిస్తే బాధల నుంచి తరించిపోతామన్నారు.

పబ్లిక్ సెక్టార్ షేర్లు బజార్లో పెట్టారు. కార్మికులకు "ఎగ్జిట్" అన్నారు. విదేశీయులకు "ఎంట్రీ" బోర్డ్ చూపారు. అన్నీ జరిగినా "డామిట్ కథ అడ్డం తిరిగింది" అని అన్న గిరీశం మాటలు ప్రధాని నోటిగుండా వినపడుతున్నాయి. పారిశ్రామిక వేత్తల శిబిరపు సంబరంలో ప్రధాని మాటలు వినండి.

అయ్యా నా విదేశీ యాత్రలన్నీ ఒక సేల్సుమాన్ పర్యటనలుగా తయారైనాయి. మన సరుకుకు గిరాకీ లేదు. వాళ్ల పెట్టుబడులకు చాలా దేశాలున్నాయి. ఏమో అనుకున్నంతగా విదేశీ పెట్టుబడులు వస్తాయని అనుకోలేం.

చావు కబురు చల్లగా చెప్పేశారు. ఏడాది అనుభవంతో తప్ప తాము ఎన్నుకున్న దారితో ముక్తి మార్గం లేదని అర్థం కాలేదు. చేతులు కాలాయి. ఇప్పుడైనా ఆకులు పట్టుకునేందుకు ప్రధాని సిద్ధంగా లేరు.

ఈలోగా దేశం "శ్యాం" బురదలో కూరుకుంది. మన ఆర్థిక పరిస్థితి అస్తవ్యస్తమైంది. ప్రజల జీవనం దుర్భరమైంది.

"ఈ దారి తప్పు" అన్నవారిని తప్పు పట్టిన పెద్దలు లెంపలేసు కోడంలేదు. స్వయాన అనుభవానికి వచ్చినా దారి మళ్లడంలేదు.

"ఈ దారి తప్పు" అన్న వారికి ప్రపంచం తెలుసు. దాని అనుభవం తెలుసు. మార్కెట్ ఆర్థిక విధానం అన్ని సమస్యలకు పరిష్కారం అన్న రీగానమిక్స్ (ఆనాటి అమెరికా ప్రెసిడెంట్ రీగన్ పేరిట వెలసిన సిద్ధాంతం) అమెరికాలోనే విఫలమైంది. ప్రజల పరిస్థితి దుర్భరమై ఆయన వారసుడు బుష్ రేపు ఎన్నికల్లో "హుష్‌కాకి" అంటాడని పత్రికావార్తలు. రీగన్‌కు సైదోడుగా అదే సిద్ధాంతం అంతకన్నా పట్టుదలగా అమలు జరిపింది బ్రిటిష్ ప్రధాని థాచర్. పార్టీలోనే వ్యతిరేకత వచ్చి పదవి వదులు కోవలసి వచ్చింది. ఆమె అనుచరుడు మేజర్. బ్రిటన్ పరువు బజారునపడి పౌండ్ విలువ కుంగిపోయి, యూరోప్‌లోనే ఆ దేశం ఒంటరి అయింది. మార్కెట్ ఆర్థిక విధానంతో అమ్మివేసిన బొగ్గు గనులు, ప్రైవేట్ వ్యక్తుల చేతుల్లో లాభాలు లేకపోగా మరింత నష్టాల్లో కూరుకున్నాయి. గనులు మూస్తామని యజమానులు, వ్యతిరేకిస్తూ కార్మికులు, బ్రిటిష్ ప్రభుత్వమే సంక్షోభంలో కూరుకుపోయింది. ఐరోపా అంతటిలో అతి బాగా బలసిన ప్రభుత్వం పశ్చిమ జర్మనీ. తూర్పు జర్మనీని మింగి జీర్ణించుకోవాలనుకుని తనే సంక్షోభంలో పడింది. ప్రెసిడెంట్ కోల్‌కు పాదుకా ప్రక్షాళనం జరిగింది.

"మార్కెట్ ఎకానమీ" అన్న సోవియట్‌లో ప్రజలు "అన్నమో రామచంద్రా" అంటున్నారు.

ఇదీ ప్రపంచ వ్యాప్తంగా మార్కెట్ ఆర్థిక విధానం అనుభవం.

ఈ చేదు అనుభవం శ్యాంతో ప్రారంభమైంది. ధరల పెరుగుదలతో వేడెక్కుతోంది. పెరగబోయే నిరుద్యోగం అగ్నిపర్వతమౌతుంది.

పి.వి. నరసింహారావ్ బుష్, మేజర్, కోల్‌ల వారసుడుగా భారత చరిత్రలో నిలవక తప్పని రోజుల్లా వుంది ఆయన మొండితనం చూస్తే.

(5వ పేజీ తరువాయి భాగం)

రాజ్యం పురోగమిస్తుందా అని చాలా మంది మిత్రులు, ప్రజలు ప్రశ్నిస్తున్నారు. ఈ విషయాన్ని కూడా దృష్టిలో వుంచుకొని మా పర్యటన సందర్భంగా వివిధ చోట్ల కార్మిక నాయకులను ప్రశ్నించాము. చాలా వెనుకబడిన చైనాను అత్యాధునికమైన దేశంగా తీర్చిదిద్దాలంటే పారిశ్రామిక, ఆర్థికాభివృద్ధి అత్యవసరం కాబట్టి తగు జాగ్రత్తలు తీసుకుంటూనే అభివృద్ధి చెందిన విదేశీ పరిజ్ఞానాన్ని దిగుమతి చేసుకోవడం అవసరమని, నూతనార్థిక సంస్కరణలు కూడా కావాలని పార్టీ భావించింది. ఫలితంగా అనుసరించిన కొత్త విధానాల వల్ల 1980 నుండి 1990 నాటికి జాతీయ ఉత్పత్తి రెట్టింపు అయ్యిందని, రెండు వేల సంవత్సరాలకు తిరిగి రెట్టింపు అవుతుందని అన్నారు. అభివృద్ధి చెందిన అమెరికా, జపాన్, జర్మనీల వంటి దేశాలలో అభివృద్ధి రేటు 2 లేక 3 శాతానికి పడిపోయింది. 1991లో చైనాలో 9 శాతం అభివృద్ధి జరిగిందని ప్రపంచ బ్యాంక్ ప్రకటించింది. 1990 కన్నా 1991లో చైనా వ్యవసాయ ఉత్పత్తులు 30 శాతం పెరిగాయి. వివిధ రకాల ధాన్యాల యొక్క ఉత్పత్తి 435.24 మిలియన్ల మెట్రిక్ టన్నులు వుంటే (ఇండియా 176.2 మిలియన్ల మెట్రిక్ టన్నులు వుంది) అలాగే పారిశ్రామిక ఉత్పత్తి 14.2 శాతం అభివృద్ధి చెందింది. విదేశీ పెట్టుబడులు జాతీయ పెట్టుబడిలో 8 శాతానికి పెరిగాయి. చైనా నిర్దేశించిన చట్టాల కనుగుణంగానే విదేశీ పెట్టుబడులు అనుమతిస్తున్నారు. ఇకవారు దిగుమతి చేసే విదేశీ సంస్కృతీ, ఆలోచనా విధానాలను ఎదుర్కొనటానికి సైద్ధాంతిక ప్రచారాన్ని, సోషలిస్టు చైతన్యాన్ని ముమ్మరంగా కొనసాగిస్తూ వాటిని నిరోధించగలమని దృఢమైన ఆత్మ విశ్వాసాన్ని వెల్లడించారు. వచ్చే 25 సంవత్సరాలలో ప్రపంచంలో అభివృద్ధి చెందిన అగ్రరాజ్యాలలో ఒకటిగా తమ దేశాన్ని నిలుపుతామని వారు ప్రకటించడం మాకు ఆనందోత్సాహాలను కలుగజేశాయి. 110 కోట్ల జనాభా కలిగిన చైనా కలిసికట్టుగా ఒకే త్రాటిపై ఒకే ధ్యేయం కోసం, దృఢదీక్షతో ముందుకు సాగిపోతున్న మహత్తర శక్తి అన్న అనుభూతి మాకు కలిగింది. నిర్దేశించుకున్న ధ్యేయాన్ని చైనా ప్రజలు సాధించగలరని ఆశిస్తూ 14వ తేదీ రాత్రి గాంగ్ జూంగ్ విమానాశ్రయంలో కామ్రేడ్ టావో తదితర మిత్రులకు వీడ్కోలు చెప్పాము.




కనీస వేతనాలకై రాజమండ్రిలో ధర్నా




కనీస వేతనాలకై ఖమ్మంలో ప్రదర్శన

# నయా వలస విధానానికి దొడ్డి దోవ

బాంకుల మోసాలు, దళారీల దగాలూ ఈనాటివి కావు. చరిత్ర అధ్యయనం చేసిన వారికి సౌత్ సీ బబుల్ తెలుసు. కందుకూరి వీరేశలింగం పంతులుగారి ఆత్మకథను చదివిన వారికి ఆర్బత్ నాటి బాంకు కథ తెలుసు ప్రపంచ ఆర్థిక సంక్షోభంలో ఐవర్ క్రూర్ మోసం మనకు తెలుసు. ముంద్రా దేనికి పర్యాయ పదమో మనకు తెలుసు. జపాన్‌లో ఇద్దరు ప్రధానమంత్రులు కుంభకోణాలలో ఇరుక్కొని నెత్తిన గుడ్డ వేసుకు పోవటమేగాక 50 కోట్ల జపాను ఎన్నుల లంచాన్ని మింగి మొన్ననే బహిరంగంగా క్షమార్పణ చెప్పుకుని (వారం రోజుల క్రితం టి.వి.లో ఈ దృశ్యం మనం అందరమూ చూసాముకూడా)

జపాన్ పాలకవర్గ అగ్రనాయకుడు కొనెమురమొగాన్ని మనం మర్చిపోలేము. కాని వాటన్నిటిని తలదన్నింది మనదేశపు సెక్యూరిటీల కుంభకోణం.బాంకులు, దళారీలు, అత్యున్నతాధికారులు, ఆఖరుకు పి.వి. ప్రభుత్వం లోని మంత్రులు కూడా ఇందులో ఇరుక్కొని వున్నారు.

ఈ కుంభకోణాలలో నాయక పాత్ర వహించింది విదేశీ బాంకులు, ముఖ్యంగా అమెరికన్ బాంకులు.

బాంకుల మధ్య ప్రభుత్వ సెక్యూరిటీలు బదిలీ అవుతూ వున్న కాలంలో వాటిని దళారీలు కాజేసి వాడుకున్నదీ, వాటికి కొంతమంది ప్రభుత్వ అత్యున్నతాధికారులు తోడ్పడినది ఆ కుంభకోణం.

దీనిని గూర్చి రిజర్వుబాంకు నియమించిన జానకి రామన్ కమిటీ పరిశీలనలో వెల్లడైన కొన్ని భాగాలను ఇక్కడ ఇస్తున్నాము. (రెండవ మధ్యంతర నివేదిక)

"III - (2) 11 నెలల కాలంలో జరిగిన సెక్యూరిటీల లావాదేవీల సంఖ్య 57,980. వాటి ముఖవిలువ రు. 9,06,192 కోట్లు."

బ్రోకర్లద్వారా, బాంకుల ద్వారా జరిగిన ఈ లావాదేవీలు 4, 5, పేరాలలో ఇచ్చింది. వాటిని కలిపి ఈ క్రింద చూపుచున్నాము.

| బ్రోకరు పేరు | మొత్తం రూ. కోట్లు | బాంకు పేరు | మొత్తం రు. కోట్లు |
|---|---|---|---|
| నేరుగా | 3,50,270 | సిటిబాంకు | 2,15,179 |
| భూపేన్ దలాల్ | 61,045 | స్టాండర్డ్ బాంకు | 1,67,014 |
| హర్షద్ మెహతా | 48,331 | బాంక్ ఆఫ్ అమెరికా | 1,51,646 |
| దలాల్ | 55,185 | ANZ గ్రిండ్లేస్ బాంకు | 39,197 |
| వి.బి. దేశాయ్ | 30,954 | స్టేట్ బాంక్ ఆఫ్ ఇండియా | 54,343 |
| ఇతర బ్రోకర్లు | 3,60,407 | ఆంధ్రాబాంకు | 42,135 |
| | | యూకోబాంకు | 28,906 |
| | 9,06,192 | కెనరాబాంకు | 27,879 |
| | | పంజాబ్ నేషనల్ బాంకు | 20,877 |
| | | రు. 20 వేల కోట్లు లోపు ఇతర బాంకులు | 1,18,716 |

ఈ లావాదేవీలు ప్రధానంగా విదేశీ బాంకుల ద్వారా జరిగినవి. " II . . . 17 (బి) ఇటువంటి లావాదేవీలలో అత్యధిక భాగం (67.68శాతం) విదేశీ బాంకు ద్వారానే జరిగినట్లు బాంకులవారీగా చేసిన పరిశీలనలో తేలింది. మొత్తం బాంకింగ్ వ్యవస్థతో పోలిస్తే ఈ బాంకుల డిపాజిట్లు ప్రాతిపదిక ఏమంత పెద్దవికావు (1990-91లో 3 శాతం మాత్రమే) కాబట్టి ఫండ్స్ మేనేజ్‌మెంటు కొరకు కాక కొనటం, అమ్మటంలో వచ్చే వాటి కొరకే ఇవి లావాదేవీలు నడుపుచున్నట్లు కన్పడుచున్నది. యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా యొక్క యూనిట్లు లావాదేవీలలో ఈ వాటాను విదేశీ బాంకుల వాటా 70 శాతం ఉండడం వల్ల ఈ విషయం రూఢీ అవుతున్నది."

ప్రభుత్వ సెక్యూరిటీల విషయంలోనే కాదు; ప్రభుత్వం పరిశ్రమ షేర్ల విషయంలో కూడా ఇదే జరిగింది.

పి.వి. ప్రభుత్వం ప్రభుత్వరంగాన్ని నిర్వీర్యం చేసే ప్రయత్నంలో భాగంగా వాటి షేర్లను (అన్ని షేర్లు ప్రభుత్వానివే) షేర్ మార్కెట్‌లో అమ్మకానికి పెట్టింది. ఈ పరిశ్రమ షేర్లు విడి విడిగా కాకుండా కొన్ని పరిశ్రమల షేర్లను ఒక కట్టగా కట్టి షేర్ మార్కెట్‌లో వేలానికి పెట్టింది. వీటిని బాంకులు, ఫైనాన్స్ సంస్థలు, వాటినే అమ్ముతానన్నది. ఇందువల్ల మన భారతీయ బాంకులు వీటిని చౌకగా కొని వాటిని తిరిగి విదేశీ బాంకుల ద్వారా విదేశీ కంపెనీలకు అమ్మడం జరిగింది. ఈ విషయాలను ఈ నివేదిక Vలో వివరంగా ఇవ్వబడింది.

అలహాబాద్ బాంకు 22-2-1992లో ఒక్కొక్కటి రు. 13.01 కోట్లు విలువజేసే రెండు కట్టలను కొని ఒక దానిని రు. 20.25 కోట్లకు, రెండవదానిని రు. 20.11 కోట్లకు అమ్మింది. ఆ విధంగా ఖర్చులు పోను, నికరంగా రు. 14.17 లు లాభం సంపాదించింది. ఇందుకు ముందుగానే స్టీవర్ట్లు కంపెనీ, యాకర్బిచ్, వై.యస్.యన్. కంపెనీలతో బేరం కుదుర్చుకున్నది. చివరకు ఇది ప్రపంచంలోనే అతి పెద్ద వాటిలో ఒకటైన అమెరికన్ సిటి బాంకుకు జేరినవి. నివేదిక ఇట్లా చెప్పింది.

" V (3) (సి) : సిటి బాంకుల కార్డుల పరిశీలన ప్రకారం, సిటిబాంకు తన ఒక క్లయింట్ కొరకు ఒక కట్టను 3-4-1992 న కొన్నది."

" V (4) సి, రు. 202.50 కోట్ల ముఖ విలువగల ప్రభుత్వరంగ సంస్థల 13% బాండ్లను బాంక్ ఆఫ్ అమెరికా, కాన్‌ఫినా బ్రోకర్ల ద్వారా కాక నూటికొనే అంతే విలువకు కొన్నవి".

ఇదంతా అక్రమంగా, రూల్సుకు విరుద్ధంగా జరిగినవని జానకిరామన్ కమిటీ చెప్పింది.

ఏ విధంగా మన ప్రాణప్రదమైన ప్రభుత్వరంగ పరిశ్రమలు, విదేశీ కంపెనీల చేతులలోకి చల్లగా, మెల్లగా గుట్టు చప్పుడు కాకుండా పోతున్నవో ఈ కుంభకోణం తెలియజేస్తున్నది.

**నయావలస విధానం అంటే ఇదే !**



# "ఇవిధ భారతిలో ఇండియా దేశం"



"మన దేశం ముందుకి పోవటంలో వెనకబడ్డది". ముందుకు పోవటంలో ఎనకబడ్డమేందయ్యా సెక్రటీ?

సార్ . . . . అంటే కొంచెం ముందుకి పోయి కొంచెం వెనకబడ్డమన్న మాట సార్!

ఏడ్చినట్టుంది. మనం ఎనకెప్పుడు పడ్డాం? అయినా నువ్వు రోజూ ఇవిధ భారతిలో పాటలు ఇనడంలేదా? టివి చూడ్డం లేదా?

"చిత్తం! తమరి సేవలో నాకా తీరికెక్కడిదండి? పోనీ . . . ఒరేయ్ యాద్గిరీ నువ్విన్నావుట్రా? లేదురా! నేనెప్పుడిన్లే.

అయితే ఇట్టా కూచోండి. నేజెప్తా.

మీరు పొద్దున్లేవంగానే ఏంజేస్తార్రా? . . . సిగ్గెందుకు చెప్పండి.

. . . . ఛ! ఛ!! అదిగ్గాదా పళ్ళు తోముకుంటారు గాదా? దేంతో? "విదేశీ టూత్ బ్రెష్‌లకు తీసిపోనిది ఉదయ్ టూత్‌బ్రష్‌తో" టింగ్ . . . . టింగ్ . . . . అవునా? నేనయితే యాప్పుల్లే దొరా. నేనేంది మా ఊరంతా యాప్పుల్లతోనే.

నువ్వు నోర్ముయ్యరా యద్గిరీ!

ఇహ స్నానం చెయ్యాలంటే లిరిల్. లీసాన్సీ. బట్టలుతుక్కోవలంటే హీల్, ఏరియల్.

కాని సార్ . . . . మన దేశంలో సబ్బులు, టూత్‌బ్రష్‌లు వాడే జనం చాల తక్కువ సార్.

అవ్. గిదయితే రైటే దొరా.

"5 ఖాళీ షాంపు ప్యాకెట్లిస్తే ఒక ఫుల్ షాంప్ ప్యాకెట్" ఈ ప్రకటన విన్నావా సెక్రటీ?

లేద్సార్. పాత దీపాలకి కొత్త దీపాలిస్తానని అల్లావుద్దీన్ అద్భుతదీపంలో విన్నాంసార్.

మన టివి లో చూపించే బాత్రూమ్‌లు, వాటిల్లో వాడే టైల్సులు స్నానం చేసే తొట్లు ఆ తొట్లకున్న పంపులు ఆహా, ఇంద్రభవనంలా వుంటుందొరే! ఎప్పుడైనా బూశారా?

కానిసార్! ఈ దేశంలో కోట్లమందికి అసలు ఉండటానికి కొంపేలేదే! పోనీవయ్యా, వాళ్ళ సంగతి మనకెందుకు?

ఇహ ఆడోళ్ళకైతే "మీ చర్మం 2 వారాల్లో మెరిసిపోవాలంటే ఇమామీ నేచురల్ క్రీం" పూసుకోండి. టింగ్. . . టింగ్. ఎప్పుడైనా ఎరుగుదుమటయ్యా చర్మం 2 వారాల్లో మెరిసిపోవటం? ఇది మన దేశం ముందుకు పోవటం కాదా?

అవ్‌గాని దొరా! పొట్టలో పేగుల్లాల్లి పెడ్తాంటే పై తోలు మెరిసి పోవ . . . . . .

నువ్ నోర్ముయ్‌రా యాద్గిరీ!

ఇదిగో సెక్రటీ! నువ్ టిఫిన్ తినాలి. నీకు టైంలేదు. ఏంచేస్తావ్?

"తినకుండా వెళ్ళిపోతాసార్"

నువ్‌రా యాద్గిరీ?

గంజికే దిక్కులేనోల్లం. మాకు టిఫినేంది దొరా?!

ఆ! అక్కడే ఉంది కిటుకు. టివి చూసుంటే నీకీ బాధుండదోయ్ సెక్రటీ. "అమ్మా ఆకలే . . . . ఇదిగో 2 నిముషాలే - మ్యాగీ నూడుల్స్ కొనండి".

కాని సార్ దాని ఖరీదు . . . . .

ఇంక తిన్న తర్వాత షర్ట్, ప్యాంట్ వేసుకోవాలికదా. మీయావిడకో మంచి చీర కొనాలికదా!! "అసలైన కంచి పట్టుచీరల కేంద్రం విజయలక్ష్మి సిల్క్‌హౌస్" "అందరి అభిరుచుల సంగమం బొమ్మనా శారీ హౌస్" టింగ్ . . . . టింగ్, "మీ డబ్బుకు మదుపు మీ సమయానికి పొదుపు - శ్రీ ఆనంద్ క్లాత్‌స్టోర్స్" టింగ్ . . . టింగ్.

గీ టింగ్ టంగేంది దొరా?!

అది ఇవిధభారతిలో వచ్చే సాంగ్ లేరా! న్యాచురాలిటీ వస్తుందని మీకది కూడా కొడ్తున్నా నంతే.

మీ న్యాచురాలిటీ పాడుగాను! దేశంలో జనం బట్టలు కొనే డబ్బుల్లేక చస్తూంటే ఈ పట్టుచీరలు, సూటింగ్‌లు ఎవరు కొనాలిసార్. జనం బట్టలు కొన్లేక పోవటంతో ఘనత వహించిన శ్రీ టాటాగారి ఎంప్రెస్ మిల్లుతో సహా బోలెడు బట్టలు మిల్లులు మూతబడ్తున్నాయిగదా!

అస్టాల్, బట్టలు కూడా కొనుక్కోలేని ఈ అలగా జనాన్నేసుకుని ఏదేశమైనా ముందుకెట్టా పోద్దయ్యా సెక్రటీ! అందుకే "కొనుక్కో గలిగిన

వాళ్ళతోనే పోదాం 21వ శతాబ్దంలోకి" అన్లేదా మన దివంగత మహానేత.

అయినా మొత్తం ఒకేసారి కొనుక్కోలేని నీలాంటి వాళ్ళకోసం కూడా బోల్డు పద్ధతులున్నాయి. కనీసం రేడియో విన్నా నీకు తెల్సేవి. "ఆప్కో బట్టలు, పండుగ సందర్భంగా 20 శాతం తగ్గింపు, ప్రభుత్వోద్యోగులకు అరువు సౌకర్యం కలదు" టివిలు, మోటార్ సైకిళ్ళు, వాషింగ్ మెషిన్లు ఇవన్నీ అమ్ముడు పోవడానికి ఈ పద్ధతే దిక్కు. చేతిలో నాలుగు పైసలు గలగల్లాడే మీ లైపు ఉద్యోగులేనయ్యా ఈ కంపెనీల పాలిటి దేవుళ్ళు.

కాని దొరా . . . . .

అబ్బా యాద్గిరీ! ఈ కానీలు, అర్థనాలు వద్దు. నాకు తెల్సు నువ్వే మడుగుతావో. కాసేపు నోర్మూసుకునుండు.

ఆ విధంగా కొన్న వాయిదాల స్కూటరేసుకుని, అలిసిపోయి నువ్వింటికి రాగానే మీ ఆవిడ "శక్తినిచ్చే ఇంధనం బూస్ట్" పట్టుకునెదురొస్తే అప్పుడు నీ ఫీలింగెలా వుంటుందోయ్ సెక్రటీ?

సార్! వివిధభారతిలోనైతే మధ్య మధ్యలో పాటలేసి టింగ్, టింగ్ కొడ్తారు మీరు మొత్తం ఒకటేసారి వాయించేస్తున్నారు! అట్లా అప్పుడే ఆవులిస్తే ఎట్లాగయ్యా? ఇంకా నువ్వు డ్యూరోఫ్లెక్స్ పరుపుమీద పడుకోవాలి. అప్పుడు నీకు దోమలు కుట్టాలి . . .

అదేం కోరిక సార్?

కోరిక నాది కాదయ్యా. "బ్యానిష్" వాళ్ళది. అది పెట్టినా కుడ్తాయనుకో "జెట్" వాడు. అదీపని చేయదనుకో "గుడ్‌నైట్" . . . సెక్రటీ . . . . సెక్రటీ . . . వ్యారీ గుడ్‌నైట్ అనగానే వీడు గుర్రు పెట్టేశాడే!

నీయవ్వ! నాకంతా ఎరికైంద దొరా! కూటికి లేని మాసుంటోల్లు దేశంలో మస్తు మందైరను. దాంతో కంపెనీలు బందే అయితున్నాయ్. ఇంకా జరన్ని పైసలు గలగల్లాడే టోల్లు, మందికి టోపీలెట్టే మట్కా . . . కొడుకులు, కాలాదందాగాండ్లు, పెద్ద పెద్ద కంపెనీల సార్లు మీ అసుంటి వాల్ల కోసమే నన్న మాట ఇయ్యాల ఈ తయ్యారీలు వాటిని అమ్ముకొనీకి ఈ "ఇవిధభారతు"లు.

అవున్రోయ్ యాద్గిరీ! నన్ను నిద్రలేపావ్. రేడియో, టివి ప్రకటనలు చూస్తే ఈ దేశం పరిస్థితి అర్థమైపోతుంది.

– "ఆరెస్బీ" –

చదవండి ! చదివించండి !

'కార్మిక లోకం'

చందాదారులుగా చేరండి !

సం॥ చందా రు. 25/– లు.

## వర్క్ ఛార్జిడ్ సదస్సులు

విశాఖ జిల్లాలోని ఇరిగేషన్ వర్క్ ఛార్జిడ్ ఎంప్లాయిస్ సదస్సు అక్టోబరు 11వ తేదీన తాళ్ళపాలెం వద్ద జిల్లా సి.ఐ.టి.యు. నాయకుడు శ్రీ కె. రాజేంద్ర ప్రసాద్ అధ్యక్షతన జరిగింది. ఇరిగేషన్ వర్క్‌ఛార్జిడ్ ఉద్యోగులు 200 మంది పాల్గొన్నారు. ఇరిగేషన్ రాష్ట్ర యూనియన్ అధ్యక్షుడు శ్రీ కొండ్రగుంట వెంకటేశ్వర్లు గారు వర్క్‌ఛార్జిడ్ ఉద్యోగులు, కార్మికుల యెడ, ప్రభుత్వ విధానాన్ని నిశితంగా విమర్శించారు. వివిధ బ్రాంచీల నాయకులు శ్రీ ఆర్. సూర్యనారాయణ, శ్రీ కె. సత్యనారాయణ, చిన్నయ్య తదితరుల సమస్యలపై మాట్లాడారు. తదుపరి వర్క్‌ఛార్జిడ్ విధానం రద్దు, ఖాళీలు భర్తీ, ప్రమోషన్లు పూర్తి చేయాలని, చనిపోయిన ఉద్యోగుల బిడ్డలకు ఉద్యోగాలు వెంటనే యివ్వాలని, కోరుతూ తీర్మానాలు గావించారు. తాళ్ళపాలెం వర్క్‌ఛార్జిడ్ ఉద్యోగులు సి.ఐ.టి.యు. బానర్లు, జెండాలతో అలంకరించి వచ్చిన వారికి స్వాగతం చెప్పారు.



విశాఖజిల్లా వర్క్‌ఛార్జిడ్ ఉద్యోగుల సదస్సు

అనంతపురం జిల్లా వర్క్‌ఛార్జిడ్ మహాసభ అనంతపురం జిల్లా ఇరిగేషన్ ఉద్యోగుల మహాసభ అక్టోబరు 18న అనంతపురం హెచ్.ఎల్.సి. సర్కిల్ వద్ద నూతన యూనియన్ కార్యాలయం వద్ద ఉత్సాహవంతంగా జరిగింది. 300 మంది పాల్గొన్నారు. రాష్ట్ర యూనియన్ అధ్యక్షులు శ్రీ కొండ్రగుంట వెంకటేశ్వర్లుగారు అధ్యక్షత వహించారు. రాష్ట్ర ఉపాధ్యక్షులు శ్రీ ఎ. శ్రీరాములు, సి.ఐ.టి.యు. జిల్లా నాయకులు శ్రీ ఓబుల కొండారెడ్డి, శ్రీ ఎం. ఇంతియాజ్‌లు సందేశాలు యిచ్చారు. తదుపరి యూనియన్ ఎన్నికలు ఏకగ్రీవంగా జరిగాయి. శ్రీ కె. గుండూరావు అధ్యక్షులుగా, శ్రీ మక్బుల్ భాషా కార్యదర్శిగా నూతన ఆఫీసు బేరర్సు, కార్యవర్గము ఎన్నుకోబడింది. వర్క్‌ఛార్జిడ్ విధానం రద్దు చేయాలని, అర్హతగల క్లీనర్లకు డ్రైవరు పోస్టులు ముందుగా యివ్వాలని, ఖాళీలు భర్తీ చేయాలని, ప్రమోషన్లు పూర్తి చేయాలని, ఎన్.ఎం.ఆర్ లను రెగ్యులరైజ్ చేయాలని కోరుతూ తీర్మానాలు గావించారు.



అనంతపురం వర్క్‌ఛార్జిడ్ మహాసభ

# లీగల్ నోట్స్

భారత స్వాతంత్ర్యానికి ముందు, అనంతరం మన దేశ కార్మిక వర్గం అనేక మహత్తర పోరాటాలను చేసిన ఫలితంగా, భారత ప్రభుత్వం కొన్ని కార్మిక చట్టాలను రూపొందించింది. అయితే ఆ చట్టాలను అమలు చేయడంలో యాజమాన్యాలపై ఎటువంటి వత్తిడి లేని కారణంగా అనేక పరిశ్రమలలో ఈ చట్టాలు అమలు కావటంలేదు సరికదా, అసలు ఈ చట్టాలు ఏ విధంగా ఎంతవరకు ఉపయోగ పడతాయో కూడ తెలియని స్థితిలో నేటి కార్మిక వర్గం వుంది. ఏ చట్టమైనా కార్మికులనుండి వత్తిడి లేనిదే అమలు చేయించుకోవడం అసాధ్యం. పాఠకుల సూచనమేరకు కార్మిక చట్టాలో కొన్ని ముఖ్యమైన సెక్షన్లను ధారావాహికంగా కార్మికలోకంలో ప్రచురిస్తున్నాము. వీటిమీద మీ అభిప్రాయాలను, సూచనలను ఎప్పటికప్పుడు పంపగలరని ఆశిస్తూ ముందుగా రోడ్డు రవాణా అండర్ టేకింగ్ లో పనిచేసే కార్మికులకు వర్తించే కొన్ని ముఖ్యమైన చట్టాలను, రూల్సును పేర్కొనడమైనది.

రోడ్డు రవాణా కార్మికుల కోసం మోటారు ట్రాన్సుపోర్టు వర్కర్స్ యాక్టు 1961లో రూపొందించబడినవి. వాటిలో ముఖ్యమైన సెక్షన్సు 8, 9, 10, 11, 13 మరియు 40.

ఒక మోటారు ట్రాన్స్‌పోర్టు అండర్ టేకింగ్‌లో 100 మంది లేదా అంతకు మించి కార్మికులు వుంటే వారికి క్యాంటిన్ సౌకర్యం కల్పించాలి. (సెక్షన్ 8) ఎ.పి. మోటారు వర్కర్స్ రూల్సు 1963, 17 నుండి 21 వరకు వున్న రూల్సు ప్రకారం క్యాంటిన్ హాల్, క్యాంటిన్ సామాగ్రి, క్యాంటిన్ ధరలు క్యాంటిన్ జమ ఖర్చులు ఎలా వుండాలో పేర్కొనబడినవి. రూలు 22లో అలా ఏర్పాటు చేసిన క్యాంటిన్ మేనేజ్‌మెంటుకు గాను ఒక మేనేజింగ్ కమిటిని ఏర్పాటు చేయాలని ఈ కమిటిలో కనీసం ఇద్దరికి తగ్గకుండా ఐదుగురికి మించకుండా సభ్యులు వుండాలని, ఆ కమిటీలో కార్మికులకు యాజమాన్యానికి సమాన ప్రాతినిధ్యం వుండాలని, కార్మిక ప్రతినిధులను కార్మికులు ఎన్నుకోవాలని వీరి పదవీకాలం కొత్త కమిటి ఏర్పడే వరకు లేదా 2 సం॥ వరకు ఉంటుందని నిర్దేశిస్తున్నది. (క్యాంటిన్స్ లేనిచోట్ల బస్సు స్టేషన్ లలో ప్రయాణికులకు ఏర్పాటు చేసిన క్యాంటిన్ లో మోటారు కార్మికులకు రాయితీలతో కూడిన ధరలకు టీ టిఫిన్లు అందించాలని రూలు A ప్రత్యేక మెహర్బానీ కాదని గ్రహించాలి)

MTWA సెక్షన్ 9 ప్రకారం మోటారు కార్మికులకు రాత్రిపూట డ్యూటిలో వెళ్ళినప్పుడు ఎక్కడైనా నైట్ హాల్ట్ చేయవల్సి వస్తే వారికి రెస్ట్‌రూం సౌకర్యం ఏర్పాటు చేయాలి. ఎ.పి. మోటారు రూల్సు రూలు - 23 ప్రకారం అలా ఏర్పాటు చేయబడడ్డ రెస్టురూమ్స్ "విశాలంగా, వేడిని నిరోధించే గోడలుకల్గి, నీరు కారని రూఫ్‌తో చూడ చక్కని గోడలు గచ్చుకల్గి, గాలి, వెలుతురు వచ్చే విధంగా కుర్చీలు, మంచాలు తగినన్ని ఏర్పాటు చేయాలి ప్రతిరోజు పారిశుధ్యం చేయించి పరిశుభ్రంగా వుంచాలి MTWA సెక్షన్ 10 ప్రకారం కండక్టర్, డ్రైవర్, చెకింగ్ సిబ్బందికి యూనిఫారం యిచ్చి, వాటిని ఉతుక్కొనుటకు వాషింగ్ అలవెన్సు ప్రతినెల యివ్వాలి. ఎ.పి. మోటారు రూల్సు రూలు ప్రకారం యూనిఫారం, రెయిన్‌కోట్లు, వాషింగ్ అలవెన్సు ఇవ్వాలి. MTWA సెక్షన్ 10 ప్రకారం (రూలు 25) హాల్టింగ్ స్టేషన్స్‌లో మరియు ఆపరేషన్ సెంటర్స్‌లో (డిపోలలో) 250 మించిన మోటారు కార్మికులు వుంటే మెడికల్ సదుపాయం కల్పించాలి. MTWA సెక్షన్ 11 (రూలు 26) ప్రకారం బస్సులలో ఫస్టు ఎయిడ్ బాక్సులు వుంచాలి.

సేకరణ : పి.ఎన్. మూర్తి.

[illegible]

* APILTD వర్కర్స్ ఫెడరేషన్
* Capal వర్కర్స్ ట్రేడ్ యూనియన్
* S.C. Rly ఎంప్లాయీస్ యూనియన్ (సి.ఐ.టి.యు) చీరాల సెక్షన్ కమిటి
* ఎ.పి.ఎస్.ఆర్.టి.సి. స్టాఫ్ అండ్ వర్కర్స్ ఫెడరేషన్ (సి.ఐ.టి.యు)
* చీరాల స్పిన్నింగ్ మిల్ స్టాఫ్ అండ్ వర్కర్స్ ఫెడరేషన్
* చీరాల మండల హమాలీ వర్కర్స్ యూనియన్
* చీరాల మండల లోడింగ్ అండ్ అన్ లోడింగ్ ముఠా వర్కర్స్ యూనియన్
* రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులు
* కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులు
* సివిల్ సప్లయిస్ అండ్ ఎస్కం స్టార్ పాయింట్ ముఠా వర్కర్స్ యూనియన్

పి. కొండయ్య, సి.ఐ.టి.యు, చీరాల.

# చిట్టివలస జూట్ కార్మికుల పోరాటం సంఘీభావ ప్రదర్శనలు

గంగాధర రెడ్డి నాయకత్వం కార్మికులకు తెలుపకుండా వారికి నష్టకరమైన ఒప్పందం యాజమాన్యంతో చేసుకోగా అన్ని సంఘాలు వ్యతిరేకించినవి. గంగాధరరెడ్డి ఒప్పందం వలన గతంలో పొందుతున్న కరువుభత్యం, సిక్ లీవు, పీసురేట్లు, తదితర హక్కులు కార్మికులు నష్టపోయారు. ఉన్న హక్కులు ఊడగొట్టిన గంగాధరరెడ్డి ఒప్పందానికి వ్యతిరేకంగానూ, మరియు బెంగాల్ ఒప్పందం అమలు కావాలని కార్మికులంతా సెప్టెంబరు 2 నుండి సమ్మెలోకి దిగారు. చివరకు గంగాధరరెడ్డి యూనియన్ సభ్యులు కూడా అగ్రిమెంట్‌ను వ్యతిరేకించి సమ్మె పోరాటంలో చేరారు. గంగాధరరెడ్డి గత్యంతరం లేక యూనియన్ అధ్యక్ష పదవికి రాజీనామా చేశాడు.



సెక్షన్ 12(3) క్రింద చేసిన ఒప్పందానికి తిరుగులేదని, కార్మికులందరూ చచ్చినట్లు తల ఒగ్గాల్సిందేనని అటు గంగాధరరెడ్డి, ఇటు మేనేజ్‌మెంట్ ప్రచారం చేసి నమ్మించజూచాయి. నిజమేనేమో అనుకున్నవారు కొందరు లేకపోలేదు. ఆ విధంగా కార్మికులకు నచ్చజూపారు. సి.ఐ.టి.యు. అనుబంధ సంఘం ఈ వాదనను గట్టిగా ఖండించింది. కార్మికులందరూ వ్యతిరేకిస్తే అలాంటి ఒప్పందాలు చెత్తకుండీలలోకి నెట్టబడిన ఉదాహరణలు అనేకం ఎత్తి చూపింది. విశాఖపట్నంలోనే షిప్‌యార్డులోనూ, కాల్టెక్స్‌లోనూ, కొత్తగూడెంలో బేరియం కెమికల్స్‌లోనూ 12(3) ఒప్పందాలు రద్దయిన సంగతి కార్మికులకు తెలియచెప్పింది. ఒప్పందాన్ని వ్యతిరేకించిన మొత్తం కార్మికులందరి సంతకాలు సేకరించి ప్రభుత్వానికి పంపింది.

సి.ఐ.టి.యు, ఎ.ఐ.టి.యు.సి. సంఘాల కార్మికులు కలసికట్టుగా పోరాటం సాగిస్తున్నారు. గంగాధరరెడ్డి యూనియన్ సభ్యులుకూడా పోరాటంలో పాల్గొంటున్నారు. పోరాటానికి తాము సహకరిస్తామని ఆ యూనియన్ నాయకత్వం కూడా ప్రకటించింది.

కార్మికులలో గందరగోళం కల్గించాలని మేనేజ్‌మెంట్ ఎత్తుగడలు పన్నింది. ఎ.ఐ.టి.యు.సి నాయకులను కలుసుకొని ఏలూరు కృష్ణా జూట్ మిల్లు కార్మికులు పొందుతున్నదానికి తక్కువ కాకుండా యిస్తామని 12 (3) ఒప్పందాన్ని గౌరవించవలెనని కోరింది. యాజమాన్యపు ప్రతిపాదనలను కార్మికులు తిరస్కరించారు. సి.ఐ.టి.యు, ఎ.ఐ.టి.యు.సి యూనియన్లు పోరాటాన్ని ఉధృతం చేయటానికి కార్యక్రమం రూపొందించారు. ఇతర సంఘాలు ఐక్యకార్యాచరణకు కలసి రాకపోయినప్పటికి సి.ఐ.టి.యు స్వతంత్రంగా ఆందోళనకు పూనుకుంది. వేలాది మందితో 'ఛలో విశాఖ' జైల్ భరో, సామూహిక ధర్నాలు నిర్వహించింది. ఎప్పటికప్పుడు సభలు జరిపి కార్మికులను చైతన్యం చేసింది.

సెప్టెంబరు 26, 27 తేదీలలో సి.ఐ.టి.యు రాష్ట్ర కౌన్సిల్ విజయవాడలో సమావేశమై చిట్టివలస కార్మికుల పోరాటాన్ని సమీక్షించింది. సంఘీభావం తెలుపవలెనని అనుబంధ సంఘాలన్నింటికి పిలుపు యిచ్చింది. పిలుపునందుకొని వివిధ కేంద్రాలలో సభలు జరిపి తీర్మానాలను, టెలిగ్రాములను యాజమాన్యానికి కార్మికశాఖకు పంపుతున్నారు.

విజయవాడ నగర సి.ఐ.టి.యు కమిటి ఆధ్వర్యంలో సబ్-కలెక్టర్ కార్యాలయం ఎదుట నిరాహారదీక్ష నిర్వహించబడినది. బిల్డింగ్ వర్కర్స్ యూనియన్, ఆహార, ముఠా, షాప్స్, మోటారు, హోటల్, బేకరీ, వర్కర్స్ యూనియన్ నాయకులు పాల్గొన్నారు. శిబిరాన్ని శ్రీ పి. దివాకర్ ప్రారంభించారు. నిరాహారదీక్షలో శ్రీ వెల్లంకి మోహనరావు, శ్రీ సి.హెచ్. బోగిరాజు, శ్రీ ఎన్. దుర్గారామ్, శ్రీ రూబెన్, శ్రీ కె. నర్సింహులు, శ్రీ ఆర్. సత్యనారాయణ, శ్రీ రహమాన్ తదితరులు పాల్గొన్నారు. విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలలో కూడా సంఘీభావ ప్రదర్శనలు జరిగాయి. చిట్టివలస జూట్ కార్మికుల సమస్య పరిష్కరించాలని కార్మిక మంత్రికి, లేబర్ కమీషనర్‌కు రాష్ట్రంలోని వివిధ జిల్లాల నుంచి టెలిగ్రాములు పంపబడినవి.

అక్టోబరు 20వ తేదీన కార్మికమంత్రి, కార్మిక కమీషనర్ల సమక్షంలో యాజమాన్యానికి కార్మిక సంఘాల ప్రతినిధులకు మధ్య చర్చలు జరిగినవి. అయినా చర్చలు ఒక కొలిక్కి రాలేదు. తిరిగి సమావేశం కావాలనుకున్నారు. సమ్మె కొనసాగుతోంది.

**కేంద్ర ప్రభుత్వ నూతన పారిశ్రామిక విధానాలకు వ్యతిరేకంగా నవంబరు 25న ఛలో ఢిల్లీ !**

# పోషకాహారం

'అన్నం పరబ్రహ్మ స్వరూపం' ఇది పెద్దల సూక్తి. బ్రహ్మ ఉన్నాడో లేదో తెలియదు కాని, మన శరీరం లోని అణువణువు పని చేయడానికి అన్నం అవసరమనేది వాస్తవం. నిత్య జీవితంలో ప్రతి మనిషి సమస్యల వలయంలో నిరంతరం పోరాటాలు జరిపేది తన కడుపు నింపుకొనటానికి అవసరమైన పట్టెడు మెతుకుల కోసమే. ఈ రోజు ఎన్ని పోరాటాలు జరిపినా, ఎన్ని సమస్యలను పరిష్కరించినా మన దేశంలో, ముఖ్యంగా పిల్లలను, మహిళలను, వృద్ధులను ఒక జబ్బు పట్టి పీడిస్తుంది. అదే పౌష్టికాహార లోపం. దీనికి మూలం పేదరికమే.

భారతదేశంలో వరి ధాన్యాన్ని ఆహారంగా ఎక్కువ ఉపయోగిస్తారు. వరి తరువాత జొన్నని విరివిగా వాడతారు. కాని మనం ఇంకా స్వాతంత్ర్యం వచ్చిన ఇన్నేళ్ళకు కూడా ఆ రెండు అత్యవసర పంటలు పండించడంలో స్వయంసమృద్ధి సాధించలేక పోయాము. సంవత్సరానికి వుంచుకొంటే ఆహార పదార్థాల కొరత రానున్న కాలంలో ఇంకా తీవ్ర రూపం దాల్చుతుంది. సంవత్సరానికి సగటు మనిషి భారతదేశంలో 200 కేజీల ఆహార పదార్థాలను తీసుకొంటున్నాడు. కాని ప్రపంచంలో అత్యధిక, జనాభా కలిగిన జన చైనాలో సగటు మనిషి 330 కేజీలు సేవిస్తున్నాడు. దాదాపు ఒకే సారి స్వాతంత్ర్యం పొందిన ఈ రెండు దేశాల మధ్య ఎంత వ్యత్యాసం? ప్రతి మనిషి ప్రతి రోజు తన పనులు చేసుకోవటానికి 2200 కాలరీల శక్తి అవసరం. కాని భారతీయ పౌరుడు రోజుకి కేవలం 1900 కాలరీలను మాత్రమే పొందుతున్నాడు. అదే అభివృద్ధి చెందిన దేశాలలో, మరియు చైనాలో రోజుకి 2300 కేలరీలు సేవిస్తున్నాడు. దీని మూలంగా మనలో పని చేయటానికి కావల్సిన శక్తి సామర్థ్యాలు తగ్గటమే కాక, సమాజ అభివృద్ధి కూడా కుంటు పడుతుంది.

మన శరీరంలో పౌష్టికాహారం లోపం వల్ల మాంసకృతులు (ప్రోటీన్‌లు) తగ్గి రెండు రకాల జబ్బులు వస్తాయి. అవి యెరాస్మస్ మరియు కేషియార్కర్. అవి పిల్లలలో బుద్ధి మాంద్యాన్ని కలిగిస్తాయి, అలాగే శరీరంలో రోగ నిరోధక శక్తిని తగ్గిస్తాయి. దీంతో అనేక జబ్బులు, అంటువ్యాధులు అతి వేగంగా ప్రబలుతాయి. భారతీయ వైద్య పరిశోధనా మండలి (ICMR) ప్రకారం మన దేశంలో 53% మంది వివిధ రకాలైన పౌష్టికాహార లోపాలతో బాదపడ్తున్నారు. అలాగే 3% శాంతం మంది అసలు నిత్య జీవితంలో అత్యవసర పనులకు కూడా అవసరమైన ఆహార పదార్థాలను సేవించుటలేదు. అంటే వారి పరిస్థితి మరీ అధ్వాన్నంగా వుందని పేర్కొంది.

పౌష్టికాహారం లోపం, ముఖ్యంగా సామాజిక అసమానతలకు అద్దం పడుతుంది. ఈ సమస్య పేదరికం నుండి ఉద్భవిస్తున్నది అనేది నగ్న సత్యం. నిజ వేతనాలకి పౌష్టికాహారం లోపాలకి అవినాభావ సంబంధం వుంటుందని ఈ క్రింది పట్టిక తెలియచేస్తుంది.

| (రూ॥లలో) తలసరి నెల ఆదాయం | | శక్తి (కేలరీలలో) |
|---|---|---|
| 30-00 | 2250 | 2026 |
| 30-45 | 2264 | 2178 |
| 45-60 | 2259 | 2131 |
| 60-90 | 2381 | 2130 |
| 90-150 | 2561 | 2213 |
| 150-300 | 2765 | 2254 |
| 7-300 | 3166 | 2595 |

పై పట్టిక ద్వారా తేలేదేమిటంటే, పరిస్థితి రాను రాను దిగజారుతుందే కాని, 15 సంవత్సరాలుగా ఎలాంటి అభివృద్ధి జరుగలేదు. దీనికి కారణం పైన ఉదహరించినట్లు, మన సమాజంలో పేదరికం రోజురోజుకి పెరగడమే. కావున మన పాలకులు ప్రతి సంక్షేమ పథకంలోనూ పేదరికం నిర్మూలించడానికి కృషి చేయాలి. ఇందిరాగాంధీ హయాంలో "గరీబీ హటావో" అని ఆర్భాటంగా నినాదాలిచ్చినా ప్రభుత్వ ఆర్థిక విధానాల ఫలితంగా పేదరికం పెరిగిపోతూనే వుంది.

ప్రభుత్వ విధానాలపై సంయుక్తంగా జరిపే పోరాటాలే ఈ పోషకాహార సమస్యకు తగిన పరిష్కార మార్గాలు.

## నూరు శాతం చందాదార్లు !

నల్లగొండ జిల్లా భువనగిరి డివిజన్ సి.ఐ.టి.యు. మహాసభ అక్టోబరు 2వ తేదీన బీబీనగర్‌లో జరిగినది. భువనగిరి ఆలేరు ప్రాంతంలో యూనియన్ సభ్యులందరిని కార్మిక లోకం పాఠకులుగా ఈ క్రింద పేర్కొనబడిన యూనియన్‌లు చేర్పించినవి.

* సిమెంట్ పోల్స్ వర్కర్స్ యూనియన్, ఆలేరు
* హమాలీ యూనియన్, ఆలేరు
* సూర్యవంశీ స్పిన్నింగ్ మిల్సు
* బాంబినో వర్కర్స్ యూనియన్

సి.ఐ.టి.యు. రాష్ట్ర కార్యదర్శి శ్రీ కొండ్రగుంట వెంకటేశ్వర్లుగారు మహాసభకు హాజరై సందేశాలిచ్చారు. నూరు శాతం సభ్యులను కార్మికలోకం పాఠకులుగా చందాదార్లుగా చేర్పించిన యూనియన్ నాయకులకు బహుమతిగా సుందరయ్య, రణదివేగారి గ్రంథాలను అందజేశారు.

అక్టోబరు విప్లవ శుభాకాంక్షలతో

# విశాఖపట్టణం సి.ఐ.టి.యు. కమిటి

విశాఖపట్టణం

అక్టోబరు విప్లవ శుభాకాంక్షలతో

## సి.ఐ.టి.యు
## హిందూస్థాన్ షిప్‌యార్డ్
## ఫ్యాక్టరీ కమిటి

విశాఖపట్టణం

అక్టోబరు విప్లవ శుభాకాంక్షలతో

## సి.ఐ.టి.యు పారిశ్రామిక కమిటి

విశాఖపట్టణం

# శ్రామిక మహిళ

ఆలిండియా ఫెడరేషన్ పిలుపుననుసరించి 2,500 మంది అంగన్ వాడీ వర్కర్స్ అండ్ హెల్పర్స్ సెప్టెంబర్ 16న బొంబాయిలో ప్రభుత్వ సెక్రటేరియట్ ఎదుట బ్రహ్మాండమైన ప్రదర్శన నిర్వహించారు.

జీతాన్ని రు. 100/-, రు. 75/- లుగా పెంచటాన్ని అసలు పెంపుదల అనటానికే వీలులేదని, ఎందుకంటే ఎక్కువ గంటలు పనిచేయిస్తున్నారని వక్తలు విమర్శించారు. ప్రతినిధివర్గం గ్రామాణాభివృద్ధి శాఖ, సాంఘిక సంక్షేమ శాఖ మంత్రులతో చర్చించారు.

ఇతర కోర్కెలతోపాటు పండుగ ఎడ్వాన్సుగా ఎక్స్ గ్రేషియా చెల్లింపు కావాలని, అంగన్ వాడీ సెంటరుకు పోవటానికి దూరంతో నిమిత్తం లేకుండా కన్సాలిడేటెడ్ మీటింగ్ ఎలవెన్స్ యివ్వాలని, ట్రైనింగ్ పీరియడ్ లో స్టైఫండు పెంచాలని ప్రతినిధివర్గం మంత్రులకు విజ్ఞప్తి చేసింది.

అన్ని కోర్కెలను పరిశీలిస్తానని, ప్రత్యేకించి "మీటింగ్ అలవెన్సు"ను, స్టైఫండు పెరుగుదలను కేంద్ర ప్రభుత్వానికి సిఫారసు చేస్తానని మంత్రి హామీ యిచ్చారు.

అలాగే అదనపు విధులు అంగన్ వాడీ వర్కర్లకు అప్పగించబడవు అని కూడ ఖచ్చితమైన హామీ యిచ్చారు.

పట్టణాల్లో వుండే సెంటర్లకు టెంపరరీగా అపాయింట్ లు యిస్తున్నారని సోషల్ వెల్ ఫేర్ మంత్రి దృష్టికి తేగా తక్షణమే దానిని ఆపుచేయిస్తానన్నారు.

ప్రదర్శనలో పాల్గొనటానికి చంద్రాపూర్, గడ్చిరోలి, పర్భని, అమరావతి, నాగ్ పూర్, పూనా, సంగ్లీ, సతారా పట్టణాలనుండి కూడ అంగన్ వాడీ వర్కర్లు బొంబాయి చేరారు. కొందరు రెండు రోజులు ప్రయాణం చేశారు.

ప్రతినిధివర్గానికి నాయకత్వం వహించినవారిలో సి.ఐ.టి.యు రాష్ట్ర అధ్యక్షులు శ్రీ ప్రభాకర్ సాంజ్ గిరి, శ్రీమతి అహల్యారంగ్నేకర్ కూడా వున్నారు.

ముఖ్యమంత్రిని కూడ కలిసి చర్చిస్తామని సంతృప్తికరమైన సమాధానం రానట్లయితే అసెంబ్లీ ఎదుట శీతాకాలపు సమావేశం సందర్భంగా ప్రదర్శన నిర్వహిస్తామని

సంఘటన నాయకులు ప్రకటించారు.

## అంగన్ వాడి

సెప్టెంబరు 16న హైదరాబాద్ లో అసెంబ్లీ ఎదుట అంగన్ వాడీ వర్కర్ల ప్రదర్శన అనంతరం ప్రతినిధివర్గం స్త్రీ, శిశు సంక్షమ మంత్రిని కలిసి వినతిపత్రంపై చర్చించారు.

కేంద్రానికి సంబంధించిన విషయాలపైన కేంద్రంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతామనీ, రాష్ట్ర పరిధిలోని విషయాలపైన అన్ని ప్రాజెక్టు ఆఫీసర్లకు ఉత్తరాలు వ్రాశామని, కేంద్రాల యింటి అద్దె, ఎలవెన్సుల చెల్లింపులలో జాప్యంగురించి ప్రాజెక్టు ఆఫీసులనుండి సమాధానం రాగానే తగు చర్యలు తీసుకుంటామని డైరెక్టరు కార్యాలయం ఎ.పి. అంగన్ వాడీ వర్కర్స్ అండ్ హెల్పర్స్ యూనియన్ ప్రధానకార్యదర్శికి లేఖ వ్రాశారు.

సెప్టెంబరు 16న హైదరాబాద్ లో ప్రదర్శన అనంతరం మంత్రిగారికి వినతి పత్రం అందచేసి 18వ తేదీన వివరాలు చర్చించడమైనది. చర్చల సమయంలో మంత్రితోపాటుగా వుమెన్ వెల్ ఫేర్ డైరెక్టరు శ్రీమతి చందనాఖాన్, జాయింట్ డైరెక్టర్ శ్రీమతి ప్రజాపతిగార్లు కూడ పాల్గొన్నారు

## ఫైమెక్స్ లో తిరగబడిన మహిళా కార్మికులు

జీడిమెట్ల పారిశ్రామిక ప్రాంతంలోని ఫైమెక్స్ ఇంటర్నేషనల్ లి॥ మహిళా కార్మికులు, తమ పరువు మర్యాదలు కాపాడుకోవటానికి తిరగబడ్డారు. కంపెనీలో విద్యుత్ సరఫరా ఆగిపోయిన సందర్భంగా ఒక మహిళా కార్మికురాలి చేయి మరో పురుష కార్మికుడు పట్టుకున్నాడని ఇంజనీర్ చెప్పాడనే పేరు మీద యాజమాన్యం ఇద్దరు మహిళా కార్మికులను ఒప్పించేందుకు వత్తిడి చేసింది. ఏ మహిళా కార్మికురాలు నుండి ఆరోపణ లేకపోయినప్పటికీ, ఒక ఇంజనీరు ఈ విషయం చెప్పాడనే పేరుమీద మహిళా కార్మికులను ఒప్పించేందుకు ఒత్తిడి చేయటంతో ఆ మహిళలు భరించలేక బాధపడుతు ఇతర మహిళా కార్మికులకు చెప్పుకున్నారు. అలాంటి వార్త ఇంజనీర్ యాజమాన్యానికి చేర్చినపుడు, యూనియన్ కమిటీలోని మహిళా నాయకులకు విషయం తెలియజేసి వాస్తవం తెల్సుకునే ప్రయత్నం చేసియుండాల్సిందని, అలా కాకుండా యాజమాన్యం తప్పుడు పద్ధతుల్లో వ్యవహరించిందనీ, ఇది మహిళల పరువు, మర్యాదలకు సంబంధించిన విషయమని, ఈ ప్రచారం కుటుంబాలలో కూడా సమస్యలకు దారితీస్తుందని మహిళలంతా తీవ్రంగా స్పందించారు. ఈ ఘటనలో చెప్పబడిన ఇంజనీర్ కొందరు మహిళా కార్మికులతో గతంలో కూడా అమర్యాదగా వ్యవహరించాడని కొందరు మహిళలు ఆరోపిస్తున్నారు. ఇవన్నింటి కారణంగా మహిళలు భరించలేక తిరగబడితే, సమస్య స్వభావాన్ని సరిగా అర్థంచేసుకుని సున్నితమైన ఈ సమస్యను జాగ్రత్తగా పరిష్కరించ వల్సింది పోయి, ఇంజనీర్ను కొట్టారనే పేరుమీద నల్గురు మహిళా కార్మికులను సస్పెండ్ చేసింది యాజమాన్యం. ఈ ఘటన దురదృష్ట కరమైనదని, యాజమాన్యం వైఖరి అభ్యంతరకరమైందని యూనియన్ నిరసించింది. ఘటన జరిగి వారం రోజులైనా, మహిళా కార్మికులను సస్పెండ్ చేసి నాల్గురోజులు గడచినా యూనియన్ తో చర్చించడం ద్వారా సమస్యను పరిష్కరించేందుకు యాజమాన్యం సిద్ధపడక పోవటాన్ని యూనియన్ ఖండించింది. వెంటనే సస్పెండ్ చేసిన మహిళా కార్మికులను తీసుకోవాలని డిమాండ్ చేసింది.

## యాజమాన్యపు ఎత్తుగడలని త్రిప్పికొట్టిన మహిళా కార్మికులు

సంఘటితమైతే యజమానులు అవలంభించే ఎటువంటి ఎత్తుగడ నయినా త్రిప్పికొట్టే వారికి గుణపాఠం నేర్పగలుగుతారనేది షోలాపూరులో

మహిళా బీడీ కార్మికులు నిరూపించారు. మహారాష్ట్రలోని షోలాపూరులో బీడీ యజమానులు కనీసవేతనాలు, డి.ఎ. లు ఎగవేయటానికి ఒక ప్లాను తయారుచేశారు.

8 గంటలలో 2000 బీడీలు తయారు చేయగలిగిన వారికి "11 తులాల వెండి కప్పు" మరియు రు.లు 1000/- బహుమానం అని ప్రకటించి కార్మికుల మధ్యనే పోటీపెట్టి పాల్గొనేవారిని రమ్మని కోరటం జరిగింది. దీని వెనుకనున్న కుట్రని గుర్తించని కొంతమంది అమాయకులు ఈ పోటీలో పాల్గొనటానికి తయారయారు. యజమానులు ఈ పోటీ జరిగే ప్రాంతంలో ఫోటోలు, వీడియోలు తీయటానికి, మిగతా ఏర్పాట్లు చేసుకున్నారు. ఈ విషయం తెలుసుకున్న కొంతమంది మహిళా కార్మికులు దానిలోని మోసాన్ని గుర్తించి పోటీ జరిగే స్థలానికి పెద్ద ప్రదర్శన నిర్వహించారు. వేలాది మంది మహిళలు ఈ ప్రదర్శనలో పాల్గొన్నారు. యజమానుల ఈ ఎత్తుగడకి వ్యతిరేకంగా పెద్ద ఎత్తున నినాదాలు యిచ్చారు. చుట్టుప్రక్కల ఫ్యాక్టరీలలోని వారు కూడా ఈ ప్రదర్శనలో కలవటం జరిగింది. లక్ష్మీనర్సు అనే మహిళా కార్మికురాలు పోటీలో పాల్గొనేవారిని తీసుకువచ్చిన కారుకి అడ్డుగా పడుకుని మిగతా వారంతా కారుని చుట్టుముట్టి పెద్ద ఎత్తున తమ నిరసనని తెలియజేయటం జరిగింది. పోటీలో పాల్గొనటానికి వచ్చిన మహిళలు కూడా దీని వెనుక నున్న కుట్రని అర్థం చేసుకుని వీరిని కలవటం జరిగింది. ఆ విధంగా తమ సంఘటిత శక్తిద్వారా యజమానులు ఏమీ చేయలేని, ఏమీ మాట్లాడలేని పరిస్థితికి నెట్టి వారికి గుణపాఠం చెప్పటం జరిగింది.

## ఉపాధి కోల్పోయిన మహిళలు

1984లో భోపాల్ గాస్ విషాదాంతం తరువాత బాధితులకోసం గవర్నమెంటు కుట్టుమిషను సెంటర్లు ప్రారంభించింది. కొంతమంది మహిళలకి ట్రైనింగ్ యిచ్చి వారికి ఈ సెంటర్లు ద్వారా పీస్ రేటుకి పని యివ్వటం జరుగుతోంది. దీని నుండి వారు నెలకి 320 రు.లు కొంతకాలం తరువాత క్రమంగా 300/- తిరిగి 320/- వరకు పొందగలుగుతున్నారు. మొత్తం సెంటర్లు అన్నీ కలుపుకుంటే దాదాపు 2300 మంది ఈ సెంటర్ల ద్వారా ఉపాధి పొందగలుగుతున్నారు.

కాని ఒక్కసారిగా జూలై 25 నాటి నుండి వీరికి బట్ట యివ్వటం ఆపివేయటం జరిగింది. అంతే కాకుండా సెంటర్లు మూసివేస్తున్నామని ప్రకటించటం జరిగింది. దీనిపై సంబంధిత అధికారికి మెమొరాండం యిచ్చి కారణం అడిగితే గవర్నమెంటునుండి రావలసిన రిలీఫ్ ఫండు ఆగిపోయినట్లుగా చెప్పారు. మధ్యప్రదేశ్ గవర్నమెంటు తిరిగి ఆ సెంటర్సుని తెరవాలని పోరుతూ వారంతా తమ పోరాటాన్ని కొనసాగిస్తున్నారు:.

**ఇచ్చిన హామీలు :**

1. కేంద్ర ప్రభుత్వానికి సంబంధించిన సమస్యలపై ప్రతిపాదనలు పంపుతారు
2. వేసవి సెలవుల సంగతి పరిశీలించబడును.
3. 45 సం॥ల లోపువారికి ప్రమోషన్ల విషయంలో పరీక్షలు నిర్వహించాలని ప్రిన్సిపల్ సెక్రటరీకి శిఫారసులు పంపటమైనది.
4. ఐ.సి.డి.ఎస్. గైడ్‌లైన్స్ ప్రకారం ఎక్కడ పనిచేసినా సర్వీసు బ్రేకు పడదు. కేసులు ఎత్తిచూపితే సర్వీసు కంటిన్యూ చేయబడుతుంది.
5. సి.డి.పి.ఓ. లు చేస్తున్న అక్రమ ట్రాన్సుఫర్లు, అవినీతి వేధింపులపై తగు చర్య తీసుకుంటారు.
6. జీతాలు నెల నెలా అందేలా చూస్తారు.

## రైల్వే కార్మికుల నిరసన

వైద్య సదుపాయాలు మెరుగు పరచాలంటూ తిరుపతిలోని క్యారేజి రిపేరు షాప్ కార్మికులు ఎంప్లాయీస్ యూనియన్ (సి.ఐ.టి.యు) ఆధ్వర్యంలో అక్టోబరు 8న నిరసన ప్రదర్శన చేశారు. తర్వాత జరిగిన సభలో అధ్యక్ష కార్యదర్శులు శ్రీ మీరయ్య, మురళి, సి.ఐ.టి.యు జిల్లా నాయకులు శ్రీ నరశింహులు, చలపతి ప్రసంగించారు. మెడికల్ సూపరింటెండెంట్ గారికి వినతిపత్రం అందించారు.

## పూర్తి సామర్థ్యంతో పనిచేస్తాం అవకాశం కల్పించండి

## రైల్వే కార్మికుల విజ్ఞప్తి

క్రింది సమస్యల పరిష్కారానికి యూనియన్ కేంద్ర సహాయమంత్రి డా. చింతా మోహన్‌కి 17-10-92న సి.ఆర్.ఎస్. కి విచ్చేసిన సందర్భమున మెమోరాండం ఇవ్వడం జరిగినది. ఎస్.సి. రైల్వే ఎంప్లాయీస్ యూనియన్ తిరుపతి బ్రాంచి ప్రెసిడెంటు ఈ క్రింది విషయంలో పత్రికలకు తెలియజేశారు.

1. వర్కుషాపు 200 యూనిట్ల పనిసామర్థ్యము కల్గి యున్నప్పటికి, ప్రస్తుతం 70 యూనిట్లు మాత్రమే ఇవ్వగల్గుచున్నాము. త్వరితగతిన 200 యూనిట్లను పెంచి, ప్రాంతీయ వాసులకు ఉద్యోగ అవకాశాలు కల్పించాలని కోరింది.
2. రైల్వే కార్మికుల పిల్లలకు రైల్వే స్కూలును ఏర్పాటు చేయాలని కోరింది.
3. రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులైన ఆర్.టి.సి. / టి.టి.డి. ఉద్యోగులకు ఇస్తున్న "పైలిగ్రిం-అలవెన్సు" రైల్వే కార్మికులకు (సి.ఆర్.ఎస్) ఇవ్వాలని కోరింది.
4. సి.ఆర్.ఎస్. నందు నీటిని శుభ్రపరచు ప్లాంటును ఏర్పాటు చేయాలని కోరింది.
5. 1986 వ సంవత్సరములో ఫిట్టర్లు (స్కిల్డ్ గా) సెలెక్టు అయిన 140 మంది నిరుద్యోగులకు ఉద్యోగాలివ్వాలని కోరింది.
6. సి.ఆర్.ఎస్. రైల్వే హాస్పిటల్ వైద్య విధానాన్ని మెరుగుపరుస్తూ 50 పడకలు గల ఆసుపత్రి నిర్మించాలని కోరింది.
7. 3 సం॥ల పైబడి రైల్వే కాంట్రాక్టు సిపాయి వాలాలుగా పనిచేయు 40 మందిని రైల్వే కార్మికులుగా గుర్తించాలని యూనియన్ మంత్రిగారిని కోరింది.

# ఆడవాళ్ళు అబలలుకాదు సబలలు అని నిరూపించిన సారా వ్యతిరేక ఉద్యమం

యస్. పుణ్యవతి

సహాయ కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ మహిళా సంఘం

గత మూడు మాసాలుగా నెల్లూరు జిల్లాలోను గత మాసం నుండి రాష్ట్ర వ్యాపితంగా సాగుతున్న సారా వ్యతిరేక ఉద్యమం తీవ్ర సంచలనం సృష్టిస్తోంది. అబలలుగా, శక్తిహీనులుగా, చంచల స్వభావులుగా, రెండవ తరగతి పౌరులుగా, ఈ సమాజంలో పరిగణింపబడుతున్న ఆడవాళ్ళు ఆదిశక్తులయ్యారు. సారా పాటలు జరుగవలసిన సెప్టెంబర్ 11న నెల్లూరులో 50 వేల మంది ప్రధానంగా స్త్రీలు మహాప్రదర్శన నిర్వహించి వేలంపాటలు అడ్డుకున్నారు. అవి మొదలు, ప్రభుత్వం వేలం పాటలు జరుపుతామని ప్రకటించిన ప్రతిసారీ వేల సంఖ్యలో మహిళలు పికెటింగ్‌లు, ధర్నాలు జరిపి గత నెల రోజులుగా వేలం పాటలను అడ్డుకుంటున్నారు. నెల్లూరు జిల్లా ఉద్యమ స్ఫూర్తితో రాష్ట్ర వ్యాపితంగా ఉద్యమం సాగుతోంది. రాజకీయ విభేదాల కతీతంగానూ, ఏ రాజకీయాలకీ సంబంధంలేని స్త్రీలు ఈ ఉద్యమంలో స్పాంటేనియస్‌గా పాల్గొంటున్నారు. సారా జీపుల కడ్డం పడుతున్నారు. కొట్లు మూయిస్తున్నారు. ప్రదర్శనలు, ధర్నాలు, నిరాహార దీక్షలు, నిర్వహిస్తున్నారు. యువకులు, మధ్యతరగతి మహిళలు వీరి కండదండలిస్తున్నారు.

రాష్ట్రంలో వివిధ మహిళా సంఘాలు, స్థానిక మహిళా సంఘాలు తమ శక్తి మేరకు చురుకుగా పాల్గొంటున్నారు. ప్రధానంగా ఆంధ్రప్రదేశ్ మహిళాసంఘం శాఖలు గ్రామ స్థాయి నుండి జిల్లా, పట్టణ, స్థాయి వరకు ఇతర సంఘాలను, స్థానిక పెద్దలను కలుపుకొని పోరాట కమిటీలను ఏర్పాటు చేస్తున్నారు. ప్రదర్శనలు, ధర్నాలు, సదస్సులు నిర్వహిస్తూ కరపత్రాలు పంచుతూ సారా త్రాగడం వల్ల ఆర్థికంగా, సాంఘికంగా, ఆరోగ్యరీత్యా కుటుంబాల్లో కలిగే అనర్థాలను వివరిస్తూ ప్రచారం చేస్తున్నారు. మహిళలే గాక సారా త్రాగే పురుషులు కూడ ఈ ఉద్యమంలో పాల్గొనేట్లు కృషి చేస్తున్నారు.

పత్రికలు ఈ ఉద్యమానికి పూర్తి సహకారాన్నిస్తున్నాయి. ఉద్యమ వార్త లేని రోజు లేదు. సారాజులను పెంచి పోషిస్తూ, వారి అండదండలతో గద్దెనెక్కిన వారితో సహా అన్ని రాజకీయ పార్టీలు మహిళలు ప్రారంభించిన ఈ ఉద్యమానికి మద్దతు నివ్వక తప్పని పరిస్థితి ఏర్పడింది. కష్ట జీవుల కష్టాలతో మమేకమై మహిళా ఉద్యమానికి పూర్తి అండదండ లిస్తున్న వామపక్షాలు, ప్రజా సంఘాలు, మేధావులు పూర్తి సహాయ సహకారాలందిస్తున్నారు.

అయితే ఇదే సందర్భంలో ఈ ఉద్యమం ప్రారంభమయిన పూర్వాపరాలు అందుకు దారి తీసిన ఆర్థిక సామాజిక పరిస్థితులు ఒక్కసారి పరిశీలించాలి.

కష్టజీవులైన వ్యవసాయ కూలీలు, పట్టణాలలోని అసంఘటిత కార్మికులు వచ్చిన అతి కొద్ది సంపాదనలో ప్రధాన భాగం సారా పాకెట్లకు తగలేస్తున్నారు. కుటుంబ పోషణకు వెచ్చించేది అతి స్వల్పం పైగా తన్నులు, తగువులతో కుటుంబ జీవితంలో అరాచక వాతావరణం ఏర్పడింది. పిల్లల ఆలనా పాలనా చూసే దిక్కు లేదు. వారికి సరైన తిండి లేదు. చదువు లేదు. దొంగతనాలకు సయితం పాల్పడుతున్నారు. అరాచకులుగా మారుతున్నారు.

కష్టజీవుల్లో సాంఘిక, సాంస్కృతిక జీవనం దిగజారడానికి త్రాగుడు ఒక కారణం. వారిలో ఉండాల్సిన ఐక్యతకిది గొడ్డలిపెట్టుగా మారింది. స్త్రీలపై అత్యాచారాలకు భూస్వామ్య శక్తులు ఒక కారణం కాగా ఒళ్ళు తెలియని త్రాగుడు మైకం ఒక ప్రధాన కారణం. తల్లెవరో, చెల్లెవరో తెలియని పరిస్థితి. పెట్టుబడిదార్లు, భూస్వామ్య శక్తులు ప్రైవేటు సైన్యాలకు సారా మహామృతం. ఈ పరిస్థితిలో అక్షర ఉద్యమ స్ఫూర్తితో నెల్లూరు జిల్లా దూబగుంటలో మహిళలు సారాకు వ్యతిరేకంగా ఉద్యమించారు. పల్లెలో తమ వారికి నచ్చజెప్పారు. గ్రామంలో పెద్దల అండదండలు తీసుకున్నారు. సారా జీపును అటకాయించారు. సారా అంగడికి తాళం పెట్టించారు. ఈ స్ఫూర్తితో జిల్లాలో ఒకటొకటిగా అనేక గ్రామాలకు వ్యాపించింది. మా ప్రతినిధివర్గం నెల్లూరు జిల్లా గ్రామాలలో పర్యటించే సందర్భంలో మా గుండెల్ని కదిలించే అనేక అనుభవాలెదురయ్యాయి. త్రాగి వచ్చి కన్నుగానక పసి బిడ్డను కాలితో తొక్కి చంపిన తండ్రులు, కత్తితో భార్య చెవికోసిన భర్తలు, స్నానానికి పోతు తడిక మీద భార్యవేసుకున్న చీరె ఎత్తుకపోయిన భర్తలు, ఇంట్లో గ్లాసులు, చెంబులేగాదు దీపంబుడ్డితో సహా అమ్ముకున్న కుటుంబ పోషకులు అనేకులు మాకు తారసిల్లారు.

"తాగిన రోజుల్లో ఏనాడు భార్యా బిడ్డలతో మంచి చెడ్డలు మాట్లాడింది లేదు. తాగి అర్థరాత్రి, అపరాత్రి రావడం, ఇంటి ఖర్చుకు పైసలివ్వక పోగా మంచికూర లేదని, కూడు లేదని తన్నడం, ఎప్పుడైన డబ్బు మిగిలితే ఏ ఎండు చేపలో తెచ్చి అర్థరాత్రి వేళ వండమనడం అదేమంటే పడేసి బాదడం ఇదీ రోజువారీ భాగోతమమ్మా, మా కొంపల్లో ఆనాడు తన్నులు తిన్నాం అంగళ్ళు మూయించాక ఈనాడు అన్నం తింటున్నాం". ఇటువంటి గాథలు మాకు ప్రతి ఊరిలో వినబడ్డాయి. సారా రేటు తగ్గిస్తే మీరు ఉద్యమం ఆపుతారా! అని మేమడిగిన ప్రశ్నకు "ఇవాళ మా పిల్లలు డబ్బు దొరక్క ఖాళీ ప్యాకెట్లలో నీళ్ళు పోసుకొని తాగుతున్నారు. రేటు తగ్గితే గూట్లో

రూపాయి ఎత్తుకు పోయి తాగొస్తారు. ఇవ్వాళ తండ్రులు చెడ్డారు. ఇంకా పిల్లలు కూడా చెడ్డానికా అమ్మే రేటు తగ్గడం" ఇది వారినుండి మేము పొందిన సమాధానం.

అయితే ఈ సమస్య ఈనాటిది కాదు కదా! ఇప్పుడే ఎందుకు వచ్చిందీ అనే ప్రశ్న రాక మానదు. అదే మేము ఒక గ్రామంలో మహిళను ప్రశ్నిస్తే వచ్చిన సమాధానం. "ఇన్నాళ్లున్నట్టే ధరలిప్పుడున్నాయా? కందిపప్పు కిలో 18 రు.లు, బియ్యం 7 రు.లు. ఇదివరకెప్పుడైనా ఇట్లున్నదా! మరో గ్రామంలో ఒక మహిళనుండి వచ్చిన సమాధానం. "చదువు కుంటున్నాంకదా! రోజు అందరం ఒక దగ్గర కూకుంటున్నాం. కష్టం, సుఖం మాట్లాడుకుంటున్నాం. అంగడి మూయిస్తే, బ్రతుకులు బాగవుతాయనుకున్నాం. మూయించాం.

కేంద్రంలో పి.వి. నరసింహారావు రాష్ట్రంలో జనార్దన రెడ్డి ప్రభుత్వ పుణ్యమాని ధరలు చుక్కలంటాయి. ఈమధ్య కాలంలో 250 నుండి 50% పాయింట్లకు పెరిగాయి. ఆర్థిక సంక్షోభ భారాలు కష్టజీవులపై బడుతున్నాయి. అందులో ప్రధానంగా కుటుంబాన్ని దిద్దే మహిళలు భారం మోస్తున్నారు. వచ్చే కొద్దో గొప్పో కూలిడబ్బులు మగవాళ్ళు సారాకి తగలేస్తున్నారు. వీటికి తోడు పని దినాలు రోజ రోజుకి తరిగి పోతున్నాయి. ఆడవాళ్ళకి ఇంకా తగ్గిపోతున్నాయి. అదికూడ సమాన పనికి కూలీ రేట్లు సగానికి సగం తేడా. గ్యాస్ పొయ్యిలు, రిఫ్రిజిరేటర్లు, వాషింగ్ మెషిన్లు వచ్చాక పాచిపన్లు కూడ దొరకని పరిస్థితి ఏర్పడింది. మిగిలిన మగవాడి సంపాదన సారాకి పోతే ఇక బ్రతికే దెట్లా! కనుక అందరం ఏకమయితే సారాను ఆపవచ్చు. ఇది వారి జీవితాలు బాగుపడేందుకు వెనువెంటనే వారికి దొరికిన పరిష్కార మార్గం. కనుక అందరు ఏకమయ్యారు. సంఘటిత శక్తితో కార్యరంగంలోకి దూకారు. త్రాగే పురుషులతో సయితం అందరి మద్దతు పొందారు. కొట్లు మూయించడానికి సిద్ధపడ్డారు. అక్షర ఉద్యమం వారికి అండదండలిచ్చింది.

అయితే వారికి తెలియని సంగతొకటుంది. కళ్ళెదుట సారా కొట్టు యజమాని శత్రువుగా కన్పిస్తున్నాడు తప్ప వెనకుండి నడిపిస్తున్న ప్రభుత్వం, సారా కాంట్రాక్టర్ల పాత్ర వారికి అర్థంకాలేదు. ఎక్సైజు పోలీసుల రంగ ప్రవేశంతో ఆ విషయం కూడ తెలుసుకున్నారు. "సారా త్రాగకూడదని రేడియోలో కూడ చెబుతారు. కదండి మరి మావూరికి సారా జీపు రావద్దంటే మమ్మల్ని లాఠీలతో బాదడమేమిటండీ. మేమన్న దొంగలమా! అన్న వారి సందేహాల్ని నివృత్తి చెయ్యాల్సి వచ్చింది.

ప్రభుత్వమే దానికి కారణం అని తెలుసుకున్న మరు క్షణం మా ఊరికి సారా అంగడి వద్దు అన్న డిమాండుతో వందలాది గ్రామాల నుండి 2 లక్షల సంతకాలతో సెప్టెంబర్ 11న 50 వేల మంది ప్రజలు నెల్లూరు జిల్లా కలెక్టరుకు డిమాండ్ చేశారు. ఎప్పుడయితే సంఘటిత శక్తితో నెల్లూరు ప్రజలు ఆచరణలో సారాను నిషేధించారో అదే రాష్ట్ర వ్యాపితంగా అందరికి స్ఫూర్తి నిచ్చింది. నేడు రాష్ట్ర వ్యాపితంగా వందలాది గ్రామాల్లో సారాకొట్లు మూతబడ్డాయి. కష్టజీవుల గుండెల్లో తొలకరి జల్లులు కురిశాయి.

అందుకే ఈ ఉద్యమం మరింత వేళ్ళూను కునేందుకు అందరం కృషి చేయాలి. ఇంతటి మహోద్యమాన్ని అణచడానికి లాఠీలను ప్రయోగిస్తున్న ప్రభుత్వ వైఖరిని ఖండించాలి. సారాపై ప్రభుత్వానికి సంవత్సరానికి వచ్చే ఆదాయం 800 కోట్లు కాగా కాంట్రాక్టర్ల జేబుల్లోకి పోయేది సుమారు 2,000 కోట్లు. అంటే దాదాపు కష్టజీవుల కష్టార్జితం సంవత్సరానికి సుమారు 3,000 కోట్లు వ్యర్థమవుతుంది. ఈ సారా నిషేధించిన నాడు ఆ డబ్బు వారి జీవన ప్రమాణాలు మెరుగు పడేందుకు తద్వారా పారిశ్రామిక, వ్యవసాయోత్పత్తులు పెరిగి, రాష్ట్ర ఆర్థిక వ్యవస్థలోనే పెద్ద మార్పు వచ్చే అవకాశం వుంది. కాని ఈ ప్రభుత్వం సారా పీసాల ప్రలోభంతో కష్టజీవుల ఓట్లతో గద్దెనెక్కి ప్రజా క్షేమాన్ని గాలికొదిలి, సారాజల సంక్షేమాన్ని కాంక్షించే ప్రభుత్వమే అయితే కష్టజీవుల నోటిదగ్గర కూటిని లాగనక్కర్లేదు. మనస్సుంటే మార్గముండకపోదు.

అదే సందర్భంగా ఒక్క సారాకు సంబంధించి మాత్రమే గాదు. మొత్తం కష్టజీవుల మహిళల కన్నీటిగాథలకు ఈ ప్రభుత్వ విధానాలే కారణమన్న వాస్తవాన్ని వారికి తెలియజెప్పాలి. ఈ దుష్ట విధానాలకు వ్యతిరేకంగా పోరాటానికి, సారా వ్యతిరేకోద్యమాన్ని జోడించాలి. అందుకు ప్రజాతంత్రవాదులందరూ పూనుకోవాలి.



సారాను నిషేదించాలని కోరుతూ ఆంధ్రప్రదేశ్ మహిళాసంఘం ఆధ్వర్యాన హైదరాబాద్‌లో జరిగిన ప్రదర్శన

# ఆదర్శ ప్రజానాయకుడు కామ్రేడ్ రామనాథం



కామ్రేడ్ సర్వదేవభట్ల రామనాథంగారు ఖమ్మంలో ఒక పెద్ద భూస్వామ్య కుటుంబంలో 1914లో జన్మించారు. వారి ప్రాథమిక విద్య ఖమ్మంలోనే జరిగింది. కాలేజి విద్యకోసం హైద్రాబాద్ వెళ్లారు.

ఆరోజులలోనే భారతదేశంలో జాతీయోద్యమం ఉధృతంగా సాగుతున్నది. ఆ దశలో "వందెమాతరం"గేయాన్ని కాలేజీలో ప్రార్థనాగేయంగా పాడటాన్ని నైజాం ప్రభుత్వం నిషేధించింది. ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థులు 30, 40 మంది నిషేధాన్ని ధిక్కరించి "వందేమాతరం" గేయాన్ని ఉస్మానియా యూనివర్సిటీలో ప్రార్థనా గేయంగా పాడారు. నిషేధాన్ని ధిక్కరించినందుకు ఆ విద్యార్థులను యూనివర్సిటి నుండి బహిష్కరించారు.

బహిష్కరించబడిన విద్యార్థులు అందరూ నాగపూర్ యూనివర్సిటీలో సీట్లు సంపాదించి వారి విద్యను నాగపూర్‌లో కొనసాగించారు. వారిలో కామ్రేడ్ రామనాథంగారు కూడ వున్నారు. అక్కడే ఎల్.ఎల్.బి. పూర్తిచేసి ఖమ్మంకు తిరిగివచ్చారు. నాగపూర్‌లో చదివే రోజుల్లోనే కమ్యూనిస్టు పార్టీతో సంబంధం ఏర్పడింది. ఖమ్మం వచ్చి ఆంధ్రమహాసభలో చేరారు. కమ్యూనిస్టు పార్టీని నిర్మించపూనుకున్నారు.

ఇంతలో తెలంగాణా సాయుధ పోరాటం ప్రారంభంకాగా దీనిలోభాగస్వాములయ్యారు. 1950లో వరంగల్లులో అరెస్టు కావించబడ్డారు. కాళ్లకు చేతులకు బేడీలు వేయబడి రెండు సంవత్సరాలు ఒంటరిగదిలో నిర్బంధించబడినారు.

తెలంగాణా సాయుధ పోరాటం మొదలు కాకముందే దున్నేవానికే భూమికోసం జరుగుతున్నపోరాటంలో పార్టీ నిర్ణయానుసారం తనకున్న 1600 ఎకరాలనుండి 1400 ఎకరాల భూమిని పేదప్రజలకు పంచారు.

కేవలం భూపోరాటంలో పాల్గొనటమేకాక వరంగల్ జిల్లాలో వున్న పారిశ్రామిక సంస్థ ఆజంజాహి మిల్లులోను, సింగరేణి కాలరీస్ బొగ్గుగనుల్లోను కార్మిక సంఘాలు ఏర్పర్చటంలో ప్రధాన పాత్ర వహించారు కామ్రేడ్ రామనాథంగారు. పారిశ్రామిక కార్మిక పోరాటాలను సమన్వయపరిచి ప్రజాపోరాటాలను ముందుకు తీసుక పోవటం కోసం ఎంతో కృషి చేశారు.

1964 సంవత్సరంలో కమ్యూనిస్టు పార్టీలో చీలికవచ్చినపుడు రామనాథంగారు సి.పి.ఐ. లో వుండిపోయారు.

రామనాథంగారు పంచిన భూములగుండా సాగర్ కాలువ త్రవ్వబడినది. నష్టపరిహారం యివ్వబడుతుందని 1980లో ప్రకటించబడినది. వారి భూములను దున్నుకుంటున్న రైతులు నష్టపరిహార పైకంలో సగం తీసుకుని సంతకాలు చేయండని ఆయన వద్దకు వెళ్లారు. ఆ పరిస్థితిలో ఆయనకు కుటుంబం గడవటమే కష్టంగా వున్నది. అయిననూ, పంచిన భూములపై నష్ట పరిహారం తీసుకోవటం భావ్యంకాదు తీసుకోను అని చెప్పి సంతకం చేసి రైతులను పంపారు. అలాంటి త్యాగాన్ని ప్రదర్శించిన మహోన్నత వ్యక్తి రామనాథంగారు. రాజకీయాల్లో త్యాగం అంటే ఏమిటో నిరూపించి మార్గదర్శకులయారు.

కొన్ని సంవత్సరాలుగా మధుమేహంతో బాధపడి చివరకు తన 78వ ఏట 1992 1-9-1992 వ తేదీన హైదరాబాద్‌లో మరణించారు.

**– మంచికంటి రామకిషన్‌రావు.**

## ఆంధ్రప్రదేశ్‌లో

స్పాన్సరింగ్ కమిటీలోని భాగస్వామ్యసంఘాలు అక్టోబరు 28న హైదరాబాద్‌లో సమావేశమై పారిశ్రామిక కేంద్రాల్లో జిల్లా కేంద్రాలలో సదస్సులు జరపాలని ఢిల్లీ ర్యాలీకి బాగా సమీకరించాలని నిర్ణయించారు.

ప్రభుత్వరంగ సంఘాలు డిశంబరు 3, 4 తేదీలలో హైదరాబాద్‌లో సమావేశమై కేంద్ర నూతన ఆర్థిక విధానాలకు వ్యతిరేకంగా సమ్మె నిర్ణయం చేయనున్నారు. 1991 నవంబరు 29న, 1992 జూన్ 16న స్పాన్సరింగ్ కమిటి పిలుపు మేరకు దేశవ్యాపిత సమ్మెను జయప్రదం చేసినట్లుగానే ఢిల్లీ ఛలో యాత్రను విజయవంతం చేయాలని విజ్ఞప్తి చేయబడినది.

**కేంద్ర ప్రభుత్వ ప్రజా వ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా నవంబరు 25న ఛలో ఢిల్లీ !**

# సంఘం పెట్టుకున్నందుకే కక్షసాధింపు

పశ్చిమ గోదావరి జిల్లా తణుకు పట్టణ సమీపంలోని కర్రావారి సావరం గ్రామ పరిధిలో తవుడునుండి నూనె మరియు అట్టలు తయారు చేయు కోస్టల్ అగ్రో ఇండస్ట్రీస్ లిమిటెడ్‌లో సుమారు 400 మంది కార్మికులు పనిచేయుచున్నారు.

వీరిలో సుమారు 300 మంది కార్మికులు 10 సంవత్సరముల పైబడి పని చేస్తున్నప్పటికి క్యాజువల్ లేబరుగానే పనిచేయించుకుంటున్న యాజమాన్యం వారు పర్మనెంటు చేయలేదు. సగం మందికి పైగా కార్మికులకు ఇ.ఎస్.ఐ, పి.ఎఫ్ వంటి సౌకర్యాలు లేవు. కనీస వేతనములు అసలు అమలుపర్చకుండ నెలసరి సుమారు రు. 350 లు. రు. 600 ల మధ్య ఉన్నది. మహిళా కార్మికులకు రోజువారి రు. 8-00 లకు లోపు వున్నది. బోనస్ 10 సం॥ల కాలంలో ఒక్క పర్యాయము రు. 200 లు. మాత్రం యివ్వబడింది. సంక్షేమ పనిగంటల విధానంగాని, వారాంతపు సెలవులు గాని సగం పైగా కార్మికులకు వర్తించటంలేదు. బాయిలర్ వంటి చోట్ల పని చేస్తున్న కార్మికులకు ఎటువంటి రక్షణ సౌకర్యాలు లేవు.

ఈ విధంగా ఎన్నో ఇబ్బందులకు గురియవుతున్న కార్మికులు ఎన్నో సంవత్సరాలుగా సంఘంగా ఏర్పడటానికి ప్రయత్నం చేశారు. కాని, సఫలీకృతులు కాలేదు. చివరకు 1992 ఫిబ్రవరి నెలలో సి.ఐ.టి.యు. నాయకత్వాన 190 మంది సభ్యులుగా ది. 23-5-1992న చట్ట ప్రకారం రిజిస్టరు చేయించుకున్నారు. ఈ లోపు యాజమాన్యం వారు కార్మికులు సంఘంగా ఏర్పడుతున్న విషయం గమనించి అప్పటికే ఫ్యాక్టరీలో గాయపడి ఇ.ఎస్.ఐ. శలవులో వున్న కార్మిక నాయకులు శ్రీ కొడమంచిలి వెంకన్నను సస్పెండు చేసి చివరకు టెర్మినేటు చేసినారు. అదే విధంగా దఫదఫాలుగా 2 సం॥లు మొదలు 8 సం॥ల సర్వీసు గల కార్మికులను కూడ పనులనుండి తొలగించడం ప్రారంభించారు.

ఏ విధమైన డిమాండ్లు పెట్టకుండానే, కేవలం యూనియన్ పెట్టుకున్నారన్న కక్షతో కార్మికులను తొలగించడం యాజమాన్యం యొక్క నిరంకుశ ధోరణిని తెలియజేస్తున్నది. కార్మికులను అదరించి బెదిరించి పోటీ యూనియన్ రిజిస్టరు చేయించింది యాజమాన్యం. సన్మానాల తంతు కూడ జరిపించుకుంది.

అక్రమంగా తొలగించబడినవారికి తిరిగి పనులు యిప్పించాలని, కార్మికుల సంఘ నిర్మాణ హక్కుకు రక్షణ కల్పించాలని లేబర్ అధికారులకు చేసుకున్న విజ్ఞాపనలు ఫలించలేదు.

దఫదఫాలుగా తొలగించడిన కార్మికులు జూన్ 21 నుండి 31 రోజుల పాటు రిలే నిరాహార దీక్షలు నిర్వహించారు. జూలై 10న రాత్రి షిఫ్టులో ఏకమొత్తంగా అనేకమందిని తొలగించటంతో ఆగ్రహించిన కార్మికులు ఫ్యాక్టరీ గేటు వద్ద నిరసన ప్రదర్శనలు జరిపారు. జూలై 11, 12 తేదీలలో పోలీసులను పిలిపించి 60 మంది కార్మికులను మేనేజిమెంటు అరెస్టు చేయించింది. జైలుకు పంపింది. అరెస్టులను నిరసిస్తూ 13వ తేదీన జిల్లా అన్ని కేంద్రాలనుండి వచ్చి 100 మంది ప్రదర్శన జరిపారు.

కొవ్వూరు ఆర్.డి.వో. గారి హామీ మేరకు నిరాహారదీక్షలు విరమించినా సమస్య అపరిష్కృతంగానే ఉండిపోయింది.

తొలగించిన 90 మందిని పనిలోకి తీసుకోవాలంటూ అక్టోబరు 1న 1000 మందితో ప్రదర్శన జరిపి నిరవధిక నిరాహార దీక్షలు ప్రారంభించబడినవి. అక్టోబరు 7న జిల్లా వ్యాపితంగా భీమవరం, పాలకొల్లు, నర్సాపురం, వీరవాసరం, ఆకివీడు, తాడేపల్లిగూడెం, నిడదవోలు, తణుకు, మొగల్తూరు, కొవ్వూరు పట్టణాలలో మేనేజిమెంటు మొండివైఖరిని నిరసిస్తూ వేలాదిమంది కార్మికులు ప్రదర్శనలు జరిపారు. అధికారులకు వినతిపత్రాలు అందజేశారు. 13వ తేదీన ఏలూరులో 1000 మంది ప్రదర్శనగా వెళ్లి జిల్లా కలెక్టరు జోక్యాన్ని అభ్యర్థించారు. ఈ విధంగా కోస్టల్ అగ్రో యాజమాన్యం మొండి వైఖరికి వ్యతిరేకంగా జిల్లా వ్యాపితంగా నిరసన వెల్లువ వెల్లువికింది.

అక్టోబరు 14వ తేదీన హైదరాబాదులో జాయింట్ లేబర్ కమీషనర్ సమక్షంలో చర్చలు జరిగినవి. ఉభయులు వాదనలు విని ఇ.ఎస్.ఐ కార్డులున్న వారుగా రుజువులున్న 48 మందిని పనిలోకి తీసుకోవలసిందిగా మేనేజిమెంటువారికి సలహాయిచ్చారు జె.సి.ఎల్. అలాగే నిరాహార దీక్షలు విరమించి మిగిలిన సమస్యలు తరువాత పరిష్కారానికి కృషి చేయవలెనని కార్మికులకు చెప్పారు. జె.సి.ఎల్. సలహాను పాటించి కార్మికులు 16వ తేదీన నిరాహార దీక్షలు విరమించారు. జె.సి.ఎల్. సలహా ప్రకారం, పెద్దల సలహాననుసరించి కార్మికులు 19వ తేదీన ఫ్యాక్టరీకి హాజరైనారు. కాని మేనేజిమెంటు తన పేచీకోరు విధానాన్ని మానుకోలేదు. 90 మందికిగాను 27 మందిని మాత్రమే తీసుకుంటానని ప్రకటించింది.

దీనిపై 21-10-92 జె.సి.యల్. గారు జాయింట్ మీటింగ్‌కు పిలిచారు. కార్మిక ప్రతినిధులు మాత్రమే హాజరైనారు. మేనేజిమెంటు ప్రతినిధులు హాజరు కాలేదు. తిరిగి 29వ తేదీకి మీటింగు వాయిదా వేయబడినది.

కార్మికుల చట్టబద్ధ హక్కులను గుర్తించకపోవటమేకాక కక్షసాధింపు చర్యలు సాగిస్తూ కార్మిక శాఖ అధికారుల సలహాలను కూడ ధిక్కరిస్తున్న యాజమాన్యం వారిని అదుపు చేయాలని ప్రభుత్వాన్ని కార్మికులు కోరుతున్నారు. జిల్లా వ్యాపితంగా కార్మికుల్లో వ్యక్తమయిన భావాలను దృష్టిలో పెట్టుకుని ఇకనైనా యాజమాన్యం తన మొండివైఖరి విడనాడాలని కూడ కోరుతున్నారు.

### గమనిక

## 'కార్మికలోకం'

గత మాసాలలో యీమధ్య సంపుటి 18కి బదులు 19గా పొరపాటున పడింది. అచ్చు పొరపాటు. సంపుటి 18గా గుర్తించగలరు.

# పటాన్ చెరు ప్రాంతంలో సి.ఐ.టి.యు. విస్తరణ

పటాన్ చెరు చుట్టుపక్కల ప్రాంతాల్లో సి.ఐ.టి.యు. ఒక గుర్తింపు గలిగిన శక్తిగా ఎదిగిందని, వివిధ పరిశ్రమల కార్మికులు సి.ఐ.టి.యు. క్రిందికి రావటమేగాక ఇతర కార్మికసంఘాల క్రింద నున్న కార్మికులు కూడా సలహా సంప్రదింపులుకై డివిజన్ నాయకత్వాన్ని సంప్రదిస్తున్నారని 4-8-92 శ్రామిక్ భవన్ లో జరిగిన డివిజన్ ప్లీనమ్ గుర్తించింది. 15 అనుబంధ సంఘాలు, బి.డి.ఎల్. ఆర్డినెన్స ఫ్యాక్టరీ, ఆల్విన్, బి.హెచ్.ఇ.ఎల్. ల నుండి కొన్ని పెద్ద ప్రైవేటు పరిశ్రమలనుండి ఆఫీసు బేరర్స 100 మంది హాజరైన ఈ ప్లీనమ్‌కి సి. రాములు అధ్యక్షత వహించారు. ప్రధానకార్యదర్శి వ్రాతపూర్వకంగా ప్రవేశపెట్టిన రిపోర్టుపై 18 మంది చర్చల్లో పాల్గొన్నారు. నగర సి.ఐ.టి.యు. అధ్యక్షులు పి.ఎస్.ఎన్. మూర్తి సమావేశానికి హాజరై తగు సూచనలిస్తూ ఉపన్యసించారు.

24-2-91న డివిజన్ కమిటి ఏర్పడిన తర్వాత ఒకటిన్నర సంవత్సరాల కాలంలో జరిగిన కృషిని సమీక్షించుకుని కర్తవ్యాలు రూపొందించుకొనుటకు ఈ సమావేశం జరిగింది.

నవంబర్ 29 అఖిలభారత సమ్మె సందర్భంగా జరిగిన కృషి, శ్రామిక భవన్ నిర్మాణం, మార్చి 4 అధికధరల కాంపెయిన్ లు ఈ ప్రాంతంలో సి.ఐ.టి.యు జరిపిన కార్యకలాపాల్లో ముఖ్యమైనవి. శాంతి వైర్స కార్మికులు సి.ఐ.టి.యు. నాయకత్వంలో జరిపిన 60 రోజుల సమ్మె. ఐ.ఎన్.టి.యు.సి. నాయకత్వంలో ప్రారంభమైన అరిస్టో మహిళా కార్మికుల పోరాటంలో సి.ఐ.టి.యు. పాత్ర ముఖ్యమైన పోరాటాలు. ఇవి విలువైన గుణపాఠాల్ని డివిజన్ ఉద్యమానికిచ్చినాయి. వివిధ పరిశ్రమల్లో చేసిన వేతన ఒప్పందాలు, ఆ సందర్భంలో అవలంబించిన ఎత్తుగడలు పై సమీక్ష చేయబడింది.

నవంబర్ 29 సమ్మె సందర్భంగా జరిపిన కృషి, జూన్ 16 సమ్మె సందర్భంగా కొనసాగించలేక పోయామని ఆత్మ విమర్శనా పూర్వకంగా సమావేశం సమీక్షించింది.

రాజకీయ విద్య : కేంద్ర, రాష్ట్ర కమిటీల పిలుపులు, నాయకులు వర్ధంతులు, క్యాంపెయిన్ లు వంటి సందర్భాలన్నింటిని రాజకీయ విద్యకు వినియోగించుకోవటం జరిగింది. వివిధ పరిశ్రమల్లో క్రొత్తగా ఎన్నికైన ఆఫీస్ బేరర్స్‌కు రెండు పాఠశాలలు నిర్వహించాము. డివిజన్ స్థాయిలో ఈ పద్దెనిమిది నెలల కాలంలో నూతన ఆర్థిక విధానం, సోషలిస్టు దేశాల పరిణామాలు, కార్మికరంగంలో కర్తవ్యాలు వంటి అంశాలపై పది క్లాసులు జరుగగా ఆయా పరిశ్రమల్లో మొత్తం కార్మికులకు, ఎంపిక చేయబడ్డ కొద్ది మందికి స్టడీ సర్కిల్స రూపంలో మరి కొన్ని క్లాసులు జరిగినవి. అనేక క్యాంపెయిన్ ల ఉద్యమాల సందర్భంలోనూ, పత్రికల నిర్వహణలోను ఈ రాజకీయ విద్య ఫలితాలు కన్పడుతున్నాయి.

నిర్మాణం : డివిజన్ కమిటి ఐక్యంగా పనిచేస్తున్నా ఇంకా సమష్టి నాయకత్వం ఏర్పడవల్సి వున్నది. వివిధ యూనియన్లలో వున్న నిర్మాణ సమస్యలను దృష్టిలో పెట్టుకుని ప్రతి మూడు నెలలకు అన్ని అనుబంధ సంఘాల కమిటీ సమావేశాలకు డివిజన్ నాయకత్వం హాజరవ్వాలని, సి.ఐ.టి.యు. ను విస్తృతపరుచుటకు కనీస వేతనం రు. 1250/- ఉండాలని, యు.డి.ఎ. చెల్లించాలని, పెద్ద ప్రైవేటు పరిశ్రమలకు విస్తరించాలని ఇందుకు అనుగునంగా రాజకీయ విద్యను మరింత అధికం చెయ్యాలని, కార్యకర్తలను తర్ఫీదు చేసుకోవాలని భవిష్యత్ కర్తవ్యాలను రూపొందించింది ప్లీనమ్.

16 మంది చర్చల్లో పాల్గొన్నారు. శ్రీ రవీందర్ రెడ్డి వందన సమర్పణతో సమావేశం ముగిసింది.

## మచిలీపట్నం

గ్యాస్ డీలర్ల వద్ద పనిచేసే కార్మికులు మచిలీపట్నంలో సంఘం నిర్మించుకోగానే యజమానులు కక్షతో శ్రీ శంకర్రావును పనినుండి నిలిపివేశారు.

ఈ కక్షసాధింపు చర్యను నిరసిస్తూ పట్టణంలోని వివిధ కార్మిక సంఘాలు ప్రదర్శన జరిపాయి. నిలిపివేసిన వారిని వెంటనే పనిలోకి తీసుకోవాలని డిమాండు చేశాయి. కానిపక్షంలో ఆందోళనను తీవ్రతరం చేస్తామని హెచ్చరించాయి.

యూనియన్ కార్యదర్శి శ్రీ కృష్ణ, శ్రీ మైలాలి, శ్రీ రాజా, గాంధి, రమణ, సుబ్రహ్మణ్యం, రామకృష్ణ తదితరులు ధర్నాలో పాల్గొన్నారు.

చట్టం ప్రకారం జీతాలు యివ్వాలని, అందరికీ అపాయింట్ మెంట్ లెటర్సు యివ్వాలని కోరారు.

## సి.ఐ.టి.యు. అనుబంధం

9-9-92న జరిగిన దక్కన్ సిమెంట్స వర్కర్స యూనియన్ ఎ 818 ఇండిపెండెంట్ సర్వసభ్య సమావేశములో సి.ఐ.టి.యు. కి అనుబంధము చేయుటకు ఏకగ్రీవముగా తీర్మానించటము అయినది, సి.ఐ.టి.యు. అనుబంధము కొరకు దరఖాస్తులను కూడ పంపటము జరిగినది, సి.ఐ.టి.యు. కు అనుబంధము చేయుటకు ఏకగ్రీవముగా తీర్మానించినందులకు సి.ఐ.టి.యు. జిల్లా ప్రదానకార్యదర్శి శ్రీ జూలకంటి రంగారెడ్డి యూనియన్ సభ్యులకు అభినందనలు తెలియచేసినారు.



# ఇతర రాష్ట్రాల్లో

## పెట్రోలు ధర పెంపుకు నిరసన

### తమిళనాడు

కేంద్ర ప్రభుత్వం పెట్రోలు ధరలు పెంచినందుకు నిరసనగా మద్రాసు నగరంలో సి.ఐ.టి.యు., డి.వై.ఎఫ్.ఐ. సంఘాల ఆధ్వర్యాన ఆటో రిక్షా కార్మికులు సెప్టెంబరు 18న ప్రదర్శన జరిపారు. ఆ రాష్ట్రంలో అనేక కేంద్రాలలో కూడ నిరసన ప్రదర్శనలు జరిగినవి. సి.ఐ.టి.యు. ఫ్యాక్టరీల వద్ద గేటు మీటింగులు నిర్వహించినది.

పశ్చిమ బెంగాల్‌లో బందు జరిగిన నాడు సెప్టెంబరు 23న కూడ నిరసన ప్రదర్శనలు జరిపింది సి.ఐ.టి.యు.

ఆటో రిక్షా డ్రైవర్లు ఆటోలను రోడ్లపై లాగారు. కేంద్ర ప్రభుత్వ విధానాలవల్ల తిరిగి ఎడ్లబండ్ల కాలం వస్తుందని విమర్శించారు.

సెప్టెంబరు 30న టాక్సీలు, ఆటోలు నడపలేదు. 13000 వేలు ఆటోలు, 1000 టాక్సీలు ఆ రోజు సాయంత్రందాకా రోడ్లపై కనరాలేదు. నిరసనగా సమ్మె జరిగింది. ఆయిల్ కార్పొరేషన్ కార్యాలయానికి ప్రదర్శనగా వెళ్లి పెట్రోలు ధరలు తగ్గించాలంటూ వినతిపత్రాలు అందజేశారు. మద్రాసు నగర సి.ఐ.టి.యు. కార్యదర్శి శ్రీ కృష్ణన్ ప్రదర్శకుల సభలో ప్రసంగించారు.

బోనస్ సమస్యపై అన్ని కార్మిక సంఘాల పిలుపు మేరకు తిరుప్పూర్ లోని జౌళి సంస్థలలో పనిచేస్తున్న 50 వేలమందికి పైగా కార్మికులు అక్టోబరు 12న సమ్మె చేశారు. సి.ఐ.టి.యు., ఎ.ఐ.టి.యు.సి, హెచ్.ఎమ్.ఎస్, టి.ఎన్.టి.యు.సి, ఐ.ఎన్.టి.యు.సి, ఎల్.పి.ఎఫ్. ల అనుబంధ సంఘాలతో జాయింట్ యాక్షన్ కమిటి పిలుపుపైన ఈ సమ్మె జరిగినది. కనీసం 20 శాతం బోనస్ చెల్లించాలనేది డిమాండు.

ఎరువుల పై సబ్సిడీని రద్దు చేయటాన్ని, పెట్రోలు ధరలు పెంచటాన్ని నిరసిస్తూ రైతు సంఘం పిలుపు పై వేలాది రైతులు, మహిళలు సెప్టెంబరు 29న ప్రదర్శనలు జరిపారు; అరెస్టయారు. జైల్ భరో కార్యక్రమానికి రాష్ట్ర రైతు సంఘం పిలుపు యిచ్చింది.

మధ్యప్రదేశ్‌లో సి.ఐ.టి.యు. నాయకుడు శ్రీ నియోగి హత్య కావించబడిన తర్వాత మొదటి వర్ధంతి సెప్టెంబరు 28న తమిళనాడంతటా సభలు జరిగినవి. మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రికి టెలిగ్రాములు పంపబడినవి.

### కర్నాటక

ఎరువులపై సబ్సిడీల తొలగింపు, పెట్రోలు ధరల పెంపుదలను నిరసిస్తూ బెంగుళూరులో రైతుల ప్రదర్శన జరిగింది. బి.జె.పి. మినహా ప్రతిపక్షాల నాయకులు, రైతు సంఘ నాయకులు బ్రహ్మాండమైన రైతుల ర్యాలీలో పాల్గొని ప్రసంగించారు. కేంద్ర ప్రభుత్వ విధానాలను తీవ్రంగా దుయ్యబట్టారు. శ్రీ హరికిషన్ సింగ్ సుర్జిత్ సి.పి.ఎమ్ ప్రధానకార్యదర్శి, శ్రీ వాసుదేవన్ నాయర్ సి.పి.ఐ, శ్రీ రామకృష్ణ హెగ్డే జనతాదళ్, శ్రీ దేవిలాల్, శ్రీ దేవగౌడ, శ్రీ చంద్రశేఖర్, ఎస్.జె.పి. లు ప్రసంగించారు. తీర్మానాన్ని శ్రీ ఎం.ఎస్. కృష్ణన్ సి.పి.ఐ. ప్రవేశపెట్టగా, శ్రీ సూర్యనారాయణరావు సి.పి.ఎం. బలపరుస్తూ ప్రసంగించారు.

### జమ్మూ

జమ్మూ నగర జనాభా 5 లక్షలకు పైగా ఉన్నందున బి - 2 గ్రేడ్ నగరంగా ప్రకటించాలని డిమాండ్ చేస్తూ కేంద్ర ప్రభుత్వోద్యోగులు అక్టోబరు 7వ తేదీన పగలు 12 గంటలనుండి ఒక గంట పాటు పనులను నిలిపివేసి తమ కార్యాలయాల ఎదుట ప్రదర్శనలు జరిపారు. ప్రభుత్వం తమ డిమాండ్‌ను అంగీకరించకపోతే ఆందోళనను ఉధృతం చేస్తామన్నారు.

### పంజాబ్

సి.ఐ.టి.యు, ఎ.ఐ.టి.యు.సి, బి.ఎం.ఎస్ లు సంయుక్తంగా యిచ్చిన పిలుపు మేరకు అక్టోబరు 9వ తేదీన పంజాబ్ రాష్ట్రమంతటా పారిశ్రామిక కార్మికుల సమ్మె చేశారు.

పలు జిల్లా కేంద్రాలలో ప్రదర్శనలు జరిపి జిల్లా అధికారులకు మహజర్లు అందజేశారు. రు. 1002=00 లు గా వున్న నెల జీతాన్ని రు. 1650=00 కు పెంచాలని వినతిపత్రంలో కోరారు. అమృతసర్, లూథియానా, భటిండా, అబోహర్, మాన్సా, తదితర పట్టణాల్లో ర్యాలీలు నిర్వహించబడినవి.

మున్సిపాలిటీలకు జరిగిన ఎన్నికలలో 70 శాతం ఓటర్లు పాల్గొన్నారు. ప్రభుత్వ అధికార యంత్రాంగాన్ని ఉపయోగించి, రిగ్గింగుచేసి, దొంగ ఓట్లు వేయించి, ఎన్ని అక్రమాలు చేసినా మొత్తం 1341 స్థానాల్లో కాంగ్రెసుకు వచ్చినవి 432 స్థానాలే. అవకాశవాదులతోటి, మత తత్వవాదులతోటి ఓటర్లు విసిగి వున్నారని, లౌకిక, ప్రజాస్వామ్య శక్తుల ప్రత్యామ్నాయం కోసం ఎదురు చూస్తున్నారని ఈ ఎన్నికల ఫలితాలు రుజువు చేస్తున్నాయి.

### ఉత్తర ప్రదేశ్

పారిశ్రామిక పట్టణం కాన్పూర్ జౌళి పరిశ్రమలకు కేంద్రం, జాతీయ జౌళి కార్పొరేషన్ ఆధ్వర్యంలోని (ఎన్.టి.సి) అథెర్టన్ మిల్లులో 3000 మంది పనిచేస్తున్నారు.

నూతన ఆర్థిక పారిశ్రామిక విధానాల ఫలితంగా నిర్వహణ పెట్టుబడిక్రింద గత మార్చి నుండి ఎన్.టి.సి. ఒక్క పైస కూడ సమకూర్చలేదు. ఫలితంగా ఉత్పత్తి నిలిచిపోయింది. నష్టాలను పూడ్చుకుంటానికి ఎన్.టి.సి. కి దొరికింది ఒకటే మార్గం. కార్మికుల తగ్గింపు, వాలంటరీ రిటైర్‌మెంటు క్రింద

**కేంద్ర ప్రభుత్వ ప్రజా వ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా నవంబరు 25న ఛలో ఢిల్లీ !**

దిగిపొమ్మని వత్తిడి చేస్తున్నారు. సంవత్సర సర్వీసుకు 52 రోజుల జీతం చొప్పున లెక్కకట్టి యిస్తామని ఆశ పెట్టింది. మొదట్లో కొంతమంది కార్మికులు ఊగిసలాడారు. కాని బాగా ఆలోచించుకున్న మీదట ఎవరూ ముందుకు రాలేదు. పర్మినెంటు కార్మికులకే ఈ స్కీము వర్తిస్తుంది. అయితే చాలామంది కార్మికులు కొన్ని సంవత్సరాలు పనిచేసిన తర్వాతనే పర్మినెంటు చేయబడ్డారు. పర్మినెంటు కాకముందు చేసిన సర్వీసు లెక్కలోకి రాదు.

ఒకేసారి 25 వేలో, 30 వేలో తీసుకుని కిల్లీకొట్టు పెట్టుకునో, రిక్షా నడుపుకునో బ్రతకవచ్చని కొందరు వాదనలు చేశారు. అయితే కాన్పూరులో ఎన్ని కిల్లీకొట్లు పెట్టగలం, ఎన్ని ఆటోలు నడపగలం అనే ఆలోచనలు వచ్చి వాలంటరీగా దిగము అనే నిర్ణయానికి వచ్చారు.

మిల్లు నడపటానికి నిధులు లేవు అనే పేరుతో జీతాల చెల్లింపు ఆపింది మేనేజిమెంటు. ఇలాగన్నా లొంగివచ్చి మిల్లులో వుంటే భవిష్యత్ లేదనుకుని వెళ్లిపోతారనుకున్నది. అయినా ఈ పన్నాగం కూడ పారలేదు. జౌళి కార్మిక నాయకురాలు, మాజీ ఎం.పి. శ్రీమతి సుభాషిణీ ఆలీ చెప్పిన మాటలు కార్మికులను బాగా ఆకట్టుకుంటున్నాయి. ప్రభుత్వ నూతన విధానాల ఫలితంగా కార్మికులకు ఈ దుస్థితి ప్రాప్తించిందని ఆమె వివరణను అర్థంచేసుకున్నారు. పోరాడటమే మా ధ్యేయమని, సి.ఐ.టి.యు తానూ కార్మికులకండగా నిలబడతామని ఆమె ధైర్యం చెపుతోంది. రాష్ట్రంలో అధికారంలో నున్న బి.జె.పి. కార్మికుల అసలు సమస్యలను ప్రక్కకు పెట్టి మభ్యపెడుతున్నదో చమత్కారంగా వివరించింది.

జంతర్ పెట్టెవాడు బొమ్మలు చూపినట్లుగా "రామ మందిరం చూడరబాబా" "అద్వానీ యిటుకలు మోసె చూడరా" అంటూ మాయజేస్తున్నదని, గోధుమపిండి కిలో ఆరు రూపాయల సంగతిగాని, నిత్యం పెరిగే ధరల విషయంగాని చెప్పటం లేదని వివరించి పోరాడవలసిన అవుసరాన్ని గుర్తింపచేస్తున్నది సుభాషిణి ఆలీ. బి.జె.పి. మాయలో పడవద్దని హెచ్చరిస్తున్నది.

## నిరవధిక సమ్మె హెచ్చరిక

స్టేట్ రోడ్ ట్రాన్స్‌పోర్టును ప్రయివేటీకరించాలని మహారాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. ప్రతిపక్ష పార్టీలు కూడ తీవ్రంగా స్పందించాయి.

ఎంప్లాయీస్ యూనియన్ ప్రభుత్వ వైఖరికి నిరసనగా ఒక రోజు సమ్మె చేయాలని నిర్ణయించింది. మొండిగా తన విధానాన్ని ప్రభుత్వం కొనసాగించితే నిరవధిక సమ్మెకు పోతామని కూడ యూనియన్ ప్రకటించింది. దీనితో దిక్కుతోచని స్థితిలో రాష్ట్ర ప్రభుత్వం పడినది. - (ఎకనామిక్ టైమ్స్ 12-10-92)

## సామ్రాజ్య వ్యతిరేక దినం - సెప్టెంబరు 1

కేంద్ర సెక్రటేరియట్ పిలుపునుసరించి సెప్టెంబరు 1న సామ్రాజ్య వ్యతిరేక దినంగా సి.ఐ.టి.యు బొంబాయి నగరంలో పెద్ద ప్రదర్శన నిర్వహించినది. జోరున వర్షాలు కురుస్తున్నా, క్రితంరోజే గణేష్ ఉత్సవాలు ప్రారంభించినా కార్మికులు సామ్రాజ్య వ్యతిరేక ప్రదర్శనలో పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు. ప్రపంచమంతటా, ప్రత్యేకించి భారతదేశంలోనూ సామ్రాజ్యవాదులు జరుపుతున్న కుట్రలను ఖండిస్తూ ప్రదర్శకులు నినాదాలిచ్చారు.

అమెరికన్ కాన్స్‌లేట్ ఎదురుగా సభ జరిగినది. సి.ఐ.టి.యు. నాయకులు శ్రీమతి అహల్యారంగ్నేకర్, కె.ఎల్. బజాజ్, పి.ఎం. వార్తిక్, పి.ఆర్. కృష్ణన్, అశోక్ ధావలే (DYFI)లు సభలో ప్రసంగించారు.



కనీస వేతనాలకై విజయవాడలో ప్రదర్శన



కనీస వేతనాలకై మిర్యాలగూడలో ప్రదర్శన

**కేంద్ర ప్రభుత్వ నూతన పారిశ్రామిక విధానాలకు వ్యతిరేకంగా నవంబరు 25న ఛలో ఢిల్లీ !**

# విదేశాలలో

ప్రజల్లోను, కార్మికవర్గంలోను సామ్రాజ్యవ్యతిరేక ప్రచారాన్ని విస్తృతంగా జరపాలనే పిలుపుతో సభ ముగిసింది.

సోషలిజంను కాదని పెట్టుబడి దారీ విధానాన్ని కౌగలించుకున్న రష్యాలో 1991 ఆగస్టు నుండి 1992 జూలై వరకు చూస్తే పరిస్థితి చాలా తీవ్రంగా తయారైంది. పారిశ్రామిక ఉత్పత్తి 30 శాతం తగ్గగా, వ్యవసాయక ఉత్పత్తి 27 శాతం, వాణిజ్యం 40 శాతం, జీతాలు 60 శాతం పడిపోయాయి. ద్రవ్యోల్బణం 1500 శాతం పెరిగింది. ఎలిత్సిన్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలు ప్రదర్శనలు చేస్తున్నారు.

* * * * * * *

1992 సంవత్సరం మొదటి 5 నెలల లోనే రష్యాలో హింసా ప్రకటనల్లో 8300 మంది చనిపోయారు. 1991లో యిదే కాలంలో కన్నా ఈ సంఖ్య 43 శాతం ఎక్కువ. ఆర్థిక పరిస్థితి క్షీణించడమే హింసలకు కారణమని పోలీసు అధికారులు పేర్కొన్నారు.

* * * * * * *

ఐరోపా దేశాల్లో మోటారు వాహనాల పరిశ్రమ రంగంలో నెలకొన్న సంక్షోభానికి అంతం కనిపించడం లేదు. వాహనాల అమ్మకాలు పడిపోతున్నాయి. మూసివేతలు, తొలగింపులు అదే పనిగా సాగుతున్నాయి. వేలాది కార్మికులు వీధిలో పడుతున్నారు.

## ముక్కుపిండి

ప్రపంచబ్యాంకు ఒక సంవత్సరకాలంలో (1991 జూలై నుండి 1992 జూన్ వరకు) రు. 165 కోట్ల లాభం గడించింది. గత ఏడాది కన్నా 37 శాతం ఎక్కువ. ఈ లాభాల్లో ఎక్కువ భాగం మూడవ ప్రపంచ దేశాలకిచ్చిన అప్పులమీద ముక్కుపిండి గుంజినవే.

## అమెరికా సామ్రాజ్య కాంక్ష

ప్రపంచంలో నేడు సామ్రాజ్య వాద దేశాలు లేవనీ ప్రజాస్వామ్య దేశాలూ, నియంతృత్వదేశాలు మాత్రమే ఉన్నాయని ప్రజాస్వామ్య దేశమంటే అమెరికాయే చక్కని నమూనా యని వాదించేవారు వున్నారు.

సోషలిజం కూలిపోయిన దేశాల్లో అచట కూలినది నియంతృత్వమేనని సోషలిజం అంటేనే నియంతృత్వమని సిద్ధాంతీకరించిన వారూ వున్నారు.

చైనాకు చెందిన హాంగ్‌కాంగ్ ఇప్పటి వరకూ బ్రిటిష్ వలసగా వుంది. 1997 జూలై 1న అది తన మాతృదేశం చైనా యొక్క సార్వభౌమత్వం క్రిందికి వస్తుంది. ఈ క్రమాన్ని పూర్తి చేయటానికి చైనా, బ్రిటన్ ప్రభుత్వాల మధ్య చర్చలు జరుగుతున్నది. అనేక చర్యలు తీసుకోబడుతున్నవి.

ఇదిలా వుండగా ఇపుడు అమెరికా పార్లమెంటు ఒక చట్టాన్ని ఆమోదించింది. అధ్యక్షుడు జార్జి బుష్ దానిపై సంతకం కూడ చేశాడు.

ఈ చట్టం ప్రకారం హాంగ్‌కాంగ్ విషయంలో జోక్యం చేసికునేందుకు అమెరికా ప్రభుత్వానికి అధికారం లభించింది. అమెరికా తనకు తానై ఈ అధికారం సంక్రమింపజేసుకుంది.

చైనా సార్వభౌమత్వం క్రిందికి హాంగ్‌కాంగ్ చేరిన తర్వాత అక్కడ ప్రజాస్వామ్యం ఎలా అమలు జరుగుతున్నదీ, అది తగు స్వయంప్రతిపత్తి అనుభవిస్తున్నదా లేదా అనే విషయం అమెరికా విదేశాంగమంత్రి ఎప్పటికపుడు అమెరికా అధ్యక్షునికి నివేదించాలి. హాంగ్‌కాంగ్‌లో ఏం జరుగుతున్నది అనేది నిర్ధారించేది జార్జి బుష్షే. హాంగ్‌కాంగ్ పై తన పెత్తనాన్ని బ్రిటన్ వదులుకుంటే ఆ పెత్తనం అమెరికాకు ఎలా దక్కుతుంది? అమెరికాకు ఎవరు దాఖలు పరిచారు? ఎవరూ దాఖలు పరచలేదు.

ఇంతకాలంగా తన దౌష్ట్యాన్ని ఎదిరిస్తూ సవాలు చేస్తూ వచ్చిన సోషలిస్టు శక్తి యిపుడు బలహీన పడటంతో యిక తనకు అడ్డు చెప్పేవారు లేరని తన ఇష్టం వచ్చినట్లు చేద్దామని అమెరికా ఉవ్విళ్లూరుతున్నది. ఇరాక్ లాంటి ప్రకటనల్లో తన అభీష్టాన్ని నెరవేర్చుకున్నది.

అదే అహంకారంతో యిపుడు హాంగ్‌కాంగ్ చైనాకు చెందటాన్ని సహించలేక పోతున్నది. హాంగ్‌కాంగ్ మీద తాను పెత్తనం చేయాలని చూస్తున్నది. ఇది తన సామ్రాజ్య కాంక్షను నగ్నంగా చాటటం తప్ప మరేమీ కాదు.

ఇటీవల రియోలో జరిగిన ప్రపంచ పర్యావరణ రక్షణ మహాసభలో దేశదేశాల అడవుల మీద ప్రపంచ రాజ్యాల అన్నింటి అదుపు వుండాలని ప్రతిపాదించిన అమెరికాకు గట్టి ప్రతిఘటన ఎదురు కావటంతో అది భంగపడింది. అమెరికా దుష్టయోచన ఆ విధంగా ఓడింపబడింది. ఏ ముసుగులో వచ్చినా పసిగట్టి ఓడించగల సత్తా యిపుడు ప్రపంచ రాజ్యాలకు ఉంది.

అమెరికా పార్లమెంటు చేసే చట్టాలు ఆ దేశప్రజలమీదనే కాని యితర దేశాల ప్రజలమీద అమలు చేస్తానంటే ఈ సామ్రాజ్య తత్వాన్ని ఏ దేశప్రజలూ సహించరు.

అందుకే అమెరికా రాయబారిని పిలిపించి చైనా ప్రభుత్వం మందలించింది. అమెరికా చర్య తమ దేశ ఆంతరంగిక విషయాల్లో జోక్యం చేసికోవటమే అవుతుందని, అంతర్జాతీయ చట్టాలను ఉల్లంఘించటమే అవుతుందని స్పష్టం చేసింది.

## అమెరికా

అమెరికాలో, ఆకలి బాధితుల సంఖ్య నానాటికి పెరుగుతున్నది. దేశ జనాభా 25 కోట్ల మందిలో 3 కోట్ల 50 లక్షల మందిలి ఆకలి బాధకు గురి అవుతున్నట్లు అమెరికా పార్లమెంటు సెలక్ట్ కమిటి అధ్యక్షుడు రూపొందించిన నివేదికలో తెలిపారు. అమెరికాలో సామాన్య ప్రజల ఆదాయాలు తగ్గటంవల్ల,

నిరుద్యోగం, దారిద్ర్యం బాగా పెరుగుతున్నది. ఒకప్పుడు నగరాలకే పరిమితమైన ఆకలి బాధ ఇప్పుడు గ్రామీణ ప్రాంతాలకు వ్యాపించుచున్నది. పోషక ఆహార లోపంవల్ల అనేక రకాల రోగాలకు గురి అవుతున్నట్లు కమిటి అధ్యక్షుడు తెలిపారు.

1985 సం॥లో దేశంలో 2 కోట్ల మంది అన్నార్తులుండేవారని ఇప్పుడు వారి సంఖ్య - 3.5 కోట్లకు పెరిగిందని తెలిపారు.

## కువైట్

తమకు పార్లమెంటుకు పోటీచేసే హక్కు, కావాలని కువైట్ నారీమణులు డిమాండ్ చేశారు. కువైట్‌లో జరుగుతున్న ఎన్నికల సందర్భంగా వారు ఈ డిమాండ్ చేశారు. మహిళలకు ఎన్నికలలో పోటీ హక్కు లేకుండా చేయడాన్ని పార్లమెంటు సభ్యులకు సమర్పించిన వినతి పత్రంలో వారు ఖండించారు.

పురుషులతో సమానంగా విద్యను అభ్యసించే హక్కు ఇచ్చారు. బాగానే ఉంది. మరి మాకు రాజకీయ హక్కులు ఏమిటి అని వారు అడుగుతున్నారు. రాజకీయ హక్కులు కావాలని పోరాడుతున్నారు.

## బ్రిటన్

బ్రిటన్‌లో జాన్ మేజర్‌గారి ప్రభుత్వం 31 కోల్‌పిట్సు మూసివేతకు నిర్ణయించింది. ఈ గనుల మూతవల్ల దాదాపు 30 వేలకు పైగా కార్మికుల బ్రతుకులు బజారున పడుతున్నాయి. ఈ గనులున్న ప్రాంతాలయిన ఊర్సు, ఉత్తర ప్రాంతాలలో నిరుద్యోగిత ఇప్పటికే ఎక్కువగా ఉన్నది. లండన్ నగరంలో అనేకవేలమంది కార్మికుల కుటుంబాలు "హైడ్‌పార్క్‌కు" నిర్వహించిన ప్రదర్శనలో పాల్గొన్నారు. ఈ ప్రదర్శనలో గని కార్మికులు "మేజర్‌ను తొలగించండి" గని కార్మికులను కాదు అని నినదించారు. అయిన ప్రభుత్వం కార్మికుల, ప్రతిపక్ష పార్టీల అభిప్రాయాలను లెక్క పెట్టకుండ గనుల మూసివేతకు సంబంధించిన సభల్లోను లార్డ్స్ సభలో ఆమోదింపచేసి, కామన్ సభలో ప్రవేశపెట్టారు. బిల్లుకు అనుకూలంగా 320 - బిల్లుకు వ్యతిరేకంగా 307 ఓట్లు వచ్చాయి. కొద్ది మెజారిటీతో అధికార పక్షం నెగ్గింది.

## విద్యుత్ కార్మికులకు హైకోర్టు 'స్టే'

మేనేజిమెంట్‌కు, యునైటెడ్ ఎలక్ట్రిసిటి ఎంప్లాయీస్ యూనియన్‌కు మధ్య వివాదం విషయంలో ప్రభుత్వం ఒక నిర్ణయం తీసుకునేవరకు విద్యుత్ బోర్డ్‌లో పనిచేస్తున్న కాంట్రాక్ట్ కార్మికులను, విలేజి ఎలక్ట్రికల్ వర్కర్లను పనుల నుండి తొలగించరాదని రాష్ట్ర హైకోర్టు అక్టోబరు 27న ఉత్తర్వు జారీ చేసింది.

# సి.ఐ.టి.యు కేంద్రం ప్రకటనలు

సి.ఐ.టి.యు. కేంద్ర సెక్రటేరియట్ సమావేశం అక్టోబరు 12న న్యూఢిల్లీలో జరిగినది. రాష్ట్ర కమిటీల అధ్యక్షులు, ప్రధాన కార్యదర్శులు కూడ ఈ సమావేశంలో పాల్గొన్నారు.

నవంబరు 25 ఛలో ఢిల్లీ కార్యక్రమం జయప్రదం చేయటానికై రాష్ట్రాల్లో జరుగుతున్న సన్నాహాల గురించి రిపోర్టులు యివ్వబడినవి. స్పాన్సరింగ్ కమిటీలోని భాగస్వామ్య సంస్థలన్నీ చురుకుగా కదులుతున్నవని అత్యధిక సంఖ్యలో కార్మికులను సమీకరించే ప్రయత్నాలు జరగటం పట్ల సంతృప్తిని వ్యక్తం చేసింది.

అంతేకాదు కార్మిక సంస్థ లేకా రైతు, వ్యవసాయ, కార్మిక, విద్యార్థి, యువజన, మహిళా సంఘాలు కూడ స్పాన్సరింగ్ కమిటి పిలుపుకు స్పందించి ఢిల్లీ ర్యాలీలో పాల్గొననున్నారని సెక్రటేరియట్ గమనంలోకి తీసుకున్నది.

అక్టోబరు ఆఖరువారంలో ప్రారంభించి నవంబరు 3వ వారంలోగా రాష్ట్రాల్లో జాతాలు జరుగుతవని వాటిల్లో రాష్ట్ర కమిటీలు, అన్ని అనుబంధ సంఘాలూ, పారిశ్రామిక ఫెడరేషన్లూ పాల్గొనాలని సోదర సంఘాల సభ్యులు కూడ పాల్గొనేలా చూడాలని కోరింది. ప్రాంతీయ భాషల్లో పోస్టర్లు, కరపత్రాలూ విరివిగా ప్రచారంలో పెట్టాలని చెప్పినది.

డిశంబరు చివరిలో బొంబాయిలో నూతన విధానలకు వ్యతిరేకంగా సి.పి.ఎస్.టి.యు. ఒక సదస్సు నిర్వహించాలని నిర్ణయం చేసినందుకు హర్షం ప్రకటించింది. ఢిల్లీ ర్యాలీలో ప్రభుత్వరంగ ఉద్యోగులందరూ పాల్గొన్లాని విజ్ఞప్తి చేసింది.

ఢిల్లీ ర్యాలీకి సన్నాహంగా అన్ని రాష్ట్రాల్లోను సదస్సులు జరుగుతున్నాయని వాటిల్లో కేంద్ర నాయకులు పాల్గొంటారని తెలియజేసింది.

ఢిల్లీ ర్యాలీ అనంతరం నవంబరు 28, 29 తేదీలలో వర్కింగ్ కమిటి సమావేశం, డిశంబరు 16, 17, 18 తేదీలలో బెంగుళూరులో జనరల్ కౌన్సిల్ ప్రత్యేక సమావేశం జరపాలని సెక్రటేరియట్ నిర్ణయించింది. సి.ఐ.టి.యు నిర్మాణ స్థితి గురించి ప్రత్యేకంగా ఆ సమావేశాలలో చర్చ జరుగుతుంది.

డిశంబరు 19న బి.టి. రణదివే జన్మదినోత్సవం దేశవ్యాపితంగా జరపాలని, పిలుపు యిచ్చింది.

ఇరాక్ దేశ ట్రేడ్ యూనియన్ల ఫెడరేషన్ మహాసభ డిశంబరులో జరుగుతుంది. నలుగురు సభ్యులుగల ప్రతినిధివర్గాన్ని పంపవలసిందిగా సి.ఐ.టి.యు. కు ఆహ్వానం అందినది. ఆహ్వానాన్ని సెక్రటేరియట్ ఆమోదించినది.

# యూనియన్ల వార్తలు

## పికెటింగ్

శ్రీ వెంకటేశ్వరా యూనివర్సిటీలోని ఎన్.ఎమ్.ఆర్. కార్మికులను పర్మినెంటు చేయాలని కోరుతూ ఎన్.ఎమ్.ఆర్. స్టాఫ్ అండ్ వర్కర్స్ ఫెడరేషన్ సభ్యులు యూనివర్సిటీ పాలనాధి కార్యాలయం ఎదుట పికెటింగ్ జరిపారు. ఆందోళనను విఫలం చేయాలని యాజమాన్యం పోలీసులను రంగంలోకి దించింది. అయినా పికెటింగ్ కొనసాగింది.

రిజిస్ట్రారు పికెటర్లను కలిసి మాట్లాడారు. పర్మినెంటు చేయటం కోసం తమ తోడ్పాటు వుంటుందని కోర్టులో యీ సమస్య పరిష్కారం అయ్యేవరకు సహనం పాటించాలని విజ్ఞప్తి చేశారు. అందుమీదట పికెటింగును ధర్నాగా మార్చటం జరిగింది.

ఆదే రోజు బోర్డు మీటింగులో పాల్గొన్న అధికారులతో యూనియన్ నాయకులు చర్చలు జరిపారు. అక్టోబరు 14వ తేదీన కోర్టులో పరిష్కారమయ్యే వరకు నిరాహార దీక్షలు సాగిస్తామని ప్రకటించారు.

శ్రీ యుతులు ఇ. రామచంద్రారెడ్డి, సుబ్రహ్మణ్యం, చల్లా వెంకటయ్యలు ఈ కార్యక్రమానికి నాయకత్వం వహించారు. డి.వై.ఎఫ్.ఐ. ఈ పోరాటానికి సంఘీభావం ప్రకటించింది.

## సర్కార్ ఫైబర్స్

హనుమాన్ జంక్షన్ సమీపంలో కోగూరు పాడులో సర్కార్ ఫైబర్స్ స్టాఫ్ అండ్ వర్కర్స్ యూనియన్ నాల్గవ మహాసభ శ్రీ పి. రాంబాబు అధ్యక్షతన జరిగినది. సి.ఐ.టి.యు. కృష్ణా జిల్లా కన్వీనర్ శ్రీ బి.ఆర్. తులసీరావు మహాసభలో ప్రసంగించారు. తొలుత సి.ఐ.టి.యు. పతాకాన్ని ఆవిష్కరించారు.

శ్రీ సి.హెచ్. గోపాల కృష్ణ అధ్యక్షులుగా, శ్రీ అర్వేని ప్రసాద్ కార్యదర్శిగా 15 మందితో కమిటి ఏర్పడినది.

## కార్యాలయం ప్రారంభం

స్టీల్ ప్లాంటు ఎంప్లాయీస్ యూనియన్ డివిజన్ కార్యాలయాన్ని జగ్గయ్యపేటలో కృష్ణాజిల్లా సి.ఐ.టి.యు. బాధ్యులు శ్రీ డి.వి. కృష్ణ ప్రారంభించారు. ఈ సందర్భంగా సి.ఐ.టి.యు. కార్యకర్తల సమావేశం జరిగినది. శ్రీ మండేపూడి చంద్రశేఖరరావు కన్వీనరుగా మరో ఆరుగురితో కమిటి ఎన్నికైంది.

శ్రీ కాసరగడ్డ నాగేశ్వరరావు పతాకావిష్కరణగావించారు. స్టీలు ప్లాంటు ఎంప్లాయీస్ యూనియన్ (సి.ఐ.టి.యు) నాయకులు శ్రీ కురూప్, శ్రీ సుబ్బన్న, శ్రీ రమేష్ శ్రీ హరియా, శ్రీ కాంతారావులు సభలో పాల్గొన్నారు.

## ఆర్టీసి – ప్రదర్శన

వరంగల్ రీజియన్‌లో అపరిష్కృత సమస్యలను పరిష్కరించాలని కోరుతూ ఆర్టీసి కార్మికులు హనుమకొండలో ఎస్.డబ్ల్యు.ఎఫ్. నాయకత్వాన ప్రదర్శన జరిపారు. రీజినల్ మేనేజరు కార్యాలయం ఎదుట ధర్నా నిర్వహించారు. రీజియన్‌లోని వివిధ డిపోలనుండి కార్మికులు తమతమ బేనర్లతో వచ్చి ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. అనంతరం జరిగిన సభలో ఫెడరేషన్ రాష్ట్ర కార్యదర్శి శ్రీ ఆర్. లక్ష్మయ్య సంఘ కృషిని వివరిస్తూ ప్రసంగించారు. పతాకావిష్కరణచేసి అధ్యక్షుడు శ్రీ ఎం.ఎస్. రెడ్డి ఫెడరేషన్ విధానాలను వివరించారు.

బస్సుల కండిషన్ మెరుగు పర్చాలని, గ్యారేజి కార్మికులకు సరైన పరికరాలు స్పేరు పార్టులు సప్లయి చేయాలని, రీజియన్ అప్పులను వెంటనే పరిష్కరించాలని, ప్రైవేటీకరణను ఆపాలని, ధరలు తగ్గించాలని ప్రదర్శకులు నినాదాలిచ్చారు.

## మూసివేతలు

రంగారెడ్డి జిల్లా హయత్‌నగర్ మండలం ఇంజాపూర్ వద్దగల స్టేట్ ఆఫ్ ఫ్యాబ్రికేటర్స్ ప్రైవేట్ లిమిటెడ్ (వెంకటేశ్వర హేచరీస్ గ్రూప్స్ అనుబంధ సంస్థ) ఫ్యాక్టరీని యాజమాన్యం చట్ట విరుద్ధంగా మూసివేసి కార్మికుల బ్రతుకులను బజారు పాలు చేసిందని 30 మంది కార్మికులను పనిలోకి రావద్దని నోటీసు వేసిందని యూనియన్ అధ్యక్షుడు శ్రీ పి. మధుసూధన్ విమర్శించారు. ఫ్యాక్టరీని వెంటనే తెరిపించి కార్మికులకు న్యాయం చేకూర్చాలని ఆయన కార్మికశాఖ అధికారులను ఒక ప్రకటనలో [illegible].

## సమగ్ర శాసనం కోసం

భవన నిర్మాణ కార్మికుల కోసం సమగ్ర శాసనం తేవాలని, ఇండ్ల స్థలాలు కేటాయించాలని ఖమ్మంజిల్లా బిల్డింగ్ వర్కర్స్ ఫెడరేషన్ ప్రథమ మహాసభ ప్రభుత్వాన్ని డిమాండ్ చేసింది. వివిధ ప్రాంతాల నుండి 700 మంది ప్రతినిధులు సభలో పాల్గొన్నారు. ఫెడరేషన్ రాష్ట్ర ఉపాధ్యక్షులు శ్రీ పల్లా జాన్ రాములు సభను ప్రారంభించారు.

సి.ఐ.టి.యు. జిల్లా కార్యదర్శి శ్రీ పి. రాజారావు అసంఘటితరంగ కార్మికులు ఐక్యమై పోరాడవలసిన అవుసరాన్ని వివరించారు.

శ్రీ అ. మల్లేశం, శ్రీ ఎం. రామారావు, శ్రీ అ. వెంకటి, శ్రీ జిలాని, శ్రీ వీరాస్వామి, ప్రసాద్, ఎ. లక్ష్మయ్య అధ్యక్షవర్గంగా వ్యవహరించారు. తొలుత సంఘపతాకాన్ని సి.పి.ఎమ్. నాయకులు శ్రీ పిల్లుట్ల వెంకన్న ఎగురవేశారు. వివిధ సంఘాల నాయకులు సౌహార్ద్ర సందేశాలిచ్చారు.

గౌరవాధ్యక్షులుగా శ్రీ పి. జాన్ రాములు, అధ్యక్షులుగా శ్రీ ఎ. మల్లేశం, కార్యదర్శిగా శ్రీ ఆర్. కోటంరాజులు మరికొందరు ఆఫీసు బేరర్లు మొత్తం 50 మందితో కార్యవర్గం ఎన్నుకోబడింది.

## బిల్డింగ్ వర్కర్స్

భవన నిర్మాణ కార్మికుల కోసం సమగ్ర శాసనం రూపొందించాలని కోరుతూ కరీంనగర్ పట్టణంలో భవన నిర్మాణ కార్మికులు తాపీవర్కర్స్ యూనియన్ (సి.ఐ.టి.యు) నాయకత్వాన ప్రదర్శన జరిపి కలెక్టరుకు వినతిపత్రం అందజేశారు.

## సభలు – సమావేశాలు

సి.ఐ.టి.యు విజయనగరం జిల్లా సదస్సు విజయనగరం రైల్వే ఇనిస్టిట్యూట్‌లో జరిగింది. సి.ఐ.టి.యు. ప్రదేశ్ కమిటి సభ్యులు శ్రీ వి.జె.కె. మూర్తి సదస్సును ప్రారంభించారు.

కేంద్ర ప్రభుత్వ నూతన విధానాలను శ్రీ మూర్తి విమర్శిస్తూ ప్రసంగించారు. సి.ఐ.టి.యు విశాఖజిల్లా కార్యదర్శి శ్రీ సి.హెచ్. నరశింగరావు మాట్లాడుతూ సంఘటిత రంగంలోనే కాక కోట్లాది అసంఘటిత రంగ కార్మికులు హక్కులకై కూడ పోరాడాల్సిన అవసరాన్ని వివరించారు.

కార్యదర్శి శ్రీ ఎం. శ్రీనివాస ప్రవేశపెట్టిన నివేదికను సమావేశం ఆమోదించినది. శ్రీ పి. స్వామినాయుడు, శ్రీ ఎం. శ్రీనివాస, శ్రీ రెడ్డి శ్రీ రామమూర్తి, అధ్యక్ష కార్యదర్శి, కోశాధికారిగా నూతన కమిటి ఎన్నుకోబడినది.

## మద్దతు

చిత్తూరు జిల్లా రేణిగుంటలో ఎస్.వి. చక్కెర ఫ్యాక్టరీ కార్మికుల పోరాటానికి రేణిగుంట సి.ఐ.టి.యు. కమిటి మద్దతు ప్రకటించింది. ఖాళీలను వెంటనే భర్తీ చేయాలని కక్షసాధింపుగా సస్పెండు చేయబడిన యూనియన్ కార్యదర్శిని తిరిగి పనిలోకి తీసుకోవాలని సి.ఐ.టి.యు నాయకులు శ్రీ పి.ఎల్. నరశింహులు, శ్రీ జె.వి. చలపతిలు డిమాండ్ చేశారు.

## జూట్ మహాసభ

ఏలూరు పట్టణంలో కృష్ణా జూట్ మిల్లు కార్మికసంఘం (సి.ఐ.టి.యు) 19వ మహాసభ శ్రీ అల్లూరి సత్యనారాయణ అధ్యక్షతన పవర్‌పేటలో జరిగినది.

గుర్తింపు పొందిన యూనియన్ నూతన ఒప్పందంకోసం చర్చలు ప్రారంభించాలని మహాసభ తీర్మానంలో కోరినది. ఒప్పందం కుదుర్చుకోవటంలో తమ యూనియన్ పూర్తిగా సహకరిస్తుందని కార్యదర్శి శ్రీ రామారావు అన్నారు.

240 రోజులు పని చేసిన వారిని పర్మినెంటు చేయాలని, రాయితీలను వారికి కూడ కల్పించాలని, ఇ.ఎస్.ఐ. రెండవ ఆసుపత్రి ఏలూరులో స్థాపించాలని, మూడవ బెనిఫిట్‌గా పెన్షన్ పథకాన్ని అమలు చేయాలని వేరు వేరు తీర్మానాలు మహాసభ చేసింది.

శ్రీ అల్లూరి సత్యనారాయణ అధ్యక్షులుగా, శ్రీ దువ్వి రామారావు ప్రధాన కార్యదర్శిగా నూతన కార్యవర్గం ఎన్నికైనది.

## కనీస వేతన ఒప్పందం

ఆంధ్రాఫెర్రో అల్లాయీస్ కార్మికులు సి.ఐ.టి.యు నాయకత్వాన ఆందోళన జరిపి కనీసవేతనం సాధించుకున్నారు. మహిళా కార్మికులకు మెటర్నిటీ సెలవు యిస్తానని కూడ మేనేజిమెంటు ప్రకటించింది. ప్రభుత్వం ప్రకటించిన కనీస వేతనం జూన్ 1992 నుండి అమలు చేయాలి. ఆ విధంగా పెరిగిన జీతాల బకాయిలను సెప్టెంబరు 8న యాజమాన్యం చెల్లించినది.

కనీస వేతనాలు సాధించుకున్న ఆంధ్రాఫెర్రో అల్లాయీస్ కార్మికులను, అమలు పరిచినందుకు యాజమాన్యాన్ని సి.ఐ.టి.యు. విజయనగరం జిల్లా కమిటి అభినందించినది.

| | | |
|---|---|---|
| అన్‌స్కిల్డు కార్మికునికి | రు. | 30=00 లు |
| సెమిస్కిల్డు కార్మికునికి | రు. | 40=00 లు |
| స్కిల్డు కార్మికునికి | రు. | 50=00 లు |

అమలు చేయబడినవి.

## ఎఫ్. సి.ఐ. కమిటి తీర్మానాలు

ఎఫ్.సి.ఐ. ఎంప్లాయీస్ యూనియన్ రాష్ట్ర కమిటి సమావేశం సెప్టెంబరు 28వ తేదీన హైదరాబాదు సి.ఐ.టి.యు ఆఫీసులో జరిగినది. శ్రీ మహ్మద్ షఫీ ఉల్లాఖాన్ అధ్యక్షత వహించారు.

కమిటి అనేక విషయాలు చర్చించి ఈ క్రింది తీర్మానాలు ఆమోదించినది.

1. 1987 నుండి పెండింగులోనున్న పే రివిజన్ సమస్యను యాజమాన్యం ఎలాంటి షరతులు లేకుండా పరిష్కరించాలి. ఉత్పత్తిలో ముడిపడిన బోనసు వెంటనే చెల్లించవలెను.
2. 8వ ప్రణాళికలో నిర్మించ తలపెట్టిన గోదాములన్నీ ఎలాంటి తటపటాయింపులు లేకుండా నిర్మాణం కొనసాగించాలి. నెల్లూరు, గుంటూరు, నిజమాబాద్, కడప, కర్నూలుల్లో ఎఫ్.సి.ఐ. కి ఒక్క గోదాము కూడా లేనందున నిర్మాణం తక్షణం చేపట్టాలి.
3. హనుమాన్ జంక్షన్, మంచెరియాల్, చిత్తూరుల్లో గల ఎఫ్.సి.ఐ. గోదాములను సి.డబ్ల్యు.సి. కి అప్పగించనున్నట్లు తెలుస్తున్నది. దీనిని కమిటి వ్యతిరేకిస్తున్నది. ఎఫ్.సి.ఐ. యే ఆ గోదాములను నిర్వహించాల్సిందిగా యాజమాన్యాన్ని కమిటి కోరుతున్నది. ప్రపంచ బ్యాంకు రుణంతో నిర్మించి రాయనపాడు, పదకాకానిలో ప్రస్తుతం సి.డబ్ల్యు.ఎఫ్ నిర్వహణలోనున్న వాటిని ఎఫ్.డబ్ల్యు.ఐ. కి బదిలీ చేయవలెను.

**కేంద్ర ప్రభుత్వ నూతన పారిశ్రామిక విధానాలకు వ్యతిరేకంగా నవంబరు 25న ఛలో ఢిల్లీ !**

4. ఎవరైనా కోరుకుంటేనే అండమానుకు పోస్టింగ్ యివ్వాలి. అలా కోరుకున్నవారు ఎవరూ లేనట్లయితే సీనియారిటీ ప్రకారం మాత్రమే పోస్టింగు యివ్వాలి; ఇపుడున్న సౌకర్యాలతోపాటుగా ప్రమోషన్ యిచ్చి పంపాలి.

5. ధాన్య సేకరణ ఎఫ్.సి.ఐ. దే కాబట్టి సి.డబ్ల్యు.ఎఫ్. కి అప్పగించకుండా యధాతధ స్థితి కొనసాగించాలి.

ఇంతకుముందే సమర్పించిన 20 కోర్కెల పత్రాన్ని ఎలాంటి జాగు లేకుండా యాజమాన్యం తక్షణం పరిశీలించి పరిష్కరించాలి.

## వైద్య సదుపాయాల కోసం

అక్టోబరు 11న మణుగూరు బొగ్గుగనిలో ప్రమాదానికి గురైన తర్వాత కనీస వైద్య సదుపాయాలు లేనందుననే నాగరాజా అనే ఓవర్‌మన్ చనిపోయాడని కార్మికసంఘాలన్ని విమర్శించాయి. ఇంతకుముందు కూడ రామదాస్ అనే కోల్‌పిల్లర్ ఈ వైద్య సదుపాయం లేకనే మరణించిన సంగతి ప్రస్తావించారు. దీనికి నిరసనగా అక్టోబరు 12న మణుగూరు వివిధ గనుల, డిపార్టుమెంట్ల కార్మికులు సమ్మెచేసి ప్రదర్శనలు జరిపారు.

శాశ్వత అంబులెన్సు అన్ని గనులవద్ద ఏర్పాటు చేయాలని, వాటిని కండిషన్‌లో వుంచాలని, డాక్టర్లను, తగు సిబ్బందిని ఏరియా ఆసుపత్రిలో వుంచాలనీ, ప్రమాదానికి కారణాలు ఏమిటో పూర్తిస్థాయి దర్యాప్తు జరపాలని ప్రదర్శకులు కోరారు. కార్మిక సంఘాల నాయకులు శ్రీయుతులు ఎ.ఎం. చారి, జంగేటి మల్లయ్య, పిచ్చేశ్వరరావు, శ్రీనివాసమూర్తి యాజమాన్యంలో చర్చలు జరిపారు.

## ప్రదర్శన

విశాఖపట్నంలోని ఉక్కు ఫ్యాక్టరీలో యాజమాన్యం కార్మికులకు ఎల్.టి.ఇ. చెల్లించటంలో వివక్షత చూపుతున్నదని స్టీలు అథారిటీ ఆఫ్ ఇండియాలో చెల్లిస్తున్నట్లుగా విశాఖలో కూడ చెల్లించాలని కోరుతూ ఉక్కు ఫ్యాక్టరీ మెయిన్‌గేటు ఎదుట సి.ఐ.టి.యు ఆధ్వర్యాన ప్రదర్శన జరిగింది. బాల చెరువు గేటు వద్ద జరిగిన సభలో ప్రధాన కార్యదర్శి ఎన్. రామారావు, ప్రసంగించారు. టెలిగ్రాముల ద్వారా మేనేజిమెంటుకు నిరసన తెలిపినట్లు శ్రీ రామారావు తెలియజేశారు.

శ్రీయుతులు అయోధ్య, శంకరరావు, ధనరాజు, కృష్ణారావు, సింహాచలం, రవీంద్రనాధ్, తిరుపతిరావు తదితరులు ప్రదర్శనకు నాయకత్వం వహించారు.

## సంఘీభావం

కృష్ణాజిల్లా కొండపల్లి వద్ద సి.పి.సి. కంపెనీ కార్మికులు సమ్మె చేస్తున్నారు. వారికి సంఘీభావం తెలుపుతూ సి.ఐ.టి.యు, ఎ.ఐ.టి.యు.సి. ల సంయుక్త ఆధ్వర్యాన కొండపల్లిలో పెద్ద ప్రదర్శన నిర్వహించబడినది.

శ్రీయుతులు బి.ఆర్. తులసీరావు, వెలగా లక్ష్మణరావు, వెల్లంకి సుబ్బారావు, ఉప్పలపాటి రామచంద్రరాజు ప్రదర్శకులనుద్దేశించి ప్రసంగించారు.

అంబులెన్సు, మంచినీటి సౌకర్యం కూడ కల్పించలేదని, జి.వో. ప్రకారం డి.ఎ. తదితర ఎలవెన్సులను క్యాజువల్, మహిళా కార్మికులకు, వాచ్‌మెన్‌లకు యివ్వటంలేదని, అక్రమంగా సస్పెన్షన్లు జరుపుతున్నారని, జీతాలు పెంచమని లేబర్ ఆఫీసర్ చెప్పినా యాజమాన్యం ఖాతరు చేయటంలేదని వక్తలు విమర్శించారు.

వి.టి.పి.ఎస్. ఎస్మెల్, వ్యాగన్ వర్క్‌షాప్, పైపుల కంపెనీ కార్మికులు, మహిళా, వ్యవసాయ కార్మిక సంఘాలు కూడ సమ్మెదారులకు మద్దతు తెలిపారు.

## రిక్షా కార్మికులు

రిక్షా కార్మికుల యూనియన్ మహాసభ విజయవాడ సుందరయ్య భవన్‌లో జరిగినది.

సి.ఐ.టి.యు నగర అధ్యక్షులు శ్రీ పి. దివాకర్ మాట్లాడుతూ విజయవాడలో 15 వేల రిక్షాలున్నాయని వాటిపై ఒక లక్షా 30 వేల మంది వాటిపై ఆధారపడి జీవిస్తున్నారని ట్రాఫిక్ నిబంధనల పేరిట పోలీసులు వారిని వేధిస్తున్నారని చెప్పారు. సి.ఐ.టి.యు. నగర అధ్యక్షులు శ్రీ వెల్లంకి కృష్ణమోహనరావు రిక్షా కార్మికులను సంఘటిత పర్చటానికి చేసిన కృషిని వివరించారు. సి.ఐ.టి.యు. నగర కార్యదర్శి శ్రీ సి.హెచ్. బాబురావు, ఆటో వర్కర్స్ యూనియన్ కార్యదర్శి శ్రీ రూబెన్‌లు సందేశాలు యిచ్చారు.

రేషన్‌కార్డులు లేనివారికి యివ్వాలని, రిక్షాస్టాండులు ఏర్పాటు చేయాలని, గృహవసతి కల్పించాలని తీర్మానాలు ఆమోదించబడినవి.

శ్రీ వి. కృష్ణమోహనరావు, శ్రీ బోగి రాజులు అధ్యక్ష కార్యదర్శులుగా నూతన కమిటి ఎన్నికైనది.

## ప్రదర్శనలు

పెట్రోలు ధర పెంపుకు నిరసనగా విజయవాడ ఆటో వర్కర్స్ రైల్వేస్టేషను నుండి సబ్ కలెక్టరు కార్యాలయం వరకు వందల సంఖ్యలో ప్రదర్శన జరిపారు. పెంచిన డీజిల్, పెట్రోలు, ఆటో టైర్లు, స్పేరు పార్టుల ధరలు తగ్గించాలని వినతిపత్రం సబ్ కలెక్టరుకు సమర్పించారు. యూనియన్ కార్యదర్శి శ్రీ రూబెన్ అధ్యక్షతన జరిగిన సభలో సి.ఐ.టి.యు. నగరకార్యదర్శి శ్రీ సి.హెచ్ బాబూరావు ప్రసంగించారు. నూతన ఆర్థిక విధానాల ఫలితమే ఈ ధరల పెరుగుదల అని విమర్శించారు.

## యు.ఇ.ఇ.యు. ఆత్మకూరు కమిటి

నెల్లూరు జిల్లా ఆత్మకూరు రూరల్ ఎలక్ట్రికల్ కోఆపరేటివ్ ఆర్గనైజేషన్‌లో గల యు.ఇ.ఇ.యు. సభ్యుల జనరల్ బాడి సమావేశం 9-9-92న జరిగినది. శ్రీ కె.వి. శేషారెడ్డి అధ్యక్షత వహించారు. రాష్ట్ర సంఘ ప్రధానకార్యదర్శి శ్రీ వి. శ్రీహరి పాల్గొని యూనియన్ సాధిస్తున్న ప్రగతిని వివరించారు.

శ్రీ కె.వి. శేషారెడ్డి, గౌరవాధ్యక్షులు, శ్రీ ఎస్. శ్రీనివాసులు రెడ్డి, అధ్యక్షులు, శ్రీ యస్.కె. బషీర్, కార్యదర్శిగా, శ్రీ ఎన్. సుకుమార్, ఉపాధ్యక్షులు, శ్రీ ఎస్.కె. మస్తాన్, కోశాధికారిగా నూతన కమిటి ఎన్నికైనది. జిల్లా సి.ఐ.టి.యు. నాయకులు శ్రీ దశరథ రామయ్య జిల్లాలో జరిగిన యూనియన్ కార్యకలాపాలను వివరించారు.

10వ తేదీన నెల్లూరు పట్టణంలో యూనియన్ సభ్యుల సమావేశం డా. రామచంద్రారెడ్డి భవన్‌లో జరిగినది. NP తమ కోర్కెల సాధనకై స్థానిక విద్యుత్ ఉద్యోగులు యు.ఇ.ఇ.యు. ఆధ్వర్యంలో ప్రదర్శన జరిపారు. ఈ సందర్భంగా జరిగిన సభలో యూనియన్ రాష్ట్ర కోశాధికారి శ్రీ ఎం. సాంబశివరావు ప్రసంగిస్తూ బోర్డు అనుసరిస్తున్న కార్మిక వ్యతిరేక విధానాలను విమర్శించారు. ప్రైవేటు బిల్ కలెక్టర్లను, జాబ్ టైపిస్టులను, విలేజి ఎలక్ట్రికల్ వర్కర్స్‌ను పర్మినెంట్ చేయాలని డిమాండ్ చేశారు. ఈ ప్రదర్శనకు శ్రీ సాంబశివరావు, శ్రీ వి. నాగేశ్వరరావు నాయకత్వం వహించారు.

## ఇ.ఇ.ఎఫ్.ఐ. మహాసభ తీర్మానాలు

ఎలక్ట్రిసిటీ ఎంప్లాయీస్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా (ఇ.ఇ.ఎఫ్.ఐ) 3వ మహాసభ కలకత్తాకు సమీపంలోని బ్యారక్‌పూర్‌లో జరిగినది.

నవంబరు 25న ఢిల్లీలో పార్లమెంటు వద్ద ట్రేడ్ యూనియన్ల స్పాన్సరింగ్ కమిటి తలపెట్టిన ప్రదర్శన జయప్రదం చేయాలని మహాసభ తీర్మానించింది.

పే రివిజన్, ప్రమోషన్లు మొదలగు కోర్కెల సాధనకై ఆందోళన చేసిన విద్యుత్ బోర్డు యింజనీర్లపై రాజస్థాన్‌లోని బి.జె.పి. ప్రభుత్వం అణచివేత చర్యలు జరపటాన్ని మహాసభ తీర్మానంలో ఖండించింది.

సస్పెన్షన్లను రద్దు చేయాలని - డిస్మిస్ అయినవారిని పనిలోకి తీసుకోవాలని సంప్రదింపుల ద్వారా ఇంజనీర్ల సమస్యలు పరిష్కరించాలని రాజస్థాన్ ప్రభుత్వాన్ని కోరినది. ఆందోళన చేస్తున్న ఇంజనీర్లకు సోదర సంఘాలు మద్దతు తెలపాలని కోరుతూ మరొక తీర్మానం చేసింది.

## కరీంనగర్

తమ సమస్యల పరిష్కారం కోరుతూ కరీంనగర్ జిల్లా తాపీ కార్మికులు, తాపీ వర్కర్స్ యూనియన్ ఆధ్వర్యంలో కలెక్టర్ కార్యాలయానికి ప్రదర్శన జరిపారు.

భవన నిర్మాణ కార్మికులకు సమగ్రచట్టం తేవాలని, భీమా పథకం అమలు చేయాలని, ప్రమాదవశాత్తూ నష్టపడిన వారికి నష్టపరిహారం చెల్లించాలని, కార్మికులకు ఇళ్ళస్థలాలు ఇవ్వాలని కోరుతూ కలెక్టరుకు వినతిపత్రం సమర్పించారు. ఈ కార్యక్రమానికి తాపీ వర్కర్స్ యూనియన్ జిల్లా కార్యదర్శి శ్రీ కె. రాఘవులు, సి.పి.ఎం. నాయకులు శ్రీ ఆర్. శంకర్ రెడ్డి నాయకత్వం వహించారు.

## నెల్లూరు

సూళ్ళూరి పేటలో బీడి కార్మికులు తమకు కూడ పక్కా గృహనిర్మాణ పథకం అమలు చేయాలని కోరుతూ ఎం.ఆర్.ఓ. కార్యాలయానికి ప్రదర్శన నిర్వహించారు. అన్ని మండలాల్లో పక్కా గృహనిర్మాణ పథకం బీడీ కార్మికులకు వర్తింప చేశారని, సూళ్ళూరిపేటలో మాత్రం తమకు వర్తింప చేయలేదని కార్మికులు ఆరోపించారు. ఈ కార్యక్రమానికి బీడి కార్మిక సంఘ నాయకులు కె. మునుస్వామి, సి.పి.ఎం. నాయకులు రమణారెడ్డి నాయకత్వం వహించారు.

## ఇ.సి.ఐ.ఎల్ కు
## ఆర్డర్లు యివ్వాలి - యూనియన్ విజ్ఞప్తి

కేంద్ర ప్రభుత్వ ఆధ్వర్యాన గల తంతి తపాల, సైనిక విభాగాలకు, రైల్వేలకు కావాల్సిన పరికరముల తయారీకి సంబంధించి ఆర్డర్సును ఇ.సి.ఐ.ఎల్. కు యివ్వాలని కోరుతూ కేంద్ర సమాచార శాఖ సహాయమంత్రి శ్రీ పి.వి. రంగయ్య నాయుడుగారికి ఇ.సి.ఐ.ఎల్. యూనియన్ విజ్ఞాపన అందజేసింది. కమ్యూనికేషన్ రంగంలో ఫైబర్ ఆప్టిక్ అనే అధునాతన అభివృద్ధిని సాధించి ఇ.సి.ఐ.ఎల్. ముందుకు పోతుండగా కేంద్ర ప్రభుత్వ ఆర్డర్సు తగ్గిపోవటాన్ని యూనియన్ నిరశించింది. కొన్ని సందర్భాల్లో ఇ.సి.ఐ.ఎల్. కు మంజూరయిన ఆర్డర్స్ రద్దు చేసిన విషయాన్ని యూనియన్ మంత్రి దృష్టికి తెచ్చింది.

పై యదార్థాలను దృష్టిలో వుంచుకుని సమాచార శాఖ ఆధ్వర్యంలోగల ప్రభుత్వ శాఖలకు అవసరమైన పరికరములు ఇ.సి.ఐ.ఎల్. లో లభిస్తున్న ఎడల ఇ.సి.ఐ.ఎల్. కు ఆర్డర్స్ యివ్వాల్సిందిగా విజ్ఞాపన పత్రంలో కోరటం జరిగినది. నాణ్యత, నమ్మకము అయిన ఉత్పత్తుల తయారీలో సరియైన నిబంధనలు పాటించగలమని కూడ యూనియన్ తెలియజేసినది.

## ఐ.ఇ.పి.ఎల్. కార్మికులు
## సి.ఐ.టి.యు. లో చేరిక

జీడిమెట్ల పారిశ్రామిక ప్రాంతంలోని ఇనుస్ట్రుమెంటేషన్ ఇంజనీర్స్ ప్రై. లి. (ఫ్లో మీటర్స్) కార్మికులు సి.ఐ.టి.యు. లో చేరారు. 29-9-92న జరిగిన జనరల్ బాడీ సమావేశంలో ఈ మేరకు ఏకగ్రీవంగా తీర్మానించారు. ఇప్పటివరకు హెచ్.ఎం.ఎస్. కు అనుబంధించబడి యున్న ఈ యూనియన్‌ను సి.ఐ.టి.యు. కు అనుబంధించాలని తీర్మానించారు. యూనియన్ అధ్యక్షులుగా ఎస్. వీరయ్య, వర్కింగ్ ప్రెసిడెంటుగా వి. శ్రీనివాస్, చీఫ్ వైస్ ప్రెసిడెంట్‌గా సి. ఫణిసాయిలను మిగతా స్థానాలకు గతం నుండి కొనసాగుతున్న వారినే ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు. 3-10-92న కంపెనీ ముందు సి.ఐ.టి.యు. పతాకాన్ని ఆవిష్కరించి సభ

**కేంద్ర ప్రభుత్వ ప్రజా వ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా నవంబరు 25న ఛలో ఢిల్లీ !**

నిర్వహించారు. సభకు శ్రీ కె.వి.ఆర్. ప్రసాద్ అధ్యక్షత వహించారు. సి.ఐ.టి.యు. నగర కార్యదర్శి శ్రీ ఎం. కృపేందర్, యూనియన్ అధ్యక్షులు శ్రీ ఎస్. వీరయ్య, వర్కింగ్ ప్రెసిడెంట్ శ్రీ వి. శ్రీనివాస్, శ్రీ వరప్రసాద్ (హెచ్.ఎం.టి), శ్రీ చిన్నారావు, శ్రీ శ్రీకాంతరెడ్డి (టి.టి.కె), శ్రీ బి.జె. రాజు (ఐ.డి.పి.ఎల్ ప్రధాన కార్యదర్శి) లతో పాటు ఎ. నర్సింహరెడ్డి, ఎస్. ఆబిద్ అలి, ఫిలిప్స్, గులాంనబి, ఇ. సాంబశివరావు, ఎ. సాంబశివరావు, ఫణిసాయి, కృష్ణమూర్తి, భాస్కరరావు లు కూడా ప్రసంగించారు. సి.ఐ.టి.యు. నాయకత్వాన్ని అంగీకరించనని యాజమాన్యం మొండికేస్తున్నది. ఇది చట్ట వ్యతిరేకమనియాజమాన్యం వెంటనే సత్సంబంధాలకు సిద్ధపడాలని యూనియన్ విజ్ఞప్తి చేసింది.

## జీడి మెట్లలో సారా వ్యతిరేక ప్రదర్శన

19-10-1992 న సాయంత్రం జీడిమెట్ల ప్రాంతంలో 200 మందితో సారావ్యతిరేక ప్రదర్శన జరిగింది. ఆంధ్రప్రదేశ్ మహిళాసంఘం, ప్రగతిశీల మహిళా సంఘం, ఆంధ్రప్రదేశ్ మహిళా సమాఖ్య, సి.ఐ.టి.యు, ఎ.ఐ.టి.యు.సి, ఐ.ఎఫ్.టి.యు. ల ఆధ్వర్యంలో ఏర్పడిన పోరాటకమిటి ఈ ప్రదర్శనకు నాయకత్వం వహించింది. ఈ ప్రదర్శన జరుగుతున్నదని తెల్సుకున్న సారా దుకాణదారులంతా ఆరోజు సారా దుకాణాలు మూసి వుంచారు. జీడిమెట్ల సి.ఐ.టి.యు. కార్యాలయం నుండి ప్రారంభమైన ఈ ప్రదర్శన సంజయ్‌గాంధీ నగర్, రోడామిస్త్రీనగర్, రామారంరోడ్, వివేకానందనగర్, న్యూలాల్ బహదూర్ నగర్, షాపూర్‌నగర్ మార్కెట్ లమీదుగా సాగింది. షాపూర్‌నగర్ సెంటర్‌లో జరిగిన బహిరంగసభలో ఆంధ్రప్రదేశ్ మహిళాసంఘం నగరకార్యదర్శి కుమారి టి. జ్యోతి, ప్రగతిశీల మహిళాసంఘం నాయకురాలు శ్రీమతి కోటేశ్వరరావు, శ్రీ వరప్రసాద్ (సి.ఐ.టి.యు), శ్రీ బాలచందర్ (ఎ.ఐ.టి.యు.సి), శ్రీ జాషువా (ఐ.ఎఫ్.టి.యు) ప్రసంగించారు. శ్రీ వెంకటరత్నం అధ్యక్షత వహించారు.

## రాష్ట్రవ్యాపిత ఆందోళనకు పిలుపు

ఆంధ్రప్రదేశ్ మున్సిపల్ ఎంప్లాయీస్ ఫెడరేషన్, ఆంధ్రప్రదేశ్ గ్రామ పంచాయితీల వర్కర్స్ యూనియన్ల, కార్యవర్గాల సంయుక్తసమావేశం విజయవాడ సి.ఐ.టి.యు. కార్యాలయంలో శ్రీ కగ్గా తిరుపతయ్య అధ్యక్షతన సెప్టెంబరు 26న జరిగింది.

విజయవాడ, హైదరాబాద్, విశాఖ, గాజువాక, తాడేపల్లిగూడెం, మంగళగిరి, మచిలీపట్నం, మిర్యాలగూడెం, బోధన్ తదితర కేంద్రాలనుండి సభ్యులు హాజరయ్యారు.

ప్రధాన కార్యదర్శి శ్రీ కొండ్రగుంట వెంకటేశ్వర్లు మాట్లాడుతూ కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు చేపట్టిన ప్రైవేటీకరణ విధానాల దుష్ఫలితాలను వివరించారు. రాష్ట్ర మున్సిపల్ శాఖ ఇచ్చిన జి.జి. 400 వల్ల 1984 నుండి పనిచేస్తున్న ఎన్.ఎం.ఆర్. లు రెగ్యులరైజ్ కాకుండా పోయే ప్రమాదమున్నందున దాని రద్దుకొరకు పోరాడాలన్నారు. ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా విజయవాడ మున్సిపల్ కార్పొరేషన్ జరిపిన ఐక్య పోరాటాన్ని గురించి ఉపాధ్యక్షులు పి. దివాకర్ వివరించారు. గ్రామ పంచాయితీల వర్కర్స్ దుర్భర పరిస్థితులు, ఏ హక్కూలేని స్థితిని గురించి శ్రీ యం. గంగాధరప్ప వివరించారు. విశాఖలో జరిగిన "సులభ" కాంప్లెక్స్ పోరాటాన్ని శ్రీ వి. ఆనంద్ వివరించారు. యింకా రాష్ట్ర కార్యదర్శులు ఎల్. సత్తెయ్య - శ్రీ ఎం. భుజంగరావు, శ్రీ కంటె కామయ్య - శ్రీ ఎస్. ఎల్లారావులు కార్మికుల సమస్యలపై మాట్లాడారు. జి. సుబ్బారావు, శ్రీ సి.హెచ్. బాబూరావు తదితరులు ఆందోళన చేపట్టాల్సిన అవసరం గురించి చెప్పారు. నవంబరు 16న రాష్ట్రంలోని అన్ని మున్సిపల్, పంచాయితీ కేంద్రాలలో ప్రదర్శనలు, ధర్నాలు నిర్వహించాలని, డిసెంబరు 10న రాష్ట్రసచివాలయం వద్ద ధర్నా నిర్వహించాలని సమావేశం నిర్ణయించింది.

## కనీస వేతనాలు కోరుతూ విజయవాడలో ప్రదర్శన, ధర్నా

కనీస వేతనాలను సవరించాలని, కనీసవేతనాలను అమలు పరచాలని కోరుతూ (సి.ఐ.టి.యు) విజయవాడ నగర కమిటి ఆధ్వర్యంలో వందలాదిమంది అసంఘటిత కార్మికులు అక్టోబరు 20న నగరంలో ప్రదర్శన అనంతరం కార్మిక శాఖ కార్యాలయం వద్ద ధర్నా నిర్వహించారు.

కనీస వేతనం 1250/- గా నిర్ణయించాలని, అన్ని రంగాలలోని కార్మికులకు కనీసవేతనాలను వెంటనే సవరించాలనీ, అసంఘటిత కార్మికులందరికి జీవనవ్యయభృతి (వి.డి.ఎ.) సౌకర్యం కల్పించాలని, వి.డి.ఎ. పై హైకోర్టు యిచ్చిన స్టేని ఎత్తివేయించేందుకు రాష్ట్ర ప్రభుత్వం తగిన న్యాయపరమైన చర్యలు తీసుకోవాలని, వి.టి.పి.యస్. కాంట్రాక్ట్ కార్మికులకు కూడా వి.డి.ఎ. సౌకర్యం కల్పించాలని, కార్మిక వివాదాలను కార్మికశాఖ జాప్యం లేకుండా సత్వరమే పరిష్కారం చేయాలని, సంఖ్యతో నిమిత్తం లేకుండా కార్మికులందరికి ప్రావిడెంట్ ఫండ్, ఇ.ఎస్.ఐ సౌకర్యం కల్పించాలని, కార్మికులందరికి నియామకపత్రాలు, చట్టప్రకారం సెలవులు యివ్వాలని, ఎనిమిది గంటల పని అమలు చేయాలని కోరుతూ నగరంలోని వివిధ రంగాలలో పని చేస్తున్న అసంఘటిత కార్మికులు ఈ ప్రదర్శన, ధర్నాలో ఉత్సాహంగా పాల్గొన్నారు. శ్రామిక మహిళలు కూడా గణనీయంగా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

ధర్నాను సి.ఐ.టి.యు రాష్ట్ర కార్యదర్శి శ్రీ పి. ఉమామహేశ్వరరావు ప్రారంభించారు. శ్రీ వెల్లంకి కృష్ణమోహనరావు అధ్యక్షతన జరిగిన సభలో సి.ఐ.టి.యు. నగర ప్రధాన కార్యదర్శి శ్రీ సి.హెచ్. బాబూరావు, కార్యదర్శి శ్రీ ఆర్. రఘు ప్రసంగించారు.

ఈ ప్రదర్శన, ధర్నాలలో యునైటెడ్ ఎలక్ట్రిసిటి ఎంప్లాయీస్ యూనియన్ వి.టి.పి.ఎస్. కార్మికులు, షాప్ ఎంప్లాయీస్ యూనియన్, హోటల్, వర్కర్స్ యూనియన్ లారీ మోటార్ వర్కర్స్ యూనియన్, కొండుగుగా స్టోన్ వేర్ పైప్ కంపెనీ స్టాఫ్ అండ్ వర్కర్స్ యూనియన్, ముఠా కార్మిక సంఘం, ఉడా స్టాఫ్ అండ్ వర్కర్స్ యూనియన్స్ తదితర అనేక సంఘాల నుండి వందలాదిమంది కార్మికులు పాల్గొన్నారు.

## నందలూరు ఆల్విన్ కార్మికుల ఆందోళన

నిజాం పాలన కాలంలో తన యుద్ధ అవసరాలకు నిజాం పాలకులు స్థాపించిన ఆల్విన్ సంస్థ, రు. 4 కోట్లతో ప్రారంభమైంది. నేడు ప్రభుత్వ సంస్థలో ఆల్విన్ సంస్థ శాఖోప శాఖలుగా రాష్ట్రంలో అనేక బ్రాంచీలుగా ఏర్పడింది. కార్మికులు శ్రమించి సంస్థను రు. 700 కోట్ల పెట్టుబడి పెంచినారు. 12000 కార్మికులు వారిమీద ఆధారపడి జీవించే కుటుంబాలకు జీవనాధారంగా మారింది. గత రెండు సంవత్సరాలు తప్ప నష్టాలు ఎరుగని సంస్థ. అట్టి ప్రభుత్వరంగ సంస్థను కాంగ్రెస్ (ఐ) పాలకులు కార్మికుల పొట్టలు కొట్టి ప్రైవేటు వ్యక్తులకు అమ్ముతున్నారు.

ఆల్విన్ సంస్థను ప్రైవేటు వ్యక్తులకు అమ్మడాన్ని వ్యతిరేకిస్తూ కడప జిల్లా నందలూరు ఆల్విన్ రిఫ్రిజిరేటరు ప్లాంటులో పని చేస్తున్న 700 మంది కార్మికులు తమ గళాన్ని విప్పి నిరసన పోరాటం ప్రారంభించినారు.

నందలూరు ఆల్విన్ రిఫ్రిజిరేటరు ప్లాంటును అమ్మడాన్ని వ్యతిరేకిస్తూ ఏర్పాటు అయిన జాయింట్ యాక్షన్ కమిటీలో సి.ఐ.టి.యు; ఎ.ఐ.టి.యు.సి; ఐ.యన్.టి.యు.సి; టి.యన్.టి.యు.సి కార్మిక సంస్థలు కలిసి సి.ఐ.టి.యు. నాయకుడు శ్రీ సి.ఆర్.వి. ప్రసాద్ రావును కన్వీనర్ గా పోరాటకమిటీ ఏర్పాటయింది. ఇందులో బి.యం.యస్. మాత్రం కలిసి రాలేదు.

పోరాటంలో భాగంగా 26-8-92 నుండి 4-9-92 వరకు నందలూరు ఆల్విన్ ఫ్యాక్టరీ ఆవరణములో జరిగిన రిలే నిరాహారదీక్షలలో 350 మంది కార్మికులు పాల్గొన్నారు. రెండవ విడత పోరాటములో భాగంగా నందలూరు యం.ఆర్.ఓ. ఆఫీసు ముందు 300 మందితో ధర్నా, 17-9-92న రాజంపేట ఆర్.డి.ఓ. కార్యాలయం 700 మందితో పికెటింగ్ కార్యక్రమం జరిగింది. పికెటింగ్ కార్యక్రమానికి కాంగ్రెస్ (ఐ) నాయకులు శ్రీ వై.యస్. రాజారెడ్డి, శ్రీ మదన్ మోహన్ రెడ్డి, తెలుగుదేశం నాయకులు ఎద్దుల సుబ్బారాయుడు, సి.పి.యం. నాయకులు శ్రీయుతులు బి. నారాయణరెడ్డి, పి.సి. చౌడయ్య, జనతాదళ్ నాయకుడు శ్రీ వై.యం. ప్రతాప్‌రెడ్డి, సి.ఐ.టి.యు. నాయకులు టి. ఈశ్వరరెడ్డి మరియు జాయింట్ యాక్షన్ కమిటీ కన్వీనర్ శ్రీ సి.ఆర్.వి. ప్రసాదరావు, ఐ.ఎన్.టి.యు.సి, టి.ఎన్.టి.యు.సి, ఎ.ఐ.టి.యు.సి. నాయకులు శ్రీయుతులు ఓబుల్ రెడ్డి, ప్రసాద్, మహేష్‌లు నాయకత్వం వహించారు.

## ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా

గుంటూరు జిల్లాలోని ఆర్టీసి రూట్లలో కొన్నింటిని ప్రైవేటు ఆపరేటర్లకు యిచ్చే నిర్ణయానికి వ్యతిరేకంగా కార్యాచరణ సమితి ఆధ్వర్యంలో అక్టోబరు 18న పెద్ద ప్రదర్శన నిర్వహించబడినది. 1500 మంది పాల్గొన్నారు. కలెక్టరుకు వినతిపత్రం అందజేశారు. ప్రదర్శనలో అన్ని యూనియన్లవారు పాల్గొన్నారు.

## నిరాహారదీక్ష

వరంగల్ డివిజన్ లో గతంలో నియామకాలు యిచ్చిన కార్మికులకు వెంటనే ఉద్యోగ బాధ్యతలు కల్పించాలని కోరుతూ ఆర్టీసి కార్మికుల నిరాహారదీక్షలో పాల్గొంటున్నారు.

## కనీస వేతనాలకై ఆందోళనలు

సి.ఐ.టి.యు రాష్ట్ర కమిటి పిలుపునుసరించి, రాజమండ్రి పట్టణ సి.ఐ.టి.యు. ఆధ్వర్యాన కనీస వేతనాల అమలుకు, కార్మిక చట్టాల అమలుకు, హోటల్ వర్కర్స్, సిగర్ వర్కర్స్, రైస్ అండ్ ఆయిల్, ఆడితిసామిల్, కళంకారీ, క్వారీక్రషర్లు, పప్పుల మిల్లులు, పేపరు మిల్లులోని కంట్రాక్టు వర్కర్స్ దాదాపు "600" మంది పాల్గొన్నారు. బి.టి.ఆర్. భవన్ నుండి ప్రారంభమై, దేవీచౌక్ మీదుగా అసిస్టెంటు, లేబరు కమీషనరు వారి ఆఫీసుకు వెళ్లి ధర్నా కార్యక్రమము నిర్వహించారు. శ్రీ ఎమ్. నాగేశ్వరరావు, బి.బి. నాయుడు, పోలిన వెంకటేశ్వరరావు, పి. రామారావు, ఎన్.సి. శేఖర్, ఎమ్. వాసుదేవరావు, ఎల్లయ్య బిల్డింగ్ కన్‌స్ట్రక్షన్ నాయకుడు, అబ్దుల్లా తదితరులు నాయకత్వం వహించారు. ఊరేగింపులో కనీసవేతనాలు అమలు పర్చాలని, చట్టాలు అమలుకు లేబరు డిపార్టుమెంటు కలుగజేసుకోవాలని, చట్టాలు అమలుకు ప్రభుత్వం కలుగజేసుకోవాలని నినాదాలు చేశారు.



విజయవాడలో ధర్నా

## కొత్తగూడెం

స్పాన్సరింగ్ కమిటి పిలుపు మేరకు నూతన ఆర్థిక, పారిశ్రామిక విధానాలు, ఎగ్జిట్ పాలసీ అనే దిష్టిబొమ్మను కొత్తగూడెం బేరియం కెమికల్స్ ఫ్యాక్టరీ ఎదుట కార్మికులు దహనం చేశారు.

ఎగ్జిట్ పాలసీని తలపెట్టిన కేంద్ర కాంగ్రెస్ ప్రభుత్వానికి "ఎగ్జిట్" చెప్పాలని స్టాఫ్ అండ్ వర్కర్స్ యూనియన్ కార్యదర్శి శ్రీ కె.హెచ్. ప్రసాద్ కార్మికులకు విజ్ఞప్తి చేశారు. యూనియన్ అధ్యక్షులు శ్రీ సంజీవరావు, మజ్దూర్ యూనియన్ (ఎ.ఐ.టి.యు.సి) కార్యదర్శి శ్రీ సారయ్య కూడ ప్రసంగించారు.

## శ్రీకాకుళం

శ్రీకాకుళం పట్టణంలో బాపూజి కళామందిరం వద్ద ప్రదర్శన జరిగింది. ఐ.ఎమ్.ఎఫ్, ఎగ్జిట్ పాలసీల దిష్టిబొమ్మలను ఉద్యోగ కార్మిక సంఘం సమన్వయ కమిటి ఆధ్వర్యంలో తగులబెట్టారు.

## అఖిలభారత బిల్డింగ్ వర్కర్స్ మహాసభ

బిల్డింగ్ వర్కర్స్ ఫెడరేషన్ అఖిల భారత మహాసభ ఆగష్టు 21 నుండి 23 వరకు కేరళ రాష్ట్రంలోని కొచ్చిన్ నగరంలో జరిగినది. 8225 సభ్యులకు ప్రాతినిధ్యం వహిస్తూ 11 రాష్ట్రాలనుండి 392 ప్రతినిధులు 13 మంది సౌహార్ద ప్రతినిధులు హాజరైనారు. ఆంధ్రప్రదేశ్ నుండి మొత్తం 32 మంది పాల్గొన్నారు.

సి.ఐ.టి.యు. ఆలిండియా కార్యదర్శి శ్రీ ఎం.ఎం. లారెన్సు మహాసభను ప్రారంభించారు. డాక్టరు ఎం.కె. పాంథె అధ్యక్షోపన్యాసం చేశారు.

కార్యదర్శి నివేదికపై చర్చలో 40 మంది పాల్గొన్నారు. వారిలో 5గురు మహిళా ప్రతినిధులున్నారు. చర్చలో ఆంధ్రప్రదేశ్ నుండి వి. ఉమామహేశ్వరరావు, జి. యాదగిరిరావు, కె. గోపాల్ పాల్గొన్నారు. ఇతర దేశాలలోని భవన నిర్మాణ కార్మిక సంఘాలు సందేశాలు పంపినవి.

* నిర్మాణ కార్మికులకు సమగ్ర శాసనం, * ద్వైపాక్షిక వేతన కమిటి, * కేంద్రప్రభుత్వ నూతన విధానాలు, * భవన నిర్మాణ వస్తువుల ధరల తగ్గింపు, * నిర్మాణ కార్మికులకు గృహవసతి, * నివాసహక్కు ప్రాథమిక హక్కుగా గుర్తింపు, * మతోన్మాదం, వేర్పాటు శక్తులు, * క్యూబా ప్రజలకు సంఘీభావం, * పంజాబ్ సమస్య పరిష్కారం మొదలగు విషయాలపై తీర్మానాలు ఆమోదించబడినవి.

డాక్టరు పాంథే అధ్యక్షులు, దేబేంజన్ చక్రవర్తి ప్రధానకార్యదర్శిగా నూతన కమిటి ఎన్నిక జరిగినది. ఉపాధ్యక్షుల్లో ఒకరుగా శ్రీ వి. ఉమామహేశ్వరరావు, కమిటి సభ్యులుగా శ్రీ ఎస్. దుర్గారావు ఆంధ్రప్రదేశ్ నుండి ఉన్నారు.

### కర్తవ్యాలు :

* నవంబరు 24న ప్రధానమంత్రి నివాసం ముందు ధర్నా.
* నవంబరు 25న పార్లమెంటు ఎదుట మహాప్రదర్శనలో పాల్గొనుట.
* సంతకాలు సేకరించి నవంబరు 24న ప్రధానికి మహజరు సమర్పణ.
* నవంబరు 6న రాష్ట్రాలలో కోర్కెల దినం పాటించటం.

చివరి రోజున వేలాదిమందితో బ్రహ్మాండమైన ప్రదర్శన, బహిరంగ సభ జరిగినవి.

కేరళ మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఇ.కె. నయనార్ కూడ ప్రసంగించారు.

విజయవాడ, మహబూబ్‌నగర్ పట్టణాలనుండి ప్రత్యేక బస్సులలో వెళ్లిన కార్యకర్తలు ప్రదర్శనలో పాల్గొన్నారు.

మహబూబ్‌నగర్ 10, నల్గొండ 6, శ్రీకాకుళం 4, ఖమ్మం 4, విజయవాడ 3, కరీంనగర్ 2, హైదరాబాద్ 1, గుంటూరు 1 ప్రతినిధులు మహాసభకు హాజరైనారు. సంఘ సభ్యత్వంలో కేరళ, బెంగాల్ తర్వాత ఆంధ్రప్రదేశ్ మూడవ స్థానంలో వున్నది. ప్రతినిధుల్లో కూడ అంతే.

### *గడచిన నెల రోజుల్లో –*

## అజంజాహి

వరంగల్లు లోని భారీ పరిశ్రమ అజంజాహి మిల్లును పరిరక్షించాలని, మూసివేయరాదని వివిధ యూనియన్లతో కూడిన ఐక్య కార్యాచరణ కమిటి ఆందోళన చేస్తున్నది. వివిధ రాజకీయ పార్టీలు, ప్రజాసంఘాలు కూడ యీ ఆందోళనలో పాల్గొంటున్నవి. జిల్లా అంతటా అనేక కేంద్రాల్లో రాస్తారోకో కార్యక్రమం నిర్వహించబడుతున్నది. అక్టోబరు 13న వరంగల్ పట్టణంలో బంద్ పాటించబడినది. అక్టోబరు 13న మహబూబాబాద్, డోర్నకల్ స్టేషన్లలో రైల్‌రోకో కార్యక్రమం జరిగింది. మహబూబా బాద్‌లో 150 మందిని, డోర్నకల్‌లో 100 మందిని ఈ సందర్భంగా అరెస్టు చేశారు.

## సారా వ్యతిరేక ఉద్యమం

నెల్లూరు జిల్లాలో ప్రారంభమైన సారా వ్యతిరేక ఉద్యమం అనేక జిల్లాలకు విస్తరించింది. వివిధ మహిళా సంఘాలు ఈ ఉద్యమంలో పాల్గొంటున్నవి. రాష్ట్ర రాజధాని నగరం హైదరాబాద్‌లో మహిళా సంఘాలు బ్రహ్మాండమైన ప్రదర్శన నిర్వహించినవి. రాజకీయ పార్టీలు, ప్రజాసంఘాలు ఈ ఉద్యమానికి మద్దతు పలికినవి. అమ్మకాలను నిరోధిస్తున్న మహిళలపై పోలీసులు లాఠీ చార్జీ జరిపారు. సారా కంట్రాక్టర్లు తమ గూండాలతో దాడులు చేస్తున్నారు. నెల్లూరు జిల్లాలో సారా వేలంపాటలు పదే పదే వాయిదా పడినవి.

## హుగ్లీ నదిమీద క్రొత్త బ్రిడ్జి

1972లో ప్రారంభించి 20 ఏళ్ల కాలంలో రు. 388 కోట్ల ఖర్చుతో నిర్మాణం పూర్తయిన బ్రిడ్జికి ప్రధానమంత్రి శ్రీ పి.వి. నరసింహారావు ప్రారంభోత్సవం జరిపారు. కలకత్తా – హౌరాలను కలిపే ఈ బ్రిడ్జి హుగ్లీనదిపై నిర్మించబడినది. కేంద్ర ప్రభుత్వంనుంచి అప్పుతీసుకుని పశ్చిమబెంగాల్ ప్రభుత్వం ఈ బ్రిడ్జిని నిర్మించింది. టోల్‌గేటు పన్ను వసూలు చేసి అప్పు తీర్చ తలపెట్టినది.

## సి.పి.ఎస్.టి.యు. పిలుపు ఆంధ్రప్రదేశ్‌లో అమలు

సి.పి.ఎస్.టి.యు. పిలుపునుసరించి హైదరాబాద్ నగరంలో ప్రభుత్వరంగ పరిశ్రమలన్నింటా అక్టోబరు 8న మధ్యాహ్న భోజనం బహిష్కరించి ఉద్యోగులు గేటు మీటింగులు జరిపారు. కొన్ని పరిశ్రమల్లో లంచ్‌తో పాటు ఉదయం టిఫిన్‌ను కూడ బహిష్కరించారు. కార్మికులతోపాటు ఆఫీసర్లు కూడ ఈ ఆందోళనలో పాల్గొన్నారు. ఇ.సి.ఐ.ఎల్, హెచ్.ఎం.ఎల్, హెచ్.సి.ఎల్, హెచ్.ఎం.టి. (బేరింగ్స్), మిధాని, బి.ఇ.ఎల్, ప్రాగాటూల్స్, ఐ.డి.పి.ఎల్, తదితర కేంద్ర సంస్థలన్నింటా ఈ కార్యక్రమం అమలు జరిగింది.

## అక్టోబరు 12 రెండవదశ కార్యక్రమం అమలు జరిగినది.

హైదరాబాద్, విశాఖపట్నం, ఖమ్మం పట్టణాల్లో ఐ.ఎమ్.ఎఫ్. ఎగ్జిట్ పాలసీ, ప్రైవేటీకరణల దిష్టిబొమ్మలను తగలబెట్టటం జరిగినది.

విశాఖపట్టణంలో షిప్‌యార్డ్ గేటు ఎదుట 1000 కార్మికులు ఎస్.ఎన్. శర్మ, శ్రీ ఆర్. బాబూరావు (సి.ఐ.టి.యు), శ్రీ అడారి సత్యనారాయణ (ఎ.ఐ.టి.యు.సి), శ్రీ జి. రమణ (టి.ఎన్.టి.యు.సి), శ్రీ బి. సూర్యనారాయణ (వర్కర్స్ సాలిడారిటీ). శ్రీ అడారి అప్పారావు (జనతాదళ్), శ్రీ ఎన్.వి. రమణ మూర్తి తదితరులు ఈ కార్యక్రమానికి నాయకత్వం వహించారు.

ఖమ్మం పట్టణంలో 600 మంది వర్తక సంఘభవనం నుండి బయలుదేరి మయూరి సెంటరు వరకు ప్రదర్శన జరిపారు. మధ్యలో మధిర నుండి 200 మంది వచ్చి చేరారు. దిష్టి బొమ్మలను దగ్ధం చేశారు.

సి.ఐ.టి.యు., డి. వై.యఫ్.ఐ, సి.పి.ఎం, బిల్డింగ్ వర్కర్స్ సంఘాల నాయకులు శ్రీయుతులు డి. కొండయ్య, వంజాకుల వెంకటేశ్వర్లు, బండారు యాకయ్య, యర్రా శ్రీకాంత్, ఎం. జగన్మోహన్ రావులను అరెస్టుచేసి తర్వాత వదిలారు. ప్రదర్శనకు నాయకత్వం వహించిన వారిలో అరెస్టు కాబడిన వారితో బాటు శ్రీయుతులు పల్లా జాన్ రాములు, మాదాసు నగేశ్వరరావు, ఆర్. కోటంరాజు, ఎర్రా రమేష్, టి. వీరేశంగార్లు కూడా వున్నారు.

## కక్ష సాధింపు

ప్రకాశం జిల్లా కరేడు గ్రామంలో ప్రీమియర్ టుబాకో ఫ్యాక్టరీ యాజమాన్యం యూనియన్ అధ్యక్షుడు శ్రీ పెద్దబ్బాయిని సస్పెండు చేసింది. సహాయ కార్యదర్శి శ్రీ బి. రాజారావును ట్రాన్సుఫర్ చేసింది. యూనియన్ రిప్రజెంటేషన్ మీద పై యిరువురిని పనిలోకి తీసుకుంటామని హామీ యిచ్చి కూడ దానిని అమలు చేయలేదు.

అక్టోబరు 2న యూనియన్ సమావేశమై యాజమాన్యపు వైఖరిని ఖండించింది. శ్రీ వనమా మాణిక్యరావు, శ్రీ జి. విలస్ లను సహాయ కార్యదర్శులుగాను, శ్రీ తోట కృష్ణయ్య, శ్రీమతి మద్దసాని లక్ష్మీకాంతమ్మ, శ్రీమతి చింగిసపల్లి లక్ష్మమ్మ, కాంబోతు వెంకట సుబ్బమ్మలను కార్యవర్గ సభ్యులుగా చేర్చుకుంటూ తీర్మానించింది.

## నిజాం షుగర్స్‌లో క్లీనింగ్ పని

ఈ ఏడాది మార్చి 16 నుండి లే ఆఫ్‌లో మున్న నిజాం షుగర్స్ ఫ్యాక్టరీలో లే ఆఫ్ ఎత్తి వేయాలని అన్ని కార్మిక సంఘాలతో కూడిన కార్యాచరణ సమితి మంత్రులు శ్రీ జానారెడ్డి, శ్రీ మహ్మద్ జానీలు కలిసి విజ్ఞప్తి చేశారు.

దీనిమీదట లే ఆఫ్‌లోనున్న కొందరు కార్మికులను క్లీనింగ్ పనిలోకి తీసుకోవలసిందిగాను, కొంతమందిని కొత్త యూనిట్‌కు బదిలీ చేయవలసిందిగాను మంత్రులు మేనేజిమెంటుకు ఉత్తర్వులు పంపారు.

అక్టోబరు 26 నుండి క్లీనింగ్ ప్రారంభమవుతుంది.

## పీచపు ఎత్తుగడలు

ప్రకాశం జిల్లా కందుకూరు పట్టణంలో ప్రైమరీ టుబాకో ప్యాకర్స్ కంపెనీ కార్మికులు 600 మంది సి.ఐ.టి.యు. ఆధ్వర్యంలో ప్రదర్శన జరిపారు. లేబరు ఆఫీసువద్ద ధర్నా జరిపారు. కనీస వేతన చట్టాన్ని అమలు చేయాలని కోరారు.

యూనియన్ అధ్యక్షుడు శ్రీ పెద్దబ్బాయిని మరికొందరిని తొలగించడాన్ని విమర్శించారు. కార్మికులను నిరుత్సాహపరిచి సంఘాన్ని విచ్ఛిన్నం చేయటానికై మహిళా కార్మికుల భర్తలకు తప్పుడు ఉత్తరాలు వ్రాసే స్థితికి మేనేజిమెంటు దిగజారిందని తీవ్రంగా గర్హించారు.

ప్రదర్శకులనుద్దేశించి యూనియన్ నాయకులు శ్రీయుతులు మాలకొండయ్య, రాజారావు, మహిళా నాయకురాలు రోష్న, సి.పి.ఎం. నాయకులు శ్రీ మువ్వా కొండయ్య, శ్రీ జి. వెంకటేశ్వర్లు, శ్రీ ముప్పరాజు కోటయ్య, శ్రీ పెద్దబ్బాయి ప్రసంగించారు.

బౌరా విశాఖపట్నం షిప్‌యార్డులో 5000 మంది కార్మికులకు నూతన వేతనాలు ఈ ఏడాది డిశంబరు నుండి అమలు చేయాల్సి వున్నది. గతంలో యూనియన్ చేసుకున్న ఒప్పందం ప్రకారం పాత వేతనాలతోపాటు రు. 250/- నుండి రు. 350/- ల వరకు అడ్‌హాక్ ఎడ్వాన్సులు, యాజమాన్యం చెల్లిస్తున్నది. వున్న సౌకర్యాలను హరించే అవకాశం లేకుండా పాత నాయకత్వం జాగ్రత్తపడింది. ఆ అవగాహన ప్రకారం ఆ ఒప్పందాన్ని యథాతథంగా అమలు చేయించుకోవలసిన బాధ్యత ప్రస్తుత నాయకత్వంపైన ఉంది.

నూతన వేతనాలను గడచిన 32 నెలలుగా అమలు చేస్తూ 1990 ఫిబ్రవరి నుండి బకాయిలు చెల్లించాల్సి ఉండగా నూతన వేతనాల సవరణ ప్రతిపాదనలు యాజమాన్యం ముందుకు తెచ్చింది. వాటిని కొత్తనాయకత్వం కార్మికుల ముందు వుంచింది.

యాజమాన్యం వత్తిడికి లొంగి గుర్తింపు పొందిన సంఘనాయకత్వం క్యాంటీన్ సౌకర్యం వదులుకోవటానికి ప్రత్యామ్నాయంగా ఏడు రూపాయల చెల్లింపుకు ఒప్పుకున్నది. అంతేకాదు రాబోయే కాలంలో యిపుడున్న మెడికల్ సౌకర్యాన్ని, ఇతర సౌకర్యాలు మార్పు చేయబడుతవని తెలుస్తున్నది. కొత్తనాయకత్వం చేసిన ఈ ఒప్పందాన్ని సి.ఐ.టి.యు, టి.ఎన్.టి.యు.సి, బి.ఎమ్.ఎస్, సంస్థల ప్రతినిధులు జనరల్ బాడీ సమావేశంలో నిరసించారు. సమావేశం నుండి వాకౌట్ చేశారు.

నూతన వేతనాల పేరిట వున్న సౌకర్యాలను యాజమాన్యం ప్రయత్నిస్తున్నదని దానిని త్రిప్పి కొట్టాలని సి.ఐ.టి.యు. కమిటి సభ్యులు శ్రీ ఆర్. బాబూరావు, యు.వి.ఎస్.ఎన్. వర్మలు ఒక ప్రకటనలో కోరారు.

## గూండాల దాడిలో సి.ఐ.టి.యు కార్యకర్త మృతి

కొండపల్లిలోని సినిమాహాలులో సి.ఐ.టి.యు కార్యకర్తలపై గుర్తు తెలియని గూండాలు చేసిన దాడిలో గాయపడినవారిలో శ్రీ బి. గోపాలరావు విజయవాడ ప్రభుత్వ ఆసుపత్రిలో అక్టోబరు 21వ తేదీన మరణించారు.

దాడికి గురైన వారు కొండపల్లిలోని సి.పి.సి.సి. కంపెనీ కార్మికులు.

[illegible]

# అట్లాంటిక్ సముద్రం నుండి పశిఫిక్ సముద్రందాకా

ఆర్థిక మాంద్యం పెట్టుబడిదారీ దేశాలన్నింటిని ముంచెత్తుతోంది. ఉత్పత్తి అయిన సరుకులు అమ్మకం కావటంలేదు. గోదాముల్లో గుట్టలు గుట్టలు పేరుకు పోతున్నాయి. ఉత్పత్తి కుంటుపడుతున్నది. ఉద్యోగాల నుండి తొలగింపు సర్వసాధారణమైపోయింది. ప్రపంచంలోనే పేరుమోసిన మెర్సిడెస్ బెంజ్ కార్ల అమ్మకం 7 శాతం పడిపోయింది. ఐరోపా ఖండంలోని అన్ని దేశాల్లోను కార్ల అమ్మకాలు వచ్చే ఏడాది మరింత పడిపోతాయని భయపడుతున్నారు.

పోర్టు కంపెనీ రెండు ఫ్యాక్టరీల్లో 1500 మందిని తొలగించింది. రోల్స్‌రాయిస్ కంపెనీ 950 మందిని తొలగిస్తామని ప్రకటించింది. వాలంటరీగా తొలగకపోతే బలవంతంగా తొలగిస్తానని బెదిరించింది.

బ్రిటిష్ దేశపు కరెన్సీ పౌండ్ రేటు పడిపోయింది. దీనికి కారణం నీవంటే నీవంటూ బ్రిటన్, జర్మనీ ఒకరినొకరు నిందించుకుంటున్నారు. ఒకరికి వ్యతిరేకంగా మరొకరు ముఠాలు గడుతున్నారు. ఆరోపణల యుద్ధం జరుగుతోంది. ఒక దేశపు కరెన్సీ రేటును పడగొట్టాలని మరొక దేశం చూస్తున్నది.

## బ్రిటన్

బ్రిటన్‌లో నిరుద్యోగుల సంఖ్య 28 లక్షలకు చేరింది. పేరుమోసిన బి.బి.సి. కంపెనీ 120 ఉద్యోగాలకు కోతబెట్టింది. రోవర్ కంపెనీ తన కార్మికులకు 6 మాసాల పాటు జీతాలు చెల్లించలేను అంటున్నది. 34 వేలమంది పనిచేస్తుండగా ఒక్కసారి 4000 వుద్యోగాలు కోతపడ్డాయి. హాట్‌ఫీల్డు విమాన సంస్థ 3000 ఉద్యోగాలను రోల్స్‌రాయిస్ కార్లకంపెనీ 2500 ఉద్యోగాలను కోత విధించాయి. ఈ ఏడాది మొదటి 9 నెలల్లోనే బ్రిటన్‌లో 45 వేల కంపెనీలు మూతపడ్డాయి.

ఆర్థికమాంద్యం నుండి బయటపడాలంటే సరుకుల కొనుగోళ్లు పెరగాలి. అంటే ప్రజల ఆదాయాలు పెరగాలి. అంటే వారి జీతాలు పెరగాలి. నిరుద్యోగం పోవాలి.

కాని ప్రస్తుతం బ్రిటన్‌లో దీనికి వ్యతిరేకంగా జరుగుతున్నది. ఉన్న ఉద్యోగాలు వూడుతున్నాయి. వేతనాలు తరుగుతున్నాయి. అందువల్ల ప్రజల కొనుగోలు శక్తి తగ్గుతున్నది. ఆర్థికమాంద్యం మరింత తీవ్రమయే స్థితే కనిపిస్తున్నది.

ఇది ఒక్క బ్రిటన్‌లోనే కాదు. కొమ్ములు తిరిగిన పెట్టుబడిదారీ దేశాలన్నింటినీ – అమెరికా, జపాన్ లతో సహా – మాంద్యం ముంచెత్తుతున్నది.

పెట్టుబడిదారీ దేశాలుగా జబ్బలు చరిచిన దేశాలూ, కొత్తగా పెట్టుబడిదారీ మతం పుచ్చుకున్న దేశాలూ పెట్టుబడిదారీ పంథాలోనే అభివృద్ధి చెందుదామని కలలుగంటూన్న భారతదేశంలాంటి వర్ధమానదేశాలూ తర తమ తేడాలతో మాంద్యంలో చిక్కుకుంటున్నాయి.

విదేశీ గుత్త పెట్టుబడులకు తలుపులు బార్లా తెరిచిన భారత దేశంలో రెండు లక్షలకు పైగా కంపెనీలు మూతపడ్డ స్థితీ లక్షలమంది ఉద్యోగాలు పోగొట్టుకున్న స్థితీ మనం నిత్యం అనుభవిస్తూనే ఉన్నాం.

## జపాన్

మంద్యం ప్రభావం జపాన్ ఆర్థిక స్థితి దిగజారటానికి దారితీసింది. సంక్షేమ కార్యక్రమాలపై ప్రభుత్వం కోత విధిస్తోంది. దీనికి వ్యతిరేకంగా ప్రజలు వీధుల్లోకి వచ్చి పోరాడుతున్నారు. ఉపాధి లేనివారికిచ్చే ఆర్థికసాయం ఆపివేయటంతో ఒసాకానగరంలో కార్మికులు ఆందోళన జరిపారు. అల్లర్లు ఒక పట్టణం నుంచి ఒక పట్టణానికి ప్రాకుతున్నాయి. కార్లు తగలబడ్డాయి. ఆర్థికమాంద్యంవల్ల నిర్మాణపనులు స్తంభించాయి. పనిలేని నిర్మాణ కార్మికులు ఆందోళనలో పాల్గొంటున్నారు. పోలీసులతో తలపడుతున్నారు.

## యుద్ధరీతులు

"పండుగాని పండు" ఏదో చెప్పు!

"కాయగాని కాయ" ఏదో చెప్పు!

అంటూ పొడుపు కథలు చెప్పుకొని పెద్దలు, పిన్నలు ఆనందించటం కద్దు.

ఇపుడు మారణాయుధాలు ప్రయోగించని యుద్ధాలు –

"యుద్ధంకాని యుద్ధం" ఏదో చెప్పు అని కొత్తగా [illegible] వచ్చు.

మొదటి ప్రపంచ యుద్ధం[illegible]నే ఎంతో జన నష్టం, ఆస్థి నష్టం జరిగింది. మళ్లీ యుద్ధాలు వద్దురాబాబూ అంటూ యుద్ధాలు లేని శాంతియుత ప్రపంచం నిర్మించుకుందామని నానాజాతి సమితిని రూపొందించుకున్నారు వివిధ రాజ్యాలవారు.

అయినా ఆ యుద్ధం ముగిసిన 20 ఏండ్లకే రెండవ ప్రపంచ యుద్ధం బద్దలై కోట్ల సంఖ్యలో జనాభా మృత్యువు వాతబడింది.

యుద్ధం ముగుస్తూనే ప్రపంచరాజ్యాల సంఘం – ఐక్య రాజ్యసమితి – ఏర్పడింది. దేశాలమధ్య తలెత్తే వివాదాలను బలప్రయోగం ద్వారా కాక సంప్రదింపుల ద్వారా పరిష్కరించుకుందామని అందుకు ఐ.రా.స. వేదిక అని ప్రకటించుకున్నారు. శాంతి స్థాపన కోసం సంఘాలు ఏర్పడినవి. తీర్మానాలు చేసినవి. సభలు జరిగినవి. ఎన్ని చేసినా ప్రపంచవ్యాపిత యుద్ధాలు, స్థానిక యుద్ధాలు జరుగుతూనే వున్నాయి.

భూమండలాన్ని భస్మీపటలం చేయగల అత్యంత శక్తివంతమైన మారణాయుధాలు క్రొత్త క్రొత్తవి ఎన్నో తయారై ప్రపంచం నలు మూలలా గోదాముల్లో గుట్టలు గుట్టలుగా పడి వున్నాయి. బక్కవాడిమీద బలవంతుడు

దాడి చేస్తూనే వున్నాడు. ఆయుధాలు చూపి బెదిరించి లొంగ తీసుకుంటూనే వున్నాడు. సరికొత్త మారణాయుధాలు ఉత్పత్తి అవుతూనే వున్నాయి.

భూతలంమీద, సముద్రజలాలపైన చివరకు ఆకాశంలో (నక్షత్రయుద్ధం) కూడ యుద్ధం చేయటానికి పథకాలు, సైనిక సమీకరణాలు జరుగుతూనే వున్నాయి. అటు శాంతి వచనాలు వల్లిస్తూనే యిటు ఆధునాతన ఆయుధోత్పత్తి చేస్తూనే వున్నారు.

ఇదిలా జరుగుతుండగానే అగ్రరాజ్యాల మధ్య ప్రచ్ఛన్నయుద్ధం అనేది ప్రచారంలోకి వచ్చింది. రెండు ప్రధాన అగ్రరాజ్యాల్లో ఒకటైన సోవియట్ యూనియన్ విచ్ఛిన్నం కావటంతో ఎదురులేని ఒకే ఒక అగ్రరాజ్యం అమెరికా కావటంతో ప్రచ్ఛన్న యుద్ధ వాతావరణం లేదు అని అంటున్నారు. దాని సంగతెలా యున్నా - మిసా ఆయుధాలు ప్రయోగించని యుద్ధాలు యిపుడు అనేకం జరుగుతున్నాయి.

ప్రచార యుద్ధం

వాణిజ్య యుద్ధం

కరెన్సీ యుద్ధం

సంస్కృతీ యుద్ధం

అలాంటి వాటిలో కొన్ని.

ప్రచార సాధనాలను రేడియో, టెలివిజన్, పత్రికలను గుప్పిట్లో పెట్టుకుని గిట్టని దేశాల గురించి అబద్ధాలు ప్రచారంచేసి ఆయా దేశాల ప్రజలను తప్పుదారి పట్టించి కల్లోలం సృష్టించటం, సాధ్యమయితే ఆయా ప్రభుత్వాలను కూల్చటం ప్రచారం యుద్ధంలో భాగాలు.

దేశాలమధ్య వాణిజ్యంలో పైచేయి చేసుకోవటానికి, దిగుమతులపై పన్నులు విధించి ప్రత్యర్థిదేశాలను దెబ్బతీయటం వాణిజ్య యుద్ధం.

- అలాగే తమకు పోటీగా వున్నారనుకున్న దేశాల కరెన్సీని దెబ్బ తీయటానికి వత్తిడులు తేవటం ఆయాదేశాల కరెన్సీల విలువ పడిపోయేటట్లు చేయటం ఆ విధంగా ఆయా దేశాల ఆర్థికస్థితిని కల్లోలపర్చి తాము లాభపడ చూడటం కరెన్సీ యుద్ధం.

తమ దేశాల్లో మున్న కుళ్లు సంస్కృతిని, బూతు సాహిత్యాన్ని, బూతు సినిమాలను యితర దేశాలకు ఎగుమతిచేసి ఆయా దేశాల ప్రజల్లో నైతిక విలువల పతనం కోసం కృషి చేయటం ఆ విధంగా ఆ దేశాల ప్రజలను తమ దాడిని ప్రతిఘటించలేని అశక్తులుగా మార్చివేయటం సంస్కృతీ యుద్ధం.

యుద్ధంకాని ఈ యుద్ధాలన్నింటినీ పెట్టుబడిదారీ దోపిడి వ్యవస్థ గల దేశాలు యితరులపై ప్రయోగిస్తున్నాయి.

యీ అన్ని రకాల యుద్ధాలకు ఆయా దేశాల ప్రజలనుండి, ప్రభుత్వాలనుండి ఏదో మోతాదులో ప్రతిఘటన జరుగుతూనే వున్నది.

## ఇంకా వ్యాఖ్య ఎందుకు!

భారతదేశంలో నేరుగా పెట్టుబడి పెట్టి దీర్ఘకాలం తమ కార్యకలాపాలు సాగించవలెనని నచ్చచెప్పటానికి ఏడుగురు సభ్యుల బృందాన్ని భారత ప్రభుత్వం అమెరికాకు పంపింది. ఈ బృందం వారు అమెరికాలోని బహుళజాతి గుత్తకంపెనీలవార్ని కలుసుకొని వారికి నచ్చచెపుతారు. ప్రభుత్వ నాయకులను, రాజకీయ నాయకులను, వ్యాపార వర్గాలను కలుసుకుంటారు. విదేశీ పెట్టుబడులకు భారతదేశంలో పరిస్థితి ఏ విధంగా అనుకూలంగా వున్నదీ వివరించుతారు -

*- (ఎకనామిక్ టైమ్స్, 12-10-92)*

"అడ్డూ అదుపూ లేకుండా సాగే దిగుమతులు, విదేశీ కంపెనీలకు తలుపులు బార్లా తెరవడం వల్ల కలిగే దుష్ఫలితాల పట్ల అప్రమత్తులై వుండాలని మాజీ రాష్ట్రపతి శ్రీ ఆర్. వెంకట్రామన్ హెచ్చరించారు. ప్రభుత్వం ఏ విధానం అవలంబించినా అది ప్రజల సంక్షేమానికి తోడ్పడేదిగా వుండాలని లేని పక్షంలో ప్రజలు దానిని త్రిప్పి కొడతారని విదేశీ కంపెనీలను మనదేశంలో ప్రవేశించేందుకు అనుమతించడం వల్ల దేశ ప్రయోజనాలకు భంగం వాటిల్లగలదని ఆయన హెచ్చరించారు."

*- రామ్‌కో పరిశ్రమల ఫైబర్ షీట్ కర్మాగారం రజతోత్సవ సభలో శ్రీ వెంకట్రామన్ ప్రసంగం -*

## కుంభకోణాలకు సలహాదారు

కుంభకోణాలు జరిపిన బ్యాంకుల్లో ఒకటైన స్టాండర్డ్ చార్టర్డ్ బ్యాంకు వద్ద ఎలాంటి హామీ పత్రాలు లేకుండానే ప్రభుత్వ అటార్నీ జనరల్ శ్రీ రామస్వామి 15 లక్షలు ఓవర్‌డ్రాఫ్టు తీసుకున్నారని ఆ బ్యాంకు అధికారులు బయటపెట్టారు. బ్యాంకు కుంభకోణాల విచారణను పార్లమెంటు సభ్యుల కమిటి ప్రారంభించిన తర్వాత శ్రీ రామస్వామి స్టాండర్డ్ చార్టర్డ్ బ్యాంకు అధికారులను కలసి మంతనాలాడారు.

ప్రభుత్వానికి సలహా యివ్వవలసిన బాధ్యత కలిగి ఉన్నత స్థానంలో ఉన్న వ్యక్తి కుంభకోణంలో ఆరోపణలు మోపబడిన వ్యక్తికి కూడ సలహాలిచ్చే పనికి పూను కోవటం ఎంతద్రోహం!

కంచే చేనుమేస్తే యిక దిక్కేమిటి. అందుకే శ్రీ రామస్వామిని అటార్నీ జనరల్ పదవినుంచి తక్షణం తొలగించాలని పలు సంస్థలు కోరుతున్నవి.

## రైల్వే నెత్తిమీద కత్తిపడుతున్నా

"సిబ్బంది వినియోగ ప్రణాళిక" పేరుతో వేలాది ఉద్యోగాలకు స్వస్తి చెప్పే ప్రయత్నాలు రైల్వేలో చురుకుగా సాగుతున్నాయి. ఆగ్నేయ రైల్వేలో ఈమేరకు ఆదేశాలు కూడ జారీ అయినవి. ఏఏ ఉద్యోగాల్లో కోతపెట్టవచ్చో సూచించారు కూడ. ఈ అధ్యయనం ఇంకా సాగించి ఎంతమంది మిగులు తేలుతారో చెప్పాలని కోరారు.

1991 నాటికి ఆగ్నేయ రైల్వేలో 4065 పోస్టులు మిగులు తేల్చబడినవి. మరల 1991-92లో 7 సార్లు జరిపిన పరిశీలనలో 528 పోస్టులు మిగులు తేలినట్లు చూపారు.

గత ఏడాది ఏప్రిల్ నుండి ఈ ఏడాది ఏప్రిల్ మధ్య 642 ఉద్యోగాలు రద్దు చేయబడినవి.

ఉద్యోగాల కోత, ప్రైవేటీకరణ సమస్యలపై రైల్వేలోని అన్ని కార్మిక సంఘాలూ ఆందోళన చెందుతున్నది. సభలూ, ప్రదర్శనలూ జరిపి తీర్మానాలు చేస్తున్నారు. నిరసన ప్రకటిస్తున్నారు.

కాని ఏ సంఘమూ నిరసన ప్రకటనల స్థాయి దాటి ముందుకు అడుగు వేయటంలేదు. దేశ వ్యాపితంగా ఇప్పటివరకూ జరిగిన రెండు కార్మిక సమ్మెల్లో రైల్వే సంఘాలు ఏవీ పాల్గొనలేదు. సమ్మె యాక్షన్‌లో పాల్గొనాలని సాధారణ కార్మికులు ఆదుర్దాగా వున్నారు. తమ సంఘం నాయకత్వం నుండి పిలుపుకోసం ఎదురు చూస్తున్నారు. కొన్ని జోన్స్‌లో సమ్మెకు అనుకూలంగా తీర్మానాలు చేశారు. కొన్ని కేంద్రాలలో సమ్మెలో పాల్గొన్నారు కూడ. కాని అన్ని సంఘాలూ కలిపి ఐక్యంగా పిలుపు యిస్తే సమ్మె జయప్రదమౌతుంది; రైల్వే బోర్డు పునరాలోచన పడటానికి తోడ్పడుతుంది.

అయితే ప్రమాదం నెత్తిమీదికి ముంచుకవచ్చినా వందల వేల ఉద్యోగాలు రద్దు చేస్తున్నా రైల్వే కార్మిక సంఘాలు తాపీగా నిర్ణయాలు చేస్తున్నవి. ఇటీవల ఎ.ఐ.ఆర్.ఎఫ్. కౌన్సిల్ మద్రాసులో సమావేశమై సమ్మె బ్యాలట్ తీయాలని నిర్ణయించింది. పరిస్థితి తీవ్రతకు తగినట్లుగా, కార్మికుల ఆవేదనకు అనుగుణంగా నాయకత్వాలు స్పందించటంలేదు.

అంతే కాదు రైల్వేలోని అన్ని సంఘాలను ఒక త్రాటిమీదకు తెచ్చి ఐక్య కార్యాచరణకు ఏ సంఘము నుండి చొరవ కనిపించటంలేదు. అలాంటి చొరవ, పిలుపు మాత్రమే కార్మిక వర్గాన్ని ఉత్సాహపర్చగలుగుతుంది. దేశవ్యాపితంగా కార్మిక సంఘాలు జరుపుతున్న పోరాటంలో భాగస్వాములవగలుగుతారు.

మంత్రుల మాటలు

కనీస సౌకర్యాలతో ఒక్కో యిల్లు ప్రతి కుటుంబానికి కల్పించటం తన లక్ష్యం అని నూతన ముఖ్యమంత్రి అక్టోబరు 12వ తేదీన రేడియో ప్రసంగంలో చెప్పారు.

- ఊరికో బస్సు, ఇంటికో బల్బు, ఇంటికో ఉద్యోగం అని మురిపించి మాయచేసిన కాంగీ ముఖ్యమంత్రులు అవి అమలు చేయకుండానే గద్దె దిగిపోయారు.

## దెబ్బకు దెబ్బ

అమెరికానుండి చైనా చేసుకునే దిగుమతులపై ఆంక్షలను సడలించబడతాయనే నమ్మకం అక్టోబరునాటికి కలిగించకపోతే అమెరికాలోకి చైనా చేసే ఎగుమతులపై భారీగా దిగుమతి సుంకం విధిస్తామని ఇంతకు ముందు అమెరికా చైనాను బెదిరించింది.

అదే కనుక జరిగితే అమెరికా చేసే ఎగుమతులపై 4 వందల కోట్ల డాలర్ల సుంకాలు విధించాలని ఆ విధంగా దెబ్బకు దెబ్బ తీయాలని చైనా యోచిస్తున్నదని తెలుస్తున్నది.

## [illegible]

అమెరికా అమలు చేస్తున్న క్రూర దిగ్బంధనాన్ని తట్టుకొని ధైర్యంగా నిలబడిన క్యూబాకు భారత ప్రజలనుండి వసూలు చేసిన నిధులు లోగడ క్యూబా రాయబారికి హైదరాబాదులోను, మద్రాసునగరంలోను వివిధ ప్రజాసంస్థలు అందించినవి. పంజాబ్ రాష్ట్రం నుండి 70 వేల బస్తాల గోధుమలతో ప్రత్యేక రైలు బయలు దేరింది. పశ్చిమ బెంగాలు నుండి ఓడ ద్వారా మొత్తం 10 వేల టన్నులు క్యూబాను పంపబడుతవి. బర్నాలా స్టేషను నుండి బయలుదేరిన ప్రత్యేక రైలుకు సి.పి.ఎమ్. ప్రధాన కార్యదర్శి శ్రీ సుర్జీత్ పచ్చజెండా చూపారు. అచ్చట జరిగిన ఉత్సవంలో 5 వేలమంది ప్రజలు పాల్గొన్నారు. సామ్రాజ్యవాదుల మద్దతుతో ఉగ్రవాదులు పంజాబ్‌లో జరుపుతున్న విధ్వంసక చర్యలను, హత్యాకాండను ప్రతిఘటిస్తూనే పంజాబ్ రైతులు, కార్మికవర్గం క్యూబాకు సహాయం అందించి సామ్రాజ్య వ్యతిరేక కర్తవ్యాన్ని పాటిస్తున్నారు. క్యూబా ప్రజల పట్ల సంఘీభావాన్ని ప్రదర్శించారు.

# విద్యుత్ కార్మికుల సమ్మె

## నవంబరు 19వ తేదీ నుండి

- ఉద్యోగ భద్రత
- సమాన వేతనాలు
- అపరిష్కృత సమస్యలపై
- విద్యుత్ బోర్డు మొండి వైఖరికి నిరసనగా
- విద్యుత్ కార్మికుల రాష్ట్ర వ్యాప్త సమ్మెలో పాల్గొనండి

**యునైటెడ్ ఎలక్ట్రిసిటీ ఎంప్లాయీస్ యూనియన్**

**(సి.ఐ.టి.యు)**

# కనీస వేతనాలు, ఉద్యోగ భద్రత కోరుతూ ఉద్యమించిన కార్మికవర్గం

సి.ఐ.టి.యు. రాష్ట్ర కౌన్సిల్ పిలుపుపై రాష్ట్రంలో పలు కేంద్రాలలో వేలాది కార్మికులు కనీస వేతనాలు, ఉద్యోగభద్రత కోరుతూ అక్టోబరు 20న కార్మికశాఖ అధికారుల వద్దకు ప్రదర్శనలు, ధర్నాలు నిర్వహించారు. హైదరాబాద్ లో సచివాలయంవద్ద ధర్నా నిర్వహించి కార్మికశాఖ కార్యదర్శికి సి.ఐ.టి.యు. నగర ప్రతినిధి వర్గం మెమోరాండం సమర్పించింది. విజయవాడలో నగర సి.ఐ.టి.యు కమిటీ నిర్వహించిన ధర్నా పలు యూనియనల్ల నుండి వందలాది అసంఘటిత కార్మికులు పాల్గొన్నారు. తిరుపతిలో ధర్నాకు ముందు టి.టి.ఒ, బీడీ, ఫారెస్టు తదితర కార్మికులు పెద్ద ప్రదర్శన నిర్వహించారు. విశాఖలో జగదాంబ సెంటరు నుండి ప్రదర్శనగా వెళ్ళి ధర్నా నిర్వహించారు. గుంటూరులో జిల్లాలోని పలు కేంద్రాల నుండి ముఖ్యంగా పొన్నూరు నుండి లారీ కార్మికులు పాల్గొనడం జరిగింది. మిర్యాలగూడాలో వెయ్యిమందితో ఉత్తేజకరంగా ప్రదర్శన జరిగింది. నెల్లూరులో ధర్నా నిర్వహించి ఎ.సి.ఎల్ కు మెమోరాండం యిచ్చారు. ఇంకా పలు కేంద్రాలు మచిలీపట్నం, నల్లగొండ, భువనగిరి, రాజమండ్రి, ఖమ్మం, కర్నూలు, అనంతపురం తదితర కేంద్రాల్లో గూడా సి.ఐ.టి.యు. కమిటీల అధ్వర్యాన ధర్నాలు, ప్రదర్శనలు జరిగాయి. సి.ఐ.టి.యు. యూనియన్లు వందలాది కార్మికులను కదిలించాయి. ఈ ధర్నాలు, ప్రదర్శనలు, సభలు అన్నింటా సి.ఐ.టి.యు. నాయకులు పలువురు ప్రసంగిస్తూ రాష్ట్ర ప్రభుత్వం ముఖ్యంగా కార్మికశాఖ వైఫల్యాన్ని దుయ్యబట్టారు. నిర్ణయించిన కనీస వేతనాలు దరిద్రరేఖకు దిగువన అతి హీనంగా వున్నాయని, యింకా అనేక షెడ్యూలు పరిశ్రములలో కనీసవేతనాలు సవరించనే లేదని, సంవత్సరం, రెండు సంవత్సరాలు రాష్ట్ర ప్రపోజల్సు పెండింగులో వుంచి జాప్యం చేస్తున్నారని, వి.డి.ఎ. అసలు అమలుకే రాకుండా హైకోర్టు స్టే ఆర్డర్లతో కోట్ల రూపాయలు కార్మికులకు నష్టం జరిగిందని కార్మికశాఖ గాఢ నిద్రతో ఉద్యోగభద్రతే కరువై కనీస వేతనాలు అమలు జరుగటంలేదని, కనీస వేతనం రు. 1250/- కావాలని, వి.డి.ఎ. కావాలని, ఉద్యోగ భద్రత కావలని ఎలుగెత్తి కోరుతూ యీ ధర్నాలు, ప్రదర్శనలో వేలాది కార్మికులు రాష్ట్ర రాష్ట్రమంతటా డిమాండ్ చేశారు. కార్మికశాఖ కళ్ళు తెరుస్తుందా? కార్మికులు మరింతగా పోరాటాలకు సిద్ధం కావాలా? చూడాలి!

## ఖమ్మం

రాష్ట్రంలోని అసంఘటిత రంగంలోని అన్ని పరిశ్రమలలోను కనీస వేతనాలను నిర్ణయించి అమలు పర్చాలని వి.డి.ఎ. పై ఉన్న స్టేను ఉపసంహరించుటకు కృషి చేయాలని 1990 ఆగష్టులో తయారు చేసిన కనీస వేతనాల ముసాయిదాలను వెంటనే జి.ఓ. లు గా ప్రకటించాలని అసంఘటిత రంగంలోని కార్మికులకు చట్టభద్రత కల్పించాలని డిమాండ్ చేస్తూ ఈ రోజు రాష్ట్రవ్యాపిత ప్రదర్శనలలో భాగంగా ఖమ్మంలో సి.ఐ.టి.యు. నాయకత్వంలో ప్రదర్శన నిర్వహించి పై డిమాండ్లలో అసిస్టెంటు లేబరు కమీషనర్ గారికి విజ్ఞాపన పత్రం సమర్పించారు. స్థానిక గుమాస్తాల సంఘ భవనం నుండి బయలుదేరిన ప్రదర్శనకు పట్టణ సి.ఐ.టి.యు. నాయకులు సర్వశ్రీ పల్లా జాన్ రాములు, మాటూరు రామచంద్రరావు, రొండ్ల గోపాలరెడ్డి, మాటూరు లక్ష్మినారాయణ, ఎర్రా శ్రీకాంత్ లతోపాటు డి.వై.యఫ్.ఐ. అధ్యక్ష, కార్యదర్శులు మోటమర్రి జగన్ మోహన్ రావు, వజినేపల్లి శ్రీనివాసరావు, గుమాస్తాల సంఘ అధ్యక్ష కార్యదర్శులు, బండారు యాకయ్య, అనిశెట్టు అయిలయ్య సి.పి.యం. పట్టణ నాయకులు డి. కొండయ్యలు నాయకత్వం వహించారు.

## మిర్యాలగూడ

కనీస వేతనాల అమలుకై రాష్ట్రవ్యాప్తంగా కార్మికులు ఆందోళన చేయాలని సి.ఐ.టి.యు. రాష్ట్రకౌన్సిల్ ఇచ్చిన పిలుపులో భాగంగా ది. 20-10-92న మిర్యాలగూడలో వివిధ రంగాలలో పనిచేస్తున్న సంఘటిత కార్మికులు సి.ఐ.టి.యు. ఆధ్వర్యంలో ప్రదర్శన జరిపి లేబర్ ఆఫీసు వద్దకు చేరుకొని ధర్నా జరిపి లేబర్ ఆఫీసర్ గార్కి మెమోరాండం అందజేయడం జరిగింది.

**పారిశ్రామిక వినిమయ ధరల సూచీ**
**(1982 – 100 పాయింట్ల పునాదిపై)**

| | 1992 జూలై | 1992 ఆగస్టు | 1960-100 లింకింగ్ ఫ్యాక్టర్ |
|---|---|---|---|
| ఆలిండియా | 242 | 242 | 4.93 |
| గూడూరు | 234 | 241 | 4.33 |
| గుంటూరు | 245 | 246 | 5.60 |
| హైదరాబాద్ | 231 | 232 | 5.23 |
| విశాఖ | 243 | 243 | - |
| వరంగల్ | 239 | 246 | - |
| కొత్తగూడెం | 251 | 250 | - |
| **రాష్ట్ర సిరీస్** | | | |
| విజయనగరం | 220 | 224 | |
| రాజమండ్రి | 237 | 242 | |
| విజయవాడ | 238 | 239 | |
| ఆదోని | 260 | 263 | |
| ఎన్.ఎస్.బి | 247 | 249 | |
| ఎం.జి.బి. | 234 | 235 | |

"ఐ.యం.ఎఫ్. అప్పు – దేశానికి ముప్పు" నవంబరు 25న ఛలో ఢిల్లీ !

# సంధి యుగంలో ప్రపంచ కార్మిక సమాఖ్య

– డా. ఎం.కె. పాంథే
సి.ఐ.టి.యు ప్రధాన కార్యదర్శి

ప్రపంచ కార్మికోద్యమంలో అత్యంత ప్రాముఖ్యమైన, ప్రభావితమైన మార్పులు చోటు చేసుకుంటున్నాయి. కార్మిక సంఘాలు ఈ మార్పులను ఎలా అర్థం చేసుకుంటాయో, ప్రపంచవ్యాప్తంగా ఎదురయ్యే ఆ ప్రమాదాలను ఎదుర్కొనడానికి ఎటువంటి విధానాలను అనుసరిస్తాయో అనే అంశాలపై ప్రపంచ కార్మిక ఉద్యమం ప్రధానంగా ఆధారపడి ఉంటుంది.

సోవియట్ యూనియన్, తూర్పు యూరప్ దేశాలలో సోషలిజం నాశనం చేయబడటం వలన కార్మిక ఉద్యమం ఎంతగానో బలహీనపడింది. AUCCTU రద్దు చేయబడి, రెండు సంస్థలుగా చీలిపోయింది. అవి, ప్రపంచ కార్మిక సంఘాల సమాఖ్య (WFTU) తో పూర్తిగా సంబంధాలు తెంచేసుకున్న GCTU ఒకటి, మార్కెట్ ఆర్థిక వ్యవస్థను నమ్మిన స్వతంత్ర కార్మిక సంఘాల సమాఖ్య (CITU) మరొకటి. వివిధ రాష్ట్రాలలో అనేక స్వతంత్ర సంస్థలు ఏర్పడటం ద్వారా కార్మిక ఉద్యమం చీలికలు, పేలికలు చేయబడింది. కొన్ని కార్మిక సంఘాలు మాత్రం నూతన పెట్టుబడిదారీ నేతలచే తయారు చేయబడిన నూతన ఆర్థిక విధానాల యొక్క అసలు రంగు గమనించి, వాటిని ఎదుర్కొనడానికి, కార్మికుల ప్రయోజనాలను కాపాడుకోవడానికి పోరుబాట ఒక్కటే మార్గమని నిర్ణయించుకున్నాయి. పెరిగిపోతున్న ద్రవ్యోల్బణం, నిరుద్యోగం ఫలితంగా కార్మికుల జీవన ప్రమాణం అత్యంత దుర్భర పరిస్థితికి చేరుకొంది. ఈ పరిస్థితిని ఆసరాగా చేసుకొని, ICFTU తక్షణమే మాస్కోలో తన కార్యాలయాన్ని ఏర్పాటు చేసుకొంది. ICFTU తరపున ఒక అత్యున్నత ప్రతినిధి బృందం, కార్మిక సంఘాలతో తమ సంబంధాలను తిరిగి పునరుద్ధరించుకోవడానికి, కొన్ని రాష్ట్రాల్లో పర్యటించింది. తూర్పు యూరప్ దేశాలలోని పరిస్థితులు కూడ మరింత దిగజారిపోయాయి. ఈ దేశాలలోని అనేక కార్మిక సంఘాలు, పోలెండులో మినహాయించి, ప్రపంచ కార్మిక సంఘాల సమాఖ్యతో (WFTU) సంబంధాలను తెగతెంపులు చేసుకొన్నాయి. వీటిలో కొన్ని ICFTU తో అనుబంధాన్ని కోరుకున్నాయి.

## ప్రపంచ కార్మిక సంఘాల సమాఖ్య (WFTU) బలహీన పడటం

ఈ మార్పుల ఫలితంగా ప్రపంచ కార్మిక సంఘాల సమాఖ్య ఎంతగానో బలహీన పడిపోయింది. అది, ప్రేగ్‌లోని తన ప్రధాన కార్యాలయాన్ని ఖాళీచేసి మరొక చిన్న ప్రాంతానికి మార్చుకోవలసి వచ్చింది. ప్రధాన కార్యాలయంలో ఉద్యోగుల సంఖ్య గణనీయంగా తగ్గించబడి, కొద్దిమందితో మాత్రమే నడపవలసి వచ్చింది. నెలనెలా ప్రచురితమయ్యే "ప్రపంచ కార్మికోద్యమం" అనే పత్రిక ప్రచురణ ఆర్థిక పరమైన ఇబ్బందుల వలన పూర్తిగా నిలిపివేయబడితే, ఇతర పుస్తకాల ప్రచురణలన్నీ గణనీయంగా తగ్గించివేయబడ్డాయి. గతంలోని సోషలిస్టు దేశాలలోని కార్మిక సంఘాలే ప్రపంచకార్మిక సంఘాల సమాఖ్యకు ప్రధానంగా ఆర్థిక సహాయం చేస్తుండేవి. ఆ సంఘాలు సమాఖ్యనుండి తప్పుకోవడం అనేది సమాఖ్యను ఆర్థికంగా ఎంతగానో కృంగదీసింది. దాని ఫలితంగా సమాఖ్య తన కార్యక్రమాలను వికేంద్రీకరణ చేసి, ఆసియా, ఆఫ్రికా, యూరప్, లాటిన్ అమెరికా మొదలైన దేశాలలో తన ప్రాంతీయ కార్యాలయాలను ఏర్పాటు చేసుకొని, కార్యదర్శులు అక్కడినుండే పనిచేయవలసి వచ్చింది. ఆసియాలోని కార్యక్రమాలను సమీకృతం చేసేందుకు వీలుగా WFTU మనదేశ రాజధాని ఢిల్లీలో ఒక ఆఫీసును ప్రారంభించింది.

ప్రపంచ కార్మిక సంఘాల సమాఖ్యలో 13 అంతర్జాతీయ కార్మిక సంఘాలు సభ్యత్వం కల్గి ఉన్నా, వాటిలో అనేక సంఘాలు తీవ్రమైన ఆర్థిక ఇబ్బందులను ఎదుర్కొంటున్నాయి. కొన్ని సంఘాలు తమ కేంద్ర కార్యాలయాలను ఇతర ప్రాంతాలకు తరలించవలసివస్తే, మరికొన్ని పూర్తిగా నిస్తేజమై పోయాయి. వీటిలో కొన్నిటిని విలీనం చేయాలనే ప్రతిపాదన కూడ ఉంది.

చెకోస్లోవేకియాలోని అతివాద ప్రభుత్వ అణచివేత విధానాలు WFTU కేంద్రకార్యాలయం సవ్యంగా పనిచేయకుండా ఎన్నో అడ్డంకులు, సమస్యలు సృష్టించాయి. చెకోస్లోవేకియా వదలి వెళ్లిపోవలసినదిగా ప్రభుత్వం WFTU కు నోటీసులు జారీచేసింది. అయితే CITU తన మహాసభలో ఆ రకమైన నోటీసులు జారీ చేయడాన్ని తీవ్రంగా నిరసిస్తూ, ఆ నోటీసులను ఉపసంహరించుకోవలసినదిగా డిమాండు చేసింది. అయినప్పటికీ, చెకొస్లోవేకియా ప్రభుత్వం WFTU కార్యక్రమాలకు అడ్డంకుల్ని కల్పిస్తూనే ఉంది. ఆ ప్రభుత్వం యొక్క ఉత్తర్వులను WFTU కోర్టు ద్వారా సవాలు చేస్తోంది. కోర్టు నిర్ణయం కనుక WFTU కి వ్యతిరేకంగా ఉంటే, తన కేంద్ర కార్యాలయాన్ని తరలించడానికి మరొక ప్రత్యామ్నాయాన్ని వెతుక్కోవలసి వస్తుంది.

ఈ మధ్యనే WFTU సెక్రెటరీ జనరల్ అయిన కామ్రేడ్ అలగ్జాండర్ జరికోవ్ ఇండియా వచ్చినపుడు మన CITU ఆఫీసును సందర్శించడం జరిగింది. మేము ఆయనతో అంతర్జాతీయ పరిస్థితుల గురించి చర్చించాము. ఆయన WFTU ఎదుర్కొంటున్న అనేక ఆర్థికపరమైన సమస్యలను, ఇబ్బందులను గురించి వివరిస్తూ, వారికి సహాయ సహకారాలు అందించవలసినదిగా CITU ని కోరారు. CITU తరపున పూర్తి సహకారం అందించగలమని ఆయనకు హామీనిస్తూ, అంతర్జాతీయ విషయాలలో

WFTU మరింత ఖచ్చితమైన వైఖరిని అవలంబించవలసిన ఆవశ్యకత గురించి నొక్కి చెప్పడం జరిగింది. సామ్రాజ్యవాద వ్యతిరేక వైఖరిని WFTU మరింత ఖచ్చితంగా చేపడుతుందని, అనేక దేశాలలో జరుగుతున్న జాతీయోద్యమాలకు మద్దతునివ్వాలని CITU కోరుకొంటోంది. అంతేగాక, WFTU విజ్ఞప్తి తృతీయ ప్రపంచదేశాలలోనే ఎక్కువగా ఉంటుందని, ఆ దిశగానే WFTU తన కార్యక్రమాలను నిర్దేశించుకుంటుందని CITU భావిస్తోంది.

## ICFTU యొక్క నేరాలు

WFTU బలహీన పడటాన్ని ఆసరాగా తీసుకొని, ICFTU తన కార్యకలాపాలను పెంపొందించుకోవడానికి ఉపయోగించుకుంటోంది. WFTU అనే సంస్థ మరింక లేదని, అది తన ఉనికిని, అంతర్జాతీయ కార్మిక ఉద్యమంలో తన పాత్రను పూర్తిగా కోల్పోయిందని, ఆ సంస్థకు వ్యతిరేకంగా ICFTU ప్రచారం సాగిస్తోంది. సోషలిజానికి, విప్లవకర కార్మిక సంఘాలకు వ్యతిరేకంగా ఎంతో విస్తృతంగా ప్రచారం చేస్తోంది. తియాన్మెన్ ఘటనల తర్వాత చైనాలో మానవహక్కుల గురించి అంతర్జాతీయ కార్మిక సంస్థలో వివాదం లేవనెత్తడం ద్వారా పీపుల్స్ రిపబ్లిక్ ఆఫ్ చైనా పై ICFTU తన దాడులను కొనసాగిస్తోంది. చైనాలో సోషలిస్టు విధానాలకు వ్యతిరేకంగా జరుగుతున్న కుట్రలకు, అభివృద్ధి నిరోధకులకు, బహిరంగ మద్దతును ప్రకటిస్తోంది. వాళ్ల చేసే దుష్ప్రచారాలన్నిటికీ అఖిల చైనా కార్మికసంఘాల సమాఖ్య సరైన రీతిలో సమాధానాలు ఇచ్చినప్పటికీ, ఆ సోషలిస్టుదేశంపై ప్రచార దాడి నిర్విఘ్నంగా కొనసాగుతూనే ఉన్నది.

ఈ మధ్యకాలంలో, ఆఫ్రికాలోని 20 స్వతంత్ర కార్మిక సంఘాలు, లాటిన్ అమెరికాలోని అనేక కార్మిక కేంద్రాలు ICFTU లో సభ్యులుగా చేరినట్లు వార్తలు తెలియచేస్తున్నాయి. అంతర్జాతీయ కార్మికోద్యమానికి కేవలం తనొక్కటే నాయకత్వం వహించగలననే అభిప్రాయాన్ని కల్గించడానికి ICFTU తీవ్రంగా కృషి చేస్తోంది.

అంతర్జాతీయ కార్మిక సంస్థలోని (ILO) కార్మిక సంఘాలలో ఎక్కువ భాగం ICFTU కి అనుబంధమైనవే ఆధిపత్యం చెలాయిస్తున్నాయి. అలాగే ICFTU సంఘాలన్నిటిలో ప్రధానపాత్ర వహిస్తున్న పెట్టుబడిదారీ దేశాల కార్మిక సంఘ ప్రతినిధులు, ILO విధాన నిర్ణయాలను ప్రభావితం చేస్తున్నారు. అందువల్ల, సహజంగానే తృతీయ ప్రపంచ దేశాలలోని సమస్యలు ILO కార్యక్రమాలలో తగిన రీతిలో ప్రదర్శించబడటం లేదు.

ప్రపంచ వ్యాపితంగా అంతర్జాతీయ కార్మికోద్యమాన్ని నిర్మించడానికి, ICFTU లోని కమ్యూనిస్టు వ్యతిరేక భావాలు కల్గిన నాయకత్వం పెత్తందారీ ధోరణి, ఎంతో అవరోధం కల్పిస్తోంది. అన్ని తరగతుల కార్మిక వర్గాన్ని సంఘటితపరచి, ఐక్యంగా ఉద్యమింపచేసేందుకు అవసరమైన ఎన్నో రకాల సమస్యలు నేడు మన ముందున్నవి. శాంతి, నిరాయుధీకరణ, బహుళజాతి కంపెనీల పాత్ర, నిరుద్యోగం, అభివృద్ధికి సంబంధించిన సమస్యలు, నూతన శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానాన్ని పెంపొందించడం, నింగిని తాకే ద్రవ్యోల్బణం, మొదలైనవన్నీ అటువంటి సమస్యల్లో కొన్ని మాత్రమే. సిద్ధాంతపరమైన తేడాలు ఉన్నప్పటికీ ఇటువంటి సమస్యల విషయంలో ఐక్యత సాధించడం వీలవుతుంది. ప్రపంచవ్యాప్తంగా ఈ విషయాలపై చర్చ జరగడానికి, అందరికీ ఆమోదయోగ్యమైన నిర్ణయాలకు రావలసిన అవసరం ఎంతైనా ఉంది. ఈ విషయాలపై ఒక ప్రయత్నం జరిగి తీరాలి. అయితే, ICFTU నాయకత్వం యొక్క వైఖరి, ఈ దిశగా జరిగే ప్రయత్నాల అభివృద్ధికి ఆటంకంగా తయారవుతున్నది.

## ఐక్యతకు విఘాతం కల్గించే ధోరణి

1991 మధ్యలో ఉద్యోగము, అభివృద్ధి అనే అంశాలపై గాంగోవ్‌లో ACFTU చే నిర్వహించబడిన ఆసియా స్థాయి గోష్ఠి కార్యక్రమంలో, ICFTU యొక్క ఐక్యతా విచ్ఛిన్న ధోరణి స్పష్టంగా బయటపడింది. ఆ గోష్ఠి కార్యక్రమానికి ICFTU కి అనుబంధంగా ఉన్న సంఘాలను, సంస్థలను ఆహ్వానించినప్పటికీ, ఆ సంస్థ వారందరికీ, ఆ కార్యక్రమంలో పాల్గొనరాదని ఆదేశాలు జారీ చేసింది. అయినప్పటికీ, కార్మికవర్గం ఎదుర్కొంటున్న అనేక పరస్పర సమస్యల గురించి చర్చించేందుకు వాటిపై సమైక్యంగా పోరాడేందుకు ఉత్సుకతతో అనేక సంఘాలు (ICFTU అనుబంధమైనవి) ఈ గోష్ఠిలో పాల్గొన్నాయి. అందుకే, ఈ కార్యక్రమం జయప్రదమైన తీరుని చూసి అయినా ICFTU నాయకత్వం, ఐక్యత విషయంలో తన అభిప్రాయాలను, ధోరణులను పునఃపరిశీలించుకోవలసిన ఆవశ్యకత ఉందని ఈ కార్యక్రమం తెలియచేస్తోంది.

వివిధ రకాల అభిప్రాయాలు, భిన్నమైన అభిరుచులు కల్గిన అనేక కార్మికసంఘాల మధ్య సయోధ్యని కుదిర్చి, వారందరికీ ఆమోదయోగ్యమైన ఒక పరిష్కార మార్గాన్ని అన్వేషించే కృషిలో, ఆస్ట్రేలియన్ కార్మిక సంఘాల కౌన్సిలు, హిందూ మహాసముద్ర ప్రాంతంలో డిశంబర్ 1వ తేదీన పెర్త్‌లో జరుపతలపెట్టిన మహాసభకు అన్ని అనుబంధ సంఘాలను ఆహ్వానించడం అనే విషయం కార్మిక సంఘాల ఐక్యతకు జరుగుతున్న కృషిలో ఒక ప్రధానమైన భాగమనే చెప్పాలి. కార్మికోద్యమం ఎదుర్కొంటున్న అనేక సమస్యలపై పరస్పరం అభిప్రాయాలను తెలియచేసుకోవడానికి (కార్మిక సంఘాలకు) ఇటువంటి సందర్భాలు అవకాశాలను కల్పిస్తాయి. ఒక్కసారి సమావేశమైనంత మాత్రానే సమస్యలన్నీ పరిష్కరించబడకపోయినా, ఇటువంటి సమావేశాలు తరచుగా జరగడం వలన పరస్పరం అభిప్రాయాలను తెలుసుకోవడానికి, అవగాహనను పెంచుకోవడానికి, తద్వారా ముందుముందు సమైక్య కృషి, ఐక్య ఉద్యమాల దిశగా ముందుకు సాగేందుకు అవసరమైన వాతావరణం కల్పించబడుతుంది. జాతీయస్థాయిలో జరిగిన ఐక్య ఉద్యమాలలో ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలలోని ICFTU కి అనుబంధమైన అనేక కార్మిక సంఘాలు పాల్గొంటున్నాయి. అంతేగాక, కార్మికవర్గం యొక్క ఐక్యత అవసరాన్ని ఎంతగానో అర్థం చేసుకున్న భావం వారిలో స్పష్టంగా గోచరించింది.

ప్రపంచ వ్యాప్తంగా అంతర్జాతీయ కార్మిక సంఘాల ఐక్యతను సాధించడంలో అభివృద్ధి చెందుతున్న దేశాలలోని కార్మిక సంఘాలు ఎంతో అనుకూలమైన, ఖచ్చితమైన వాతావరణాన్ని కల్గించగల అవకాశం కూడ ఉంది.

కార్మికోద్యమంలో ఐక్యతను వ్యతిరేకించే శక్తులు తమ అభిప్రాయాల్ని, వాదనలను సమర్థించుకొనే స్థితిలో లేవు. అందువల్లనే కార్మికుల దృష్టిని మరల్చడానికి, తప్పుదోవ పట్టించడానికి తద్వారా ఐక్యతను మరింత ఆలశ్యం చేయడానికి వారు అనేక అభ్యంతరాలను ముందుకు తెస్తున్నారు. భవిష్యత్ లో ఇటువంటి ధోరణులన్నీ ఎదురుదెబ్బ తినక తప్పదు, ఐక్యతకోసం కార్మికుల్లో ప్రస్తుతం కొనసాగుతున్న వాంఛ నెరవేరక తప్పదు.

## పెట్టుబడిదారీ కార్మిక సంఘాల పతనం

పశ్చిమాన ఉన్న పెట్టుబడిదారీ దేశాలలోని కార్మికోద్యమాలు నేడు ఒక కొత్త తరహా పరిస్థితిని ఎదుర్కొంటున్నాయి. ఈమధ్య విడుదలైన OECD రిపోర్టు ప్రకారం ఒక్క స్వీడన్ మినహా మిగిలిన యూరోపు దేశాలన్నిటిలో కార్మిక సంఘాల సభ్యత్వం తగ్గిపోయింది. దీనికి చెప్పబడిన అనేక కారణాలలో ఒకటి నూతన సాంకేతిక పరిజ్ఞానం ప్రవేశపెట్టడం ద్వారా అనేకమంది కార్మికులు ఉద్యోగాల నుంచి తొలగించబడటం, కార్మికశక్తి తగ్గించబడటం. ఆ రిపోర్టులోని అంశాలు సూచించిన విధంగా అయితే – ఉత్పత్తి రంగంలో ఉద్యోగాలు తగ్గించి వేయబడితే, సేవలు, అనుత్పాదక రంగాలలో ఉద్యోగావకాశాలు కొద్దిగా మెరుగుపరచబడ్డాయి. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలన్నిటిలో తీవ్రమైన ఆర్థిక మాంద్యం ఏర్పడటం వలన, నిరుద్యోగులయ్యే వారి సంఖ్య బ్రహ్మాండంగా పెరిగిపోవడం కూడ నిరుద్యోగ సైన్యం సంఖ్య పెరగడానికి, మొత్తం మీద శ్రామికశక్తి గణనీయంగా తగ్గిపోవడానికి కారణమౌతోంది. బ్రిటిష్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌లోని సభ్యుల సంఖ్య దాదాపు పది లక్షల వరకు తగ్గిపోయింది, ఆర్థిక సమస్యల ఫలితంగా ఆ యూనియన్ తన నెలసరి బులెటిన్ ప్రచురణను కూడ నిలిపివేసుకోవలసి వచ్చింది. సభ్యుల సంఖ్య తగ్గిపోవడంతో కొన్ని యూనియన్లు ఇతర యూనియన్లలో విలీనం చేసుకోవడం జరిగింది.

అమెరికాలో అధికారిక లెక్కల ప్రకారం, అక్కడి కార్మిక సంఘాలలో సభ్యుల సంఖ్య అత్యంత తక్కువగా 16 శాతానికి చేరుకొంటే, ఆ దేశంలోని AFL - CIO నాయకత్వాలు తమ వర్గ ప్రయోజనాల కోసం మిలాఖత్ అవుతూ, మొత్తం కార్మికవర్గం నుండి వేరుచేయబడ్డారు. గత దశాబ్దంలో అమెరికా కార్మికులలో యూనియన్లలో చేరే వారి సంఖ్య, మొత్తం కార్మికులలో దాదాపు 31 శాతం దాకా ఉండేది.

అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో, విలాసవంతమైన యూనియన్ల నాయకత్వాలువారి గుత్త పెట్టుబడిదారీ యజమానులతో నూతన శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానాన్ని, కంప్యూటర్లను ప్రవేశపెట్టడం వలన కార్మికుల సంఖ్యను గణనీయంగా తగ్గించి వేయడానికి ఆమోదిస్తూ అగ్రిమెంట్లను చేసుకున్నారు. ఆ విధంగా కార్మికవర్గం వంచనకు గురయ్యింది. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలోని కార్మికవర్గం తమ తమ యూనియన్ నాయకత్వాలపై నమ్మకాన్ని వదులుకోవడానికి ఇది కూడ ఒక కారణమే.

## ముందుకొస్తున్న పోరాటాలు

ఏది ఏమైనా, అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలోని కార్మికవర్గం పోరాట మార్గాన్నే అనుసరిస్తున్నారు. చాలకాలం కొనసాగిన జర్మనీలో ప్రభుత్వరంగ కార్మికుల సమ్మె నూటికి నూరుశాతం సఫలమవడమే కాకుండా, చివరకు జర్మనీ ప్రభుత్వం తమ డిమాండ్లను ఆమోదించేట్లు ఒత్తిడి చేయడంలో కూడ విజయం సాధించింది.

ఈమధ్యనే జరిగిన బ్రిటిష్ బొగ్గుగని కార్మికుల సమ్మె, అత్యంత భారీగా ఆ కార్మికులచే లండన్‌లో నిర్వహించబడిన ప్రదర్శన, జాన్‌మేజర్ ప్రభుత్వాన్ని ఇరకాటంలో పడవేశాయి. జపాన్‌లో కూడ అనేక మెరుపు సమ్మెలు, పోరాటాలు నిర్వహించబడుతున్నాయి. జపాన్ ట్రేడ్ యూనియన్ కాన్ఫెడరేషన్ (రెంగో) నాయకత్వం, యాజమాన్యాలతో చేసుకున్న కార్మిక వ్యతిరేక ఒప్పందాలకు, రిట్రెంచ్‌మెంటు, సంస్థల మూసివేత విధానాలకు వ్యతిరేకంగా జపాన్ కార్మికవర్గం పై పోరాటాలను కొనసాగిస్తోంది. క్రమేపి, విశ్రాంతిలేని పని చేయడం వలన మరణించేవారి సంఖ్య పెరుగుతూ ఉండటంతో, అది ప్రస్తుతం సంవత్సరానికి 10,000 దాకా చేరడంతో, జపాన్ కార్మికులు తీవ్రమైన వ్యతిరేకత తెలియచేస్తున్నారు.

అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో, పని పరిస్థితులు క్రమేపీ క్షీణిస్తుండటం వలన అనేక అనారోగ్య పరిస్థితులు ఏర్పడుతున్నాయి. అమెరికాలోని ఆహార, వాణిజ్య రంగాల కార్మికుల భద్రతా డైరక్టరు, కార్మికులలో తరచు కలుగుతున్న అనారోగ్య పరిస్థితుల పట్ల తక్షణం తీసుకోవలసిన జాగ్రత్తలు గురించి, వాటి ప్రాముఖ్యతను గురించి నొక్కి చెప్పడం జరిగింది. ఆమె మాటలలో చెప్పాలంటే "గత కొద్ది సంవత్సరాలుగా కార్మికుల అనారోగ్య కారణాలు విపరీతంగా పెరిగిపోతుండటం గమనిస్తే చాల భయానకంగా ఉన్నది. గత రెండు సంవత్సరాలలోనే ఈరకమైన వ్యాధుల బారినపడే వారి సంఖ్య రెట్టింపు అయింది, గత దశాబ్దంతో పోల్చుకుంటే 550 శాతం కంటె ఎక్కువగా పెరిగిపోయింది". కార్మిక సంఘాల నాయకులు నిరాకరించినా, ఇంతటి ఘోరమైన పరిస్థితులకు వ్యతిరేకంగా, కారికులందరూ ఉద్యమించి తమ నిరసనను తెలియచేస్తూ, ప్రతిఘటనకు పూనుకున్నారు.

మాస్ట్రిక్ట్ ఒప్పందానికి వ్యతిరేకంగా ఫ్రాన్స్‌లోని CGT ప్రారంభించిన ప్రచార ఉద్యమం, ఫ్రెంచి కార్మికుల పూర్తి మద్దతు పొందడమేగాక ఆ విషయంపై రిఫరెండం జరగడానికి కూడ ఒక ప్రధాన పాత్ర వహించింది. డెన్మార్క్‌లోని వామపక్ష కార్మిక సంఘం, ఈ ఒప్పందానికి వ్యతిరేకంగా తీవ్రంగా ప్రచారం చేయడంతో, రిఫరెండంలో ఆ ఒప్పందానికి వ్యతిరేకంగా పెద్ద సంఖ్యలో ఓట్లు పడేట్లు చేయడానికి దోహదపడింది.

గత సోవియట్ యూనియన్‌లోను, తూర్పు యూరప్ దేశాలలోని కార్మికవర్గం అక్కడ నూతనంగా ఏర్పడిన పెట్టుబడిదారీ పరిపాలన యొక్క అసలు రంగును తెలుసుకోవడమేగాక, ఆ ప్రభుత్వాలు చేపడుతున్న కార్మిక వ్యతిరేక చర్యలను, విధానాలను ఎదిరిస్తూ ఉద్యమించడంలో భాగస్వాములవుతున్నారు.

ఈమధ్యనే ఉక్రెయిన్‌లో పది లక్షల పైగా కార్మికులందరూ కలసి, ఒక బలమైన సంఘాన్ని ఏర్పాటు చేసుకోవడమేగాక, గని కార్మికుల సమస్యలపై

అనేక పోరాటాలు నిర్వహిస్తూ, బాహాటంగా ప్రభుత్వ విధానాలను వ్యతిరేకిస్తూ ఉద్యమిస్తున్నారు. గత సోవియట్ యూనియన్‌లోని ఇతర రాష్ట్రాలలో కూడ క్రమేపి విప్లవకర కార్మికసంఘాలు ఏర్పడటమే కాకుండా, వారిలో కొందరు WFTU తో సన్నిహిత సంబంధాలు ఉండాలని కూడ కోరుకుంటున్నారు.

పోలెండులో దుర్మార్గమైన సాలిడారిటీ యూనియన్, క్రమేపి కార్మికవర్గంలో పలుకుబడిని కోల్పోయి, అవహేళనకు గురవుతుండగా కార్మికులందరూ సెంట్రల్ కౌన్సిల్ ఆఫ్ పోలెండ్ ట్రేడ్‌యూనియన్స్ నాయకత్వంలో జరిగే పోరాటాలలో పాల్గొనడానికి సంసిద్ధులై ముందుకు వస్తున్నారు. చెకొస్లొవేకియా, హంగరీ, రుమేనియా, మరియు బల్గేరియాలలో ప్రభుత్వాల పెట్టుబడిదారీ విధానాలను నిరసిస్తూ కార్మిక సంఘాలన్నీ కదలిరావడమే కాకుండా, క్రమేపి ఒక బలమైన శక్తిగా రూపొందడానికి తగిన పరిస్థితుల నేర్పరచుకుంటున్నారు.

తూర్పు యూరప్ దేశాలలో సోషలిజం విఫలమైందని ప్రచారం చేసినవారే, ఆయా దేశాల్లో పెట్టుబడిదారీ విధానం కూడ విజయవంతం కాలేదని ఇప్పుడు ఒప్పుకుంటున్నారు.

చైనా, క్యూబా, వియత్నాం మరియు ఉత్తర కొరియాలలోని కార్మికోద్యమం సోషలిజం నిర్మాణానికి తమ తిరుగులేని, దృఢమైన నిర్ణయాలను తెలియచేయడం ద్వారా ప్రపంచవ్యాపితంగా ఉన్న కార్మిక వర్గానికి ఎంతో స్ఫూర్తిని కలుగచేయడంలో ప్రధానపాత్ర వహిస్తున్నాయి. దక్షిణ ఆఫ్రికాలోని వీరోచితమైన కార్మికవర్గం, COSATU నాయకత్వంలో, జాతి వివక్ష విధానానికి వ్యతిరేకంగా ఎన్నో విప్లవాత్మక పోరాటాలను నిర్వహించడమే కాకుండా, తాము విజయం సాధించేవరకు తమ పోరాటాన్ని కొనసాగిస్తామని దృఢమైన దీక్ష తీసుకున్నారు. పాలస్తీనా, ఇరాక్‌లలో కూడ కార్మికవర్గం ఎన్నో ఇబ్బందులు ఎదురయినప్పటికీ, సామ్రాజ్యవాద వ్యవస్థకు వ్యతిరేకంగా తమ పోరాటాలను కొనసాగిస్తూనే ఉన్నారు.

దక్షిణ కొరియాలోని కార్మికవర్గం, అక్కడి నియంతృత్వ పరిపాలనకు వ్యతిరేకంగా ఈమధ్య ఎన్నో యుద్ధాలు చేశారు. తమ మాతృదేశం సమైక్యంగా ఉండవలసిన ఆవశ్యకత గురించి మరింతగా తెలుసుకొని, చైతన్యవంతులవుతున్నారు. దక్షిణ కొరియాలోని కార్మిక సంఘాలు, ఉత్తర కొరియాలోని తమ సహచరులతో సత్సంబంధాలు నెలకొల్పుకోవడం, ప్రస్తుతం ఉన్న పరిస్థితులలో ఒక అనుకూలమైన మార్పు.

నేపాల్‌లో, ప్రజాస్వామ్యం ఏర్పడిన తర్వాత కార్మికోద్యమం ఒక శక్తిగా తయారయి, కార్మికవర్గం యొక్క ప్రయోజనాల కొరకు ఒత్తిడి తీసుకు వస్తున్నాయి.

యూరప్ ఖండంలో సోషలిజానికి తగిలిన ఎదురుదెబ్బ వల్ల, తృతీయ ప్రపంచదేశాలపై సామ్రాజ్యవాదుల దాడులు అధికం చేస్తున్నారు. దానివల్ల, ఆ దేశాలలో కార్మికుల, కార్మిక సంఘాల హక్కులపై దాడులు ప్రారంభమౌతున్నాయి. ఈ దేశాలలోని కార్మికోద్యమాలు, తమ హక్కుల పరిరక్షణ కోసం పెద్ద ఎత్తున పోరాటాలలో పాల్గొంటున్నారు.

విప్లవకర కార్మికోద్యమం మరణించిందని కలలు కన్న వాళ్లే ఇప్పుడు విచారిస్తున్నారు. వర్గ పోరాటాలు నిర్వహించడానికి, ముందుకు తీసుకు వెళ్లడానికి, మరింత దీక్షతో, పట్టుదలతో, నిశ్చయంతో కృషి చేయడానికి మరెందరో కొత్తవాళ్లు మున్ముందుకు వస్తున్నారు.

## ముందుకొస్తున్న నూతన ఆలోచన

ప్రపంచ వ్యాపితంగా కార్మికవర్గం ఎప్పుడైతే "అక్టోబరు విప్లవ దినోత్సవం" జరుపుకుంటుందో, ఆనాడే వాళ్ళు సోషలిజం సిద్ధాంతాన్ని అజేయమని, సామ్రాజ్యవాదం ఓటమి తప్పదని మరోసారి కృత నిశ్చయంతో చాటి చెప్పాలి.

తూర్పు యూరప్ దేశాలలో ఎదురుదెబ్బలు తగిలినా, కార్మికోద్యమం తిరిగి తన శక్తి యుక్తుల్ని పోగుచేసుకొంటోంది. ఐక్యతను వ్యతిరేకించే శక్తులు ఎంతగా ప్రయత్నించినా, విప్లవాత్మక శక్తుల ఐక్యత కావాలనే ఆకాంక్ష రోజు రోజుకీ పెరిగిపోతోంది. నేడో, రేపో కార్మికోద్యమంలో మరొక నూతన ఒరవడి రాక తప్పదు, ప్రపంచ వ్యాప్తంగా కార్మిక వర్గ ఐక్యతాభావం మరింతగా పెరగక తప్పదు.

ద్రవ్యోల్బణం, ధరల పెరుగుదల సమస్య, బహుళజాతి కంపెనీల పాత్ర, తృతీయ ప్రపంచదేశాల ఆర్థిక వ్యవస్థలపై వారి ఆధిపత్యం కోసం వాళ్లుచేసే ప్రయత్నాలు, నూతన సాంకేతిక పరిజ్ఞానం ప్రవేశపెట్టడం, విపరీతంగా పెరిగిపోతున్న నిరుద్యోగం, కార్మికసంఘాల, ప్రజాస్వామ్య హక్కులపై దాడి, ప్రపంచాధిపత్యం కోసం సామ్రాజ్యవాదుల కుతంత్రాలకు వ్యతిరేకంగా జరిగే పోరాటాలు, పెట్టుబడిదారీ దేశాల ఆర్థిక వ్యవస్థలో పెరిగిపోతున్న ఆయుధపోటీ, నిరాయుధీకరణ కోసం జరిగే పోరాటాలు, మరియు శాంతి కొరకు తపన వంటి కొన్ని విషయాలమీద రాబోయే కొద్ది కాలంలో కార్మికవర్గం అంతర్జాతీయంగా ఏకమై కృషి చేసే పరిస్థితి రావచ్చు.

భారతదేశంలోని కార్మికవర్గం జరుపుతున్న అసంఖ్యాక పోరాటాలన్నీ, ప్రపంచవ్యాప్తంగా కార్మికవర్గ ఐక్యత కోసం జరిగే పరిణామాలలోని భాగమనే విషయం తెలుసుకోవాలి. అభివృద్ధి నిరోధకులు చేసే దాడులన్నీ, దుర్మార్గాలన్నీ కార్మికవర్గం జరిపే ఐక్య పోరాటాలపై దెబ్బ తీసేవిగానే కనబడుతున్నాయి.

ఈ సంవత్సరం నవంబర్ 7వ తేదీన, అక్టోబర్ విప్లవ మహత్తర విజయాలను మననం చేసుకొనే సందర్భంలోనే, ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలో కార్మికోద్యమాలలో ఏర్పడుతున్న నూతన పరిస్థితుల గురించి కూడ భారతదేశంలోని కార్మికవర్గం ఆలోచించవలసి ఉంది. వర్గ పోరాటాలపై ఆధారపడి, స్వయం పరిపూర్ణత కోసం, సామ్రాజ్యవాద వ్యతిరేకతతో శాంతి కొరకు జరిగే పోరాటంలో మన కృషిని రెండింతలు పెంచుతామని, కార్మికవర్గ ఐక్య పోరాటాలకు మద్దతునిస్తామని మనం ప్రతిజ్ఞ తీసుకుందాం. దీనివలన, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా, సోషలిజం కోసం ప్రపంచవ్యాప్తంగా జరిగే పోరాటంలో అంతర్జాతీయ అవగాహనను పెంపొందించడానికి భారతదేశంలోని కార్మికవర్గం తన సముచితమైన పాత్ర నిర్వహించినట్లు అవుతుంది.

# అక్టోబరు మహా విప్లవం – దోపిడి అంతానికై ప్రతిజ్ఞ

పి.కె. గంగూలి
కార్యదర్శి, సి.ఐ.టి.యు.

అక్టోబరు విప్లవం పదవ వార్షికోత్సవం సందర్భంగా మాట్లాడుతూ స్టాలిన్ ఇలా అన్నారు. "గత కాలంలోని విప్లవాలు సాధారణంగా ఒక దోపిడిదారుని నుండి వేరొక దోపిడిదారునికి అధికారం బదలాయించేవిగా ఉండేవి. దోపిడిదారులు మారినా దోపిడి అంతం కాలేదు. ఇదే పరిస్థితి బానిసల – ఉద్యమాలలోను సేవకుల తిరుగుబాటులలోను ఉండేది. అదే విధంగా ఇంగ్లండులోని మహా విప్లవం (ఫ్రాన్స్), జర్మనీలలోని విప్లవాలు ఈ కోవకు చెందినవే. అక్టోబరు విప్లవం సిద్ధాంతపరంగా వీటినుండి భిన్నమైనది, ఒక దోపిడి పద్ధతినుండి వేరొక దోపిడి పద్ధతి, ఒక దోపిడిదారుని నుండి వేరొక దోపిడిదారునికి మార్చే ధ్యేయంతో కాక, మనిషిని మనిషి చేసే దోపిడిని అంతమొందించేందుకు, దోపిడి దారులను నిర్మూలించేందుకు ఆ విప్లవం బాట వేసింది.

పైన చెప్పిన స్టాలిన్ మాటలు నేటి అక్టోబరు విప్లవం డెబ్బయ్ అయిదవ వార్షికోత్సవం సందర్భంగా కూడ వర్తిస్తాయి. సోషలిజం దెబ్బతిని, లెనిన్ మహాశయుని మహాభూమి, అక్టోబరు విప్లవం అందించిన కానుక అయినట్టి సోవియట్ యూనియన్ ముక్కలైనప్పటికి పై మాటలు నేటికి వర్తిస్తాయి.

అక్టోబరు విప్లవం ఒక క్రొత్త వర్గరహిత సమాజాన్ని స్థాపించింది. సోషలిజం నిర్మాణానికి అభివృద్ధికి అతి కీలకమైన కార్మిక, కర్షక ఐక్యత పునాదిపై ప్రపంచ చరిత్రలో మొదటిసారిగా కార్మికవర్గం రాజ్యాధికారాన్ని సాధించి, శ్రామికవర్గ నియంతృత్వాన్ని స్థాపించుకోగలిగింది. పెట్టుబడిదారీ వర్గం నుంచి అధికారాన్ని హస్తగతం చేసికొంది, వారి రాజకీయ హక్కుల్ని తొలగించింది, పెట్టుబడిదారీ రాజ్యాంగ యంత్రాన్ని నాశనం చేసింది. ఉత్పత్తి సాధనలను భూస్వాములనుంచి, పెట్టుబడివారులనుంచి తొలగించి వాటిని సంఘపరం చేయడం జరిగింది. వరుసగా ఈ విజయాలన్నింటికి కారణం కార్మికవర్గం, రాజ్యాంగం, శాస్త్రీయమైన మార్క్సిజం, లెనినిజం సూత్రాలను పాటిస్తూ ఆ సూత్రాలకు కట్టుబడిన కమ్యూనిస్టు నేతృత్వంలో పనిచేయడం.

అక్టోబరు విప్లవంలో మహత్తరమైన విశేషం ఏమంటే అది ప్రపంచ సామ్రాజ్యవాదానికే గండికొట్టింది. అది ప్రపంచవ్యాప్తంగా కార్మికవర్గంలో ఒక నూతనోత్సాహాన్ని కలిగించింది. వలసదేశాల్లోను పరతంత్ర దేశాల్లోను సామ్రాజ్యవాద అధికారాన్ని బలహీనపరిచింది. ప్రపంచ పెట్టుబడిదారి విధానాన్నే సంక్షోభంలో నెట్టింది. మానవ చరిత్రలోనే ఇది ఒక మలుపు. కార్మిక వర్గం మొదటిసారిగా పెట్టుబడిదారి విధానాన్ని అంతంచేసే చారిత్రాత్మకమైన శాస్త్రీయమైన శ్రామికవర్గ పయనానికి పునాదివేసింది. ఈ కారణంగా కార్మికవర్గం, పీడితజనావళి ఆ మహత్తర విప్లవాన్నే తమ శపథంగా తీసికొని ప్రపంచవ్యాప్తంగా దోపిడిని అంతం చేయబూనుకొన్నాయి. దేశాల మధ్య శాంతిని కోరుతూ, యుద్ధాన్ని నిరాకరిస్తూ, ఒక దేశం మరొక దేశాన్ని అక్రమంగా బానిసచేసే పద్ధతికి స్వస్తి చెప్పడం వంటి సూత్రాలు సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా శాంతి చేకూర్చేందుకు జరిగే సంఘర్షణలో బలమైన కారణాలుగా ఆవిర్భవించాయి. అంతేకాక జాతి విముక్తి పోరాటాలలోను, సోవియట్ యూనియన్‌లో సోషలిజం అభివృద్ధిలోను ఈ సూత్రాలే ముందు నిలిచాయి.

లెనిన్ మరణం తరువాత ఆయన ప్రతిపాదించిన సూత్రాలను, ఆ సూత్రాలలోని సామ్రాజ్యవాద వ్యతిరేక పునాదులను స్టాలిన్ నిల్పి ఉంచాడు. శైశవదశలోని సోషలిస్టు రాజ్యాన్ని సామ్రాజ్యవాదుల దాడి నుండి కాపాడటంలో కార్మికవర్గాన్ని, ప్రజలను ఆయన ముందుండి నడిపించాడు.

సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడుతూనే, కార్మికవర్గం అక్టోబరు విప్లవపు ముఖ్య సూత్రమైనట్టి శ్రామికవర్గ నియంతృత్వాన్ని సోషలిస్టు సమాజ నిర్మాణానికి వినియోగించి మంచి ఫలితాలను సాధించింది. 1930 దశకంలో మొత్తం పెట్టుబడి దారీ ప్రపంచమంతా ఆర్థిక మాంద్యంతో కొట్టుమిట్టాడుతూ ఉంటే, ఒక సోవియట్ యూనియన్ మాత్రమే రికార్డు స్థాయిలో అభివృద్ధిని సాధించి ప్రజలకు సౌకర్యాలు కల్పించింది. నిరుద్యోగాన్ని నిర్మూలించి పనిచేసే హక్కును రాజ్యాంగంలో పొందుపరిచిన మొదటిదేశం సోవియట్ యూనియన్ దున్నేవానికి భూమిని అందచేసింది. [illegible] వైద్యం, గృహ సదుపాయాలను కల్పించి [illegible] వస్తువుల ధరలను స్థిరీకరించింది. ప్రపంచ వ్యాప్తంగా కార్మికవర్గం పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా జరిపే పోరాటాలకు సోవియట్ యూనియన్ సాధించిన విజయాలు స్ఫూర్తినిచ్చాయి.

స్టాలిన్ నాయకత్వంలో ఫాసిజమ్ పై సోవియట్ ప్రజలు సాధించిన మహత్తర విజయం అనేక సోషలిస్టు దేశాల ఆవిర్భావానికి, భారతదేశంతో సహా అనేక దేశాలలోని జాతి విముక్తి పోరాటాల విజయానికి దోహదం చేసింది. ప్రపంచంలోని 3వ వంతు సోషలిజం క్రింద చేరింది. లక్షలాదిమంది ప్రజలు సామ్రాజ్యవాద పీడననుండి విముక్తులైనారు. వర్గశక్తుల పొందిక కార్మికవర్గానికి అనుకూలంగా మారింది.

రెండవ ప్రపంచయుద్ధం సందర్భంగా 2 కోట్ల మంది సోవియట్ ప్రజలు ఫాసిజమ్‌ను ఓడించడానికై తమ ప్రాణాలనర్పించారు. వ్యవసాయం, పరిశ్రమలలోని సగభాగం నాశనమైనవి. అయితే, సోవియట్ యూనియన్ అందరినీ ఆశ్చర్యపరిచే విధంగా అచిరకాలంలోనే మరల కోలుకొని అమెరికన్ సామ్రాజ్యవాదాన్ని నిలవరించగలిగిన ప్రపంచశక్తిగా ఆవిర్భవించింది. మార్క్సిజమ్ – లెనినిజమ్ సిద్ధాంతాలకు కట్టుబడి అక్టోబరు విప్లవ పాఠాల ఆధారంగా కార్మికవర్గం, ప్రజానీకం ఐక్యంగా నిలబడి సామ్రాజ్యవాద

కుతంత్రాలకు రియాక్షనరీ, రివిజనిస్ట్ పోకడలకు వ్యతిరేకంగా పోరాటం సాగించిన కారణంగానే ఇది సాధ్యమైంది.

మార్క్సిజం మూలసూత్రాలను అశాస్త్రీయంగా మార్చు చేసే రివిజనిజమ్‌కి వ్యతిరేకంగా, లెనిన్ విప్లవ పోరాటాన్ని నడిపిస్తున్న సందర్భంగానే అవిశ్రాంత పోరాటం జరిపారు. మార్క్సిస్ట్ - లెనినిస్టు సూత్రాల పరిరక్షణకై స్టాలిన్ ఈ పోరాటాన్ని కొనసాగించాడు. ట్రాట్‌స్కీ, అతని అనుయాయులూ అవలంబించిన అవకాశవాదాన్ని వీరు ఎండగట్టారు. సోషల్ డెమోక్రాటిక్ పార్టీలు, వాటి కార్యకలాపాలను వీరు బహిర్గతం చేసారు. పెట్టుబడిదారీ దశనుండి సోషలిస్టు దశకు పోయే మార్గంలో శ్రామికవర్గ నియంతృత్వపు అవసరాన్ని, కమ్యూనిస్టుపార్టీ నాయకత్వ పాత్రను వీరు సమర్థించి, రివిజనిస్టులను ఏకాకులను చేసారు. సామ్రాజ్యవాదులకు అనుకూలించే రివిజనిస్టు సిద్ధాంతాల ప్రమాదాన్ని, అంతర్గతంగా పెట్టుబడిదారీ సమాజాన్ని పునఃస్థాపించే రియాక్షనరీల గూర్చి వీరు హెచ్చరిస్తూ వచ్చారు. కాట్‌స్కీ తదితరుల చర్యలను ఎండగడుతూ, శ్రామికవర్గ విప్లవాన్ని పరిరక్షించుకుంటున్న తరుణంలో లెనిన్ ఇలా అన్నారు. "పెట్టుబడిదారీ దశనుండి కమ్యూనిస్టు దశకు మారుతున్న సమయం ఒక క్రొత్త చారిత్రిక యుగాన్ని సంతరించుకుంటుంది. ఈ యుగం పూర్తయ్యేవరకు, దోపిడీదారులు తమ కనుకూలమైన సమాజానికై ఆశిస్తూనే వుంటారు ఈ ఆశతో పెట్టుబడిదారీ సమాజానికై తిరిగి ప్రయత్నాలు చేస్తారు." అదే విధంగా శ్రామికవర్గం నియంతృత్వాన్ని గూర్చి కూడా లెనిన్ అన్నదేమంటే "శ్రామికవర్గ నియంతృత్వపు కాలంలో కూడా వర్గాలు ఉంటాయి. వర్గాలు అంతమైనపుడు శ్రామికవర్గ నియంతృత్వపు అవసరం ఉండదు. అదే సమయంలో శ్రామికవర్గపు నియంతృత్వం లేకుండా వర్గాలు అంతంకావు."

అయితే స్టాలిన్ మరణానంతరం రివిజనిజమ్ వ్యతిరేక పోరాటం కొనసాగలేదు. కృశ్చేవ్ కాలంలో రివిజనిజమ్ సోవియట్ సమాజంలో వేళ్లూనసాగింది. శాస్త్రీయ సోషలిజం సూత్రాలు ప్రక్కదారి పట్టడంతో, సోషలిస్టు సమాజ నిర్మాణంలో బీటలు ఏర్పడ్డాయి. రివిజనిస్టు పోకడలు సోవియట్ సమాజప్రగతికి ఆటంకంగా నిలవడమే గాకుండా, కార్మికసంఘాల పని విధానంలోనూ చొచ్చుకుపోయి, కార్మికుల అవగాహనా స్థాయిని, సైద్ధాంతిక పోరాటాన్ని నీరుకార్చాయి. ఈ పరిస్థితి చక్కబడలేదు. ఇది సామ్రాజ్యవాదానికి సహకరించింది. పశ్చిమ దేశాలలోని పెట్టుబడిదారీ ప్రజాతంత్రపు భావాలు సోవియట్ సమాజంలోకి చొరబడ్డాయి. నెమ్మదిగా అక్కడి కార్మికవర్గం అక్టోబర్ విప్లవపు శాస్త్రీయపునాదిని, విప్లవస్ఫూర్తిని కోల్పోవడం ప్రారంభించింది. చివరికి ఈ ధోరణి గోర్బచేవ్ కాలంలో గ్లాస్‌నాస్త్, పెరిస్త్రోయికాల పేరుతో సోషలిజాన్ని సంస్కరించే స్థాయికి చేరుకొంది. సోషలిస్టు సమాజపు ఆర్థిక నీతి యొక్క మార్క్సిస్టు - లెనినిస్టు పునాదులను త్రోసిపుచ్చి పెట్టే బూర్జువా ఆలోచనలకు ఈ ధోరణి బాటలు వేసింది. సోషలిస్టు సమాజాన్ని నిర్మించిన లక్షలాది ప్రజల అనుభవాలను, మార్క్స్, ఏంగిల్స్, లెనిన్‌ల శాస్త్రీయ అవగాహనా వారసత్వాన్ని ఈ సంస్కరణలు నిర్లక్ష్యంచేశాయి. వీటికి పెట్టుబడిదారీ అర్థశాస్త్రపు వికృత ఆలోచనలు తోడైనాయి. మొత్తం సోషలిస్టు ప్రపంచంలోని విప్లవ ప్రతీఘాత శక్తులకు ఇవి చేయూతనిచ్చాయి. సోషలిజం సాధించిన మహత్తర విజయాలు విస్మరింపబడ్డాయి. చరిత్రను వక్రీకరించారు. అనేక సంవత్సరాలుగా నిర్మింపబడిన సోషలిస్టు వ్యవస్థ మెల్లి మెల్లిగా నాశనం చేయబడింది. సోవియట్ యూనియన్ విచ్ఛిన్నమైంది. రివిజనిజమ్ చేయగల వినాశనాన్ని ఈ కాలం మనకు పాఠంగా అందించింది. అదే విధంగా సమాజ నిర్మాణం సోషలిజం మూలసూత్రాలకు కట్టుబడి ఉండకపోతే, తిరిగి పెట్టుబడిదారీ సమాజానికి పోయే పరిస్థితి ఉందనే విషయాన్ని కూడా మనకు తెలియచేస్తోంది.

మార్క్సిజమ్, లెనినిజమ్ సూత్రాలు, కమ్యూనిస్టు పార్టీ సారథ్యం, సోషలిస్టు పంథా ఉత్పత్తి, పంపిణీ వ్యవస్థ; రాజ్యాంగాధికారాన్ని శ్రామికవర్గ నియంతృత్వంలో, కార్మికవర్గ సారథ్యంలో కొనసాగించడం - ఇవి సోషలిస్టు సమాజం కట్టుబడి వుండాల్సిన సూత్రాలు.

అక్టోబరు విప్లవపు 75వ వార్షికోత్సవం సందర్భంగా ఆ విప్లవాన్ని గూర్చి మనం గుర్తుంచుకోవలసిన విషయం ఒకటుంది. విప్లవంయొక్క శాస్త్రీయ పునాదిని అది తెలియచేయడమే కాకుండా ప్రపంచ విప్లవ పద్ధతులకు అవసరమైన సూత్రాలను కూడా నెలకొల్పింది. అది వెలిగించిన జ్యోతి నాటికీ, నేటికీ కార్మికవర్గానికి, పీడిత జనావళికీ కాంతిమయమైన బాటను చూపుతోంది. సామ్రాజ్యవాదం అజేయమని నమ్మిన రోజులలో, పెట్టుబడిదారీ ప్రపంచం చుట్టుముట్టి ఉన్నాసరే, మార్క్సిస్టు - లెనినిస్టు సూత్రాలకు కట్టుబడి సోషలిజాన్ని విజయవంతంగా నిర్మించవచ్చుననే అనుభవాన్ని అక్టోబరు విప్లవం, దాని తరువాత జరిగిన సోషలిస్టు సమాజ నిర్మాణం మనకు అందచేస్తున్నాయి. అక్టోబరు విప్లవం సామ్రాజ్యవాదాన్ని వణికించి ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థను దారుణంగా దెబ్బతీసింది. ఈనాడు ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ పైచేయిగా ఉన్నట్లు కనిపించినా, మూడో ప్రపంచ దేశాలపై దోపిడీని సాగిస్తున్నా అక్టోబరు విప్లవం చేసిన గాయాల నుండి బయట పడడం పెట్టుబడిదారీ వ్యవస్థకు సాధ్యం కావడంలేదు.

పెట్టుబడిదారీ దేశాలలోనూ, పెట్టుబడిదారీ పంథాలో సాగుతున్న సోవియట్ యూనియన్, ఇతర తూర్పు యూరప్ దేశాలలోనూ ఈ విషయాన్ని మనం గమనించవచ్చు. అన్ని పెట్టుబడిదారీ దేశాలలోనూ నిరుద్యోగం పెరుగుతోంది. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలోని నిరుద్యోగం పెరుగుదల ఈ క్రింది పట్టిక చూపుతుంది.

| | 1990 | 1991 | 1992 (అంచనాలు) |
|---|---|---|---|
| అమెరికా | 5.6% | 6.8% | 7.2% |
| బ్రిటన్ | 5.8% | 8.5% | 10% |
| ఇటలీ | 9.7% | 9.9% | 10.6% |
| ఫ్రాన్స్ | 8.9% | 9.5% | 10% |
| జపాన్ | 2.1% | 2.2% | 2.4% |
| స్పెయిన్ | 15% | 15.6% | 15.8% |
| కెనడా | 8.3% | 10.6% | 10.8% |
| స్వీడన్ | 1.6% | 3.1% | 4.2% |
| ఆస్ట్రేలియా | 7.3% | 9.8% | 10.7% |

ఈ దేశాలన్నింటా ద్రవ్యోల్బణం, ధరల పెరుగుదల, ఆర్థికమాంద్యం పెరుగుతూనే ఉన్నాయి. మూసివేతలు, లే-ఆఫ్‌లు నిత్యకృత్యమైనాయి. ఈ దేశాలలో కార్మికులు పెద్ద సంఖ్యలో సమ్మెలకు పాల్పడుతున్నారు. ఈమధ్య కాలంలో జర్మనీ, బ్రిటన్ దేశాలలో అత్యధికంగా సమ్మెలు జరిగాయి.

సోవియట్ యూనియన్‌తో సహా పూర్వపు సోషలిస్టు దేశాలలో "మార్కెట్ ఆర్థికవిధాన నీతి" పై మోజు తీరిపోతోంది. ద్రవ్యోల్బణం రేటు ఈ దేశాలలో మూడంకెల సంఖ్యకు, కొన్నింట నాల్గు అంకెల సంఖ్యకు చేరుకొంది. నిరుద్యోగం రోజు రోజుకూ లక్షలలో పెరిగిపోతోంది. పెట్టుబడిదారీ ఆర్థికవిధానం ఈ దేశాలను ఏ విధంగా సమస్యలకు గురి చేస్తోందో ఈ క్రింది అంకెలు తెలియచేస్తాయి.

| | 1989 | 1990 (శాతంలో) | 1991 (అంచనాలు) |
|---|---|---|---|
| **బల్గేరియా :** | | | |
| జి.డి.పి. | 0.4 | 11.8 | 17.0 |
| వినియమధరల సూచి | 5.6 | 23.8 | 338.5 |
| నిజ జీతాలు | 3.0 | 6.2 | 42.3 |
| ఉద్యోగాలు | 2.6 | 6.1 | 14.5 |
| **చెకొస్లోవేకియా :** | | | |
| జి.డి.పి. | 0.7 | 1.1 | 16.0 |
| వినిమయధరల సూచి | 1.0 | 10.0 | 57.9 |
| నిజ జీతాలు | 1.3 | 5.8 | 26.3 |
| ఉద్యోగాలు | 0.3 | 0.4 | 7.4 |
| **హంగరీ :** | | | |
| జి.డి.పి. | 0.4 | 3.3 | 10.0 |
| వినిమయధరల సూచి | 17.0 | 28.9 | 35.0 |
| నిజ జీతాలు | 1.9 | 5.1 | 8.0 |
| ఉద్యోగాలు | 90.9 | 2.0 | 6.0 |
| **పోలండ్ :** | | | |
| జి.డి.పి. | 0.0 | 9.0 | 11.6 |
| వినిమయధరల సూచి | 251.1 | 585.8 | 70.3 |
| నిజ జీతాలు | 9.0 | 24.4 | 0.8 |
| ఉద్యోగాలు | 0.6 | 3.6 | 5.5 |
| **రుమేనియా :** | | | |
| జి.డి.పి. | 5.8 | 7.4 | 14.0 |
| వినిమయధరల సూచి | 0.9 | 7.4 | 444.5 |
| నిజ జీతాలు | 3.1 | 2.9 | 20.3 |
| ఉద్యోగాలు | 1.1 | 0.2 | 11.6 |

(ఐ.ఎమ్.ఎఫ్. సర్వే – ఆగస్టు 17, 1992)

అందువలన, మానవాళి ప్రగతికి పెట్టుబడిదారీ విధానం సమాధానం కాదు అనే విషయం అర్థమౌతుంది. పెట్టుబడిదారీ విధానంలో అంతర్గతంగా ఉండే వైరుధ్యాలు, లాభాపేక్షతో నడిచే ఉత్పత్తి పద్ధతి, వీటి కారణంగా సంక్షోభాలు ఏర్పడి పెట్టుబడిదారీ విధానం నాశనానికి దారితీస్తుంది. ఈరోజు అమెరికా తన సైనిక బలంతో ఒక క్రొత్త ప్రపంచ పరిస్థితిని తయారు చేసేందుకు సిద్ధమౌతోంది. అదే సమయంలో అమెరికా ఆర్థిక సంక్షోభంలో చిక్కుకొని, ప్రపంచంలోనే అతిపెద్ద అప్పుల పాలైన దేశంగా నిలచి వుంది. అయితే తన సంక్షోభం నుండి బయట పడేందుకు మూడో ప్రపంచదేశాలమీద, సోషలిస్టు దేశాలమీద తన ఆధిపత్యాన్ని నెలకొల్పేందుకు ప్రయత్నిస్తోంది. క్యూబాపై దిగ్బంధనం, ఇరాక్‌పై హెచ్చరికలు, మూడో ప్రపంచ దేశాలపై ముఖ్యంగా భారతదేశంపై వత్తిడి, ఇవన్నీ అమెరికా చర్యలకు కొన్ని ఉదాహరణలు మాత్రమే. అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ ద్వారా వత్తిడి తీసుకువచ్చి నరసింహారావు ప్రభుత్వం తమకు అనుకూలమైన విధానాలను రూపొందించేలా చేయడమేగాక, డంకెల్ ప్రతిపాదనలను అంగీకరించే విధంగా అమెరికా తన వత్తిడిని కొనసాగిస్తూనే ఉన్నది.

అక్టోబరు విప్లవం 75వ వార్షికోత్సవం సందర్భంగా, ఆ మహత్తర విప్లవ పతాకాన్ని అది అందించిన విజయాలనూ, పై పైకి ఎగరేస్తామని, సి.ఐ.టి.యు, అదే విధంగా మొత్తం కార్మిక వర్గం ప్రతిజ్ఞ పూనాలి. కార్మికవర్గం విప్లవ ప్రతిఘాత శక్తులను, తిరస్కరించి పెట్టుబడిదారీ అభివృద్ధి పంథాను వ్యతిరేకించాలి. సోషలిజం, ప్రజాతంత్రం శాంతి కొరకు ఐక్య పోరాటాలను తీవ్రం చేయాలి.

మన దేశ ఆర్థిక సార్వభౌమత్వాన్ని హరించేందుకు సామ్రాజ్యవాదులు చేస్తున్న ప్రయత్నాలను త్రిప్పికొట్టేందుకు, మనదేశంలోని కార్మికవర్గం తన పోరాటాలను మరింత తీవ్రతరం చేయాలి.

నవంబరు 29, 1991 నాటి సమ్మె, అదే విధంగా జూన్ 16, 1992 నాటి సమ్మెల ద్వారా చేకూరిన ప్రయోజనాలను పటిష్టం చేసుకోవాలి. నవంబరు 25, 1992 నాడు జరిగే "మార్చ్ టు పార్లమెంట్" ను విజయవంతం చేయాలి.

అక్టోబరు విప్లవపు 75వ వార్షికోత్సవం ఐక్య కార్మిక పోరాటాలకు స్ఫూర్తినీయాలి. ఈ స్ఫూర్తితో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం కొనసాగించేందుకు, భారతదేశ సార్వభౌమత్వాన్ని నీరుకార్చే కుతంత్రాలను త్రిప్పికొట్టేందుకు, శాస్త్రీయ సోషలిజాన్ని పరి రక్షించేందుకు కార్మికవర్గం కంకణం కట్టుకోవాలి.

# కనీస వేతనాల అమలుకై ఉద్యమించిన కార్మికవర్గం

కొండ్రగుంట వెంకటేశ్వర్లు, సి.ఐ.టి.యు. రాష్ట్ర కార్యదర్శి

రాష్ట్రంలో కనీస వేతనాలు అమలు జరుగుతున్న తీరుపట్ల సి.ఐ.టి.యు రాష్ట్ర కౌన్సిల్ తీవ్ర అసంతృప్తిని వ్యక్తం చేసింది. కనీస వేతనాలకై కార్మికులు సాగించే ఆందోళన పట్ల ప్రభుత్వం నిర్లక్ష్యంగా వ్యవహరిస్తోంది. అధికారుల ఆసరాతో యజమానులు కార్మిక సంఘాలపైనా, కార్మికులపైనా కక్షసాధింపు చర్యలకు పూనుకుంటున్నారు. ప్రభుత్వ యంత్రాంగం యావత్తు అవినీతికి నిలయంగా మారిపోయింది. ఈ దుస్థితి కారణంగా అక్టోబరు 20వ తేదీన రాష్ట్రంలోని అన్ని జిల్లా పట్టణ కేంద్రాలలో ప్రదర్శనలు, ధర్నాలు నిర్వహించాలని, కనీస వేతనాల అమలును డిమాండ్ చేయాలని సి.ఐ.టి.యు. రాష్ట్ర కౌన్సిల్ నిర్ణయించింది.

రాష్ట్రంలో కనీస వేతనాలు వర్తింప చేసే షెడ్యూలు పరిశ్రమల పార్ట్-1 క్రింద 55, పార్ట్ - 2 క్రింద 9 వున్నాయి. వీటిల్లో సగం గత రెండు సంవత్సరాలుగా కనీస వేతనాలు సవరించబడలేదు. 1990 ఆగస్టులో డ్రాఫ్ట్ ప్రతిపాదనలు ప్రకటించి యిప్పటికి తుది నోటిఫికేషన్ యివ్వని పరిశ్రమలున్నాయంటే ప్రభుత్వం ఎంత గాఢ నిద్దురలో వుందో అర్థం అవుతుంది. ఉదాహరణకు స్టీలు మిల్లులు, రీ రోలింగ్ మిల్లుల వంటి వాటిని చెప్పవచ్చు. మరో దారుణమేమంటే కాగితం, కాగితం బోర్డు సంస్థలలో గత ఆరేడు సంవత్సరాలుగా లిటిగేషన్‌తో కనీస వేతనాల సవరణ జరగనేలేదు.

## దారిద్ర్య రేఖ దాటని కనీస వేతనాలు

రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించిన, నిర్ణయించుతున్న కనీస వేతనాలు అతి స్వల్పంగా వున్నాయి. దారిద్ర్యరేఖ కంటే దిగువన వున్నాయి. నైపుణ్యంలేని కార్మికునికి నెలకు రు. 560-650 మధ్య కనీస వేతనంగా నిర్ణయించారు. ఈ మొత్తం దారిద్ర్య రేఖకంటే దిగువన వున్నది. ఇటీవలనే పార్లమెంటులో ప్రణాళిక శాఖ సహాయమంత్రి భరద్వాజ యిచ్చిన సమాచారం ప్రకారం 1991-92 పారిశ్రామిక వినిమయదారుల సూచి ప్రకారం సంవత్సరానికి రు. 11,090 లు దారిద్ర్యరేఖకు హద్దుగా చెప్పారు. అంటే నెలకు రు. 925 లు వుంటేనే దారిద్ర్యరేఖను దాటుతుంది. దీనినిబట్టి మన రాష్ట్రంలో నిర్ణయించబడుతున్న కనీస వేతనాలు దారిద్ర్యరేఖ కంటే కూడా చాలా దిగువన వున్నాయని తెలుస్తుంది.

అనేక సంవత్సరాలుగా రాష్ట్రంలో కనీస వేతనాలు వర్తించే షెడ్యూలు కార్మికులకు కరువు భత్యం అంటూ లేదు. రాష్ట్రంలో సి.ఐ.టి.యు. యితర కార్మిక సంస్థల ఆందోళన ఫలితంగా తెలుగుదేశం ప్రభుత్వం కరువుభత్యం జోడింపును సూత్రప్రాయంగా ఆమోదించింది. తరువాత వచ్చిన కాంగ్రెస్ (ఐ) ప్రభుత్వం నిమ్మకు నీరెత్తినట్లుగా వున్నది. 1991లో సి.ఐ.టి.యు.తో పాటు యితర కేంద్ర కార్మిక సంఘాలు కలిసి శాసన సభ వద్ద దాదాపు 30 వేలమంది కార్మికులతో ప్రదర్శన జరిపాయి. తత్ఫలితంగా కరువుభత్యం, కనీస వేతనాలను జోడించడం జరిగింది. ఇది కూడా ఆరుమాసాల కొకసారి లేబర్ కమీషనర్ ప్రకటించాలి. అయితే దీనిని యజమానులు సవాల్ చేస్తూ పన్నెండు షెడ్యూల్స్‌తో హైకోర్టులో స్టే ఉత్తర్వులు తెచ్చారు. షాప్స్ అండ్ ఎస్టాబ్లిష్‌మెంట్స్ హోటల్స్ అండ్ రెస్టారెంట్స్, సినిమాహాళ్ళు, ప్రింటింగ్ ప్రెస్‌లు, క్యాంటీన్స్, క్లబ్ లు, తోళ్ళ పరిశ్రములు, చేపలు మరియు సముద్ర ఉత్పత్తులు, పబ్లిక్, ప్రైవేట్ మోటార్ ట్రాన్స్‌పోర్ట్, మార్కెటింగ్ సొసైటీలు, బీడీ పరిశ్రమ తదితరములపై స్టే ఉత్తర్వులు కొనసాగుతున్నాయి. ఆరుమాసాల నుంచి సంవత్సరంపైగా కాలం గడిచినప్పటికీ యింత వరకు స్టే ఉత్తర్వులు ఎత్తివేయలేదు. ఇందువల్ల కార్మికులు ఆర్థికంగా కొన్నికోట్ల రూపాయల మేరకు నష్టపోతున్నారు.

## ధరల సూచి

పారిశ్రామిక వినిమయ సూచి 169 పాయింట్లపై కనీస వేతనాలు దిగువ తరగతి వారికి 550-650 మధ్య నిర్ణయిస్తూ పెరిగిన పాయింట్లకు మూడు రూపాయల దిగువ స్లాబ్ రేటుగా నిర్ణయించారు. 1992 సెప్టెంబరు ధరల సూచి 239 పాయింట్లకు చేరింది. అంటే 70 పాయింట్లు పెరుగుదలకు రు. 210 లు కరువు భత్యం రూపంలో యివ్వాలి. కోర్టు స్టేలతో గానీ, యజమాని నిరాకరణ వల్లకాని కరువుభత్యం పొందకపోవటంతో ప్రతినెల కార్మికులు ఎంతగా నష్టపోతున్నారో దీనివల్ల అర్థమవుతుంది. 1960-100 పాయింట్లు పునాది ధరల సూచిని కేంద్ర ప్రభుత్వం 1982-100 పాయింట్లు పునాది ధరల సూచిని కేంద్ర ప్రభుత్వం 1982-100 పాయింట్లు పునాదికి మార్చింది. దీనిని సి.ఐ.టి.యు., ఇతర కేంద్ర కార్మిక సంఘాలు ఆనాడే నిరసించాయి. 1960 సూచి ప్రకారం అయితే 845 పాయింట్ల నుండి పారిశ్రామిక వినిమయదారుల సూచి 1195 పాయింట్లకు పెరిగింది. ధరలు ఎంత వేగంగా పెరుగుతున్నాయో యీ పాయింట్లను బట్టి తెలుస్తుంది. కేంద్ర ప్రభుత్వ నూతన ఆర్థిక పారిశ్రామిక విధానల దుష్ఫలితమే యిది.

## వ్యవసాయ కార్మికులు

రాష్ట్రంలో పార్ట్ రెండు క్రింద కనీస వేతనాలు ఒక కోటిమంది వ్యవసాయ కార్మికులకు వర్తింపచేయాల్సి వుంది. వీరికి డి.ఎ. వర్తింపు చేయలేదు. ఇదొక విచిత్ర జోన్ల వారీ మూడు జోన్‌లలో కనీస వేతనాలను తేడాలతో నిర్ణయించబడ్డాయి. ఊడ్పులు, కోతలు మొదలైన వాటికి మొదటి జోన్‌లో దినసరి రు. 19.25, రెండవ జోన్‌లో రు. 16.80, మూడవ జోన్‌లో రు. 15.00 గా వేతనం నిర్ణయించారు. ఇది ఎక్కడా అమలు జరిపే ప్రభుత్వ యంత్రాంగం లేదు. సంఘం చైతన్యంలో పోరాడిన చోట కొద్దిగానైనా అమలవుతున్నాయి.

## కనీస వేతనాల షెడ్యూలు

మొదటి పార్ట్‌లో 30,000 ఫ్యాక్టరీల్లో పది లక్షల మంది కార్మికులుండగా, దుకాణాలు, సంస్థల్లో మూడు లక్షల మంది, హోటళ్ళు, రెస్టారెంట్లలో రెండు లక్షల మంది, మోటారు రవాణా కార్మికులు మూడు లక్షలమంది, బీడీ, చుట్టల కార్మికులు మూడు లక్షలమంది, చేనేత కార్మికులు 30 లక్షలమంది, ఈ విధంగా 50 లక్షలకు పైగా కార్మికులు కనీస వేతనాల చట్టం పరిధిలో

వున్నప్పటికీ వారికి ప్రభుత్వ యంత్రాంగం కల్పిస్తున్న రక్షణ మృగ్యం. కనీస వేతనాలు అతి స్వల్పం. అవి కూడా అమలు జరగవు. అమలుకు డిమాండ్ చేస్తే ఉద్యోగ భద్రత లేదు. నియామక పత్రాలు వుండవు. సంఘం పెట్టుకుంటేచాలు తీసివేతలు, మూసివేతలు, దౌర్జన్యాలకు కార్మికులు నిరంతరం గురవుతున్నారు. వీటికి వ్యతిరేకంగా సి.ఐ.టి.యు. పోరాడుతున్నది. సి.ఐ.టి.యు. అంటే కక్షతో వ్యవహరిస్తున్న కరడుగట్టిన యజమానులకు ప్రభుత్వ యంత్రాంగం పోలీసు యంత్రాంగంతో సహా తోడ్పాటునిస్తున్నాయి.

రంగారెడ్డి జిల్లాలోని జీడిమెట్ల వద్ద తోళ్ళ పరిశ్రమ యజమానికి (హన్యా ఎంటర్ ప్రైజెస్) ప్రభుత్వం కొమ్ముగాచి యూనియన్ పై దాడులు సాగించారు. అలాగే తణుకు వద్ద కోస్టల్ ఆగ్రో ఇండస్ట్రీస్, ప్రకాశం జిల్లా మార్చూరు వద్ద స్పిన్నింగ్ మిల్లు యజమానుల కార్మిక వ్యతిరేక చర్యలు ఉదాహరణలు.

## కాంట్రాక్టు కార్మికులు

ఎటువంటి చట్టబద్ధ హక్కులు లేకపోవడంతో కాంట్రాక్టు కార్మికులు విపరీత దోపిడీకి గురవుతున్నారు. వారికి ఉద్యోగ భద్రత లేదు. కాంట్రాక్టు కార్మికుల కనీస వేతనాల పెంపుకై సి.ఐ.టి.యు. పోరాడింది. లోగడ వున్న దినసరి వేతనం రు. 19.25ను పెంచాలని గట్టిగా పోరాడిన ఫలితంగా అది డ్రాఫ్టులో రు. 24గా వచ్చి చివరకు తుది నోటిఫికేషన్ లో అన్‌స్కిల్డ్‌కు రు. 30, సెమీస్కిల్డ్ రు. 40, స్కిల్డ్ రు. 50 లుగా నిర్ణయించడానికి సి.ఐ.టి.యు. కృషి ఎంతో వుంది. ఇతర ట్రేడ్ యూనియన్ లను కూడా కలుపుకుని చేసిన కృషి ఫలితమిది. అయితే కాంట్రాక్టు కార్మికులకు డి.ఎ. జోడింపు చేయకపోవడం విచారకరం. ప్రభుత్వం వివక్షతా వైఖరి విడనాడాలి.

కార్మికశాఖ అధికారుల అవినీతి నిర్లక్ష్యం, అసమర్థతతో కనీస వేతనాలు అమలు జరగక, ఉద్యోగ భద్రత కరువై లక్షలాది కార్మికులు ఎంతో నష్టపోతున్నారు. ఆందోళన చెందుతున్నారు. సంవత్సరం పైగా వేతనాలను సవరించకపోవటం క్షంతవ్యం కాదు. అందుకే రాష్ట్ర ప్రభుత్వాన్ని, కార్మిక శాఖను నిద్దుర లేపేటందుకు అక్టోబరు 20న సి.ఐ.టి.యు. పిలుపుపై కార్మికులు తమ నిరసనను ధర్నాలు, పికెటింగ్ లు, ప్రదర్శనల రూపంలో వ్యక్తం చేశారు. నేటి ధరల కనుగుణంగా కనీస వేతనాన్ని దారిద్ర్యరేఖకు పైగానైనా పెంచాలని, వి.డి.ఎ. విధిగా వర్తింపు చేయాలని, నిర్ణయించిన కనీస వేతనాలు ఖచ్చితంగా అమలు చేయాలని, ఉద్యోగ భద్రత ఏర్పరచాలని చట్టబద్ధమైన యితర సౌకర్యాలను కలిగించాలని వంటి న్యాయబద్ధమైన కోర్కెల కోసం కార్మికవర్గం పోరాడాలి.



పోర్ట్ కొచ్చిన్‌లో నిర్మాణ కార్మికుల అఖిలభారత మహాసభలో డా. ఎస్.కె. పాండే, ఇ.కె. నయనార్ తదితరులు

## పంజాబ్

### కనీస వేతనాలకోసం సమ్మె

అక్టోబరు 9వ తేదీన పంజాబ్ రాష్ట్ర మంతటా కనీసవేతనాల కోసం రెండున్నర లక్షలమంది కార్మికులు లాంఛన సమ్మె చేశారు. గత రెండు సంవత్సరాలుగా కనీస వేతనాలు సవరింపు జరగలేదు. తిరిగి పునర్నియమం జరగాలని కోరుతూ సి.ఐ.టి.యు., ఎ.ఐ.టి.యు.సి., బి.ఎమ్.ఎస్., హెచ్.ఎమ్.ఎస్. ల రాష్ట్ర శాఖలు జాయింటుగా సమ్మెకు పిలుపునిచ్చినవి. పారిశ్రామిక కేంద్రాలన్నిటా సమ్మె జయప్రదంగా జరిగింది. రోడ్డు పనివారు, ఇటుకబట్టీల కార్మికులు, ఎఫ్.సి.ఐ. కార్మికులు హోషియార్ పూర్, పాటియాలా, అమృత జిల్లాల్లో గణనీయంగా సమ్మెలో చేశారు. ప్రదర్శనలు, సభలు జరిపారు.

సమ్మె పిలుపు జాయింటుగా యిచ్చిననూ ఎ.ఐ.టి.యు.సి. వారు కొన్ని కేంద్రాలలో శ్రద్ధ చూపలేదు. కొన్ని చోట్లనయితే వ్యతిరేకంగా కూడ పనిచేశారు.

ఆదే సందర్భంలో గమనించవలసిన విషయమేమంటే ఐ.ఎన్.టి.యు.సి నాయకత్వం అధికారయుతంగా సమ్మెను వ్యతిరేకిస్తూ ప్రకటనలు చేసినప్పటికీ ఐ.ఎన్.టి.యు.సి. అనుబంధ సంఘాలు కొన్ని వాటి సభ్యులూ సమ్మెలో చేరారు.

మరొక విషయం ఏమంటే సుఖ, జిందాలు యిద్దరూ వురితీయబడినందున ఉద్రిక్త వాతావరణం నెలకొనియుంది. అయినప్పటికీ బియాంత్‌సింగ్ ప్రభుత్వం కార్మికుల కనీసవేతనాలు సవరించకుండా పూర్తి నిర్లక్ష్యం ప్రదర్శించినందున ఆగ్రహోదగ్రులైయున్నారు. అందువలన అన్ని కాల నిర్బంధాలనూ తట్టుకొని, నిషేధాలన్నింటిని త్రోసిపుచ్చి ప్రదర్శనలు జరిపారు.

ఆ విధంగా కనీస వేతన సవరణ కోసం బ్రహ్మాండమైన సమ్మె జరిపారు.

## బి.హెచ్.పి.వి. లో మిత్రపక్ష ఫ్రంటు గెలుపు

బి.హెచ్.పి.వి. నేషనల్ ఎంప్లాయీస్ యూనియన్ ఎన్నికలలో సి.ఐ.టి.యు, టి.ఎఫ్.టి.యు.సి., ఎ.ఐ.టి.యు.సి., ఎ.ఐ.సి.టి.యు., ఐ.ఎన.టి.యు లతో కూడిన ఫ్రంటు అత్యధిక స్థానాల్లో విజయం సాధించింది.

యాజమాన్యం ఐ.ఎన్.టి.యు.సి. లు అనేక ప్రలోభాలు కల్పించినా కార్మికులు వాటికి లొబడక 9 స్థానాల్లో 7 స్థానాల్లో మిత్రపక్షాల ఫ్రంటు అభ్యర్థులనే గెలిపించారు, ఫ్రంటు తరపున 12 మంది కమిటీ సభ్యులు గెలుపొందారు.

కుల మత తత్వాలతో కార్మికులను చీల్చి, వినాశకరమైన నూతన పారిశ్రామిక విధానాలను సమర్థించే బి.యం.యస్. ను ఓడించడం ద్వారా కార్మికులు నవ చైతన్యాన్ని ప్రదర్శించారు.

మిత్రపక్షాల ఫ్రంటు విజయం సాధించడం పట్ల విశాఖ జిల్లా సి.ఐ.టి.యు. అధ్యక్ష కార్యదర్శులు, పి.వి. సుబ్బారావు, సి.హెచ్. నరసింగరావులు హర్షం వ్యక్తం చేశారు.

## NAMES OF THE EMPLOYMENTS INCLUDED IN THE SCHEDULE TO THE MINIMUM WAGES ACT, 1948 ANDHRA PRADESH

### PART - I

| Sl. No. 1 | Scheduled Empt. No. 2 | Name of the Employment 3 |
|---|---|---|
| 1. | 1. | Employment in Woolen Carpet or Shawl Weaving Establishments |
| 2. | 2. | Empt. in any Rice Mills, Flour Mills, Dall Mills including Roller Flour Mills |
| 3. | 3. a) | Empt. in any Tobacco (Including Beedi Making) Manufactory |
| 4. | 3. b) | Empt. in any Tobacco (Excluding Beedi Making) Manufactory |
| 5. | 4. | Employmentt in any Coffee Plantations |
| 6. | 5. | Empt. in any Oil Mills |
| 7. | 6. | Employment in any Local Authorities. Emempted |
| 8. | 7. | Empt. in Construction or Maintenance of Roads and Buildings Operations |
| 9. | 8. | Empt. in any Stone Breaking and Stone Crushing Operations |
| 10. | 9. | Empt. in any Lac Manufactory not in existance |
| 11. | 10. | Empt. in any Mica Works |
| 12. | 11. | Empt. in any Public Motor Transport |
| 13. | 12. | Empt. in any Tanneries and Leather Manufactory |
| 14. | 13. | Employment in any Cinemas |
| 15. | 14. | Empt. in Wood Working Establishments including Wooden Furniture Works and excluding Timbering Operations |
| 16. | 15. | Empt. in any Hotels, Restaurants or Eating Houses |
| 17. | 16. | Empt. in any Salt Pans |
| 18. | 17. | Empt. in any Printing Presses including Litho & Offset Printing Presses |
| 19. | 18. | Empt. in Metal Foundaries and General Engineering |
| 20. | 19. | Empt. in any Automobile Engineering Workshops including Servicing and Repairs |
| 21. | 20. | Toddy Tapping including selling and Conveyance |
| 22. | 21. | Any Marketing Societies, Consumer Co-operative Societies and Co-op. Banks |
| 23. | 22.a) | Any Handloom Weaving Establishments |
| | b) | Any Handloom (Silk) Weaving Establishments |
| | c) | Addl. Categories in Handloom Weaving Establishments |
| 24. | 23. | Any Cotton Carpet Weaving Establishments |
| 25. | 24. | Any Cotton Ginning and Pressing Factories |
| 26. | 25. | Any Shops and Commercial Establishments |
| 27. | 26. | Cashew Processing Establishments |
| 28. | 27. | Motion Picture Industry including Production, Distribution and Publicity |
| 29. | 28. | Any News Paper Estts. excluding Working Journalists regarding. Exempted. |
| 30. | 29. | Any Khandasari Factories |
| 31. | 30. | Paper and Paper Board Manufactory including Hand made Paper |
| 32. | 31. | Any Powerloom Establishments |

| | | |
|---|---|---|
| 33. | 32. | Tiles and Potteries |
| 34. | 33. | Clubs and Canteens |
| 35. | 34. | Any Baking Process including Biscuit Manufactory |
| 36. | 35. | Any Cement Concrete Pipes and other Cement Ware manufactory & excluding Stone ware Manyfactory |
| 37. | 36. | Private Motor Transport excluding Motor Cars |
| 38. | 37. | Colour Printing and Yard Dyeing |
| 39. | 38. | Hospitals, Nursing Homes, Clinics other than Govt. Hospitals and Dispensaries |
| 40. | 39. | Match and Fire works manufactory |
| 41. | 40. | Petrol Bunks |
| 42. | 41. | Chemicals and Pharmaceuticals including Pesticides |
| 43. | 42. | Slate Factories |
| 44. | 43. | Distilleries and Brewaries |
| 45. | 44. | Construction of Projects including Dams and Multi-purpose Projects |
| 46. | 45. | Brick Kiln Industry |
| 47. | 46. | Fisheries and Sea-Foods Industry |
| 48. | 47. | Ests. or Professions such as Chartered Accountants/Auditors, Income Tax-Consultants & other Consultants and Clerks working with Advocates. |
| 49. | 48. | Private-Educational Institutions & Non-Teaching Staff. (Govt. deferred for the present) |
| 50. | 49. | Any Steel Mills & Steel Re-rolling Mills |
| 51. | 50. | Gold Covering and Gold Coating Industry |
| 52. | 51. | Jute and Coir Industry |
| 53. | 52. | Electronic Industry |
| 54. | 53. | Glass Industry |
| 55. | 54. | Hostels of all Colleges and all other Educational Institutions |
| 56. | 55. | Seeds Processing units |

## PART - II

| | | |
|---|---|---|
| 1. | 1. | Agriculture |
| 2. | 2. | Forestry and Timbering Operations |
| 3. | 3. | Dairy Farming including Cattle Feeding Units and Conveyance |
| 4. | 4. | Horticulture including Mango, Lime, Citrus and other Fruits, Flowers and Vegetables |
| 5. | 5. | Poultry Farming including Feeding Units and Conveyance |
| 6. | 6. | Sericulture |
| 7. | 7. | Cashew and Coconut Gardens |
| 8. | 8. | Betal Vines |
| 9. | 9. | Grass Cutting Workers |

Dear
**Readers, Agents and Subscribers,**

**WITH OCTOBER REVOLUTION GREETINGS**

***- KARMIKALOKAM***

Published by Sri Nanduri Prasad Rao on Behalf of CITU AP State Committee for 1-1-60/4, RTC X Roads, Hyderabad - 20. Printed at Sruthi Computer Graphics, 1-8-522/27/9, Opp. SBH, Chikkadpally, Hyderabad - 20. tel. : 665051 for Pushpa Printers.

## ఐ.ఎం.ఎఫ్. అప్పు – దేశానికే ముప్పు








| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLV01A253 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 24/8/23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | Nandhu |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనిది | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |